*Issued on 11—9—1956*




# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*SATURDAY, 24th SEPTEMBER, 1955.*

VOLUME VIII — No. 3.

CONTENTS




PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

PRICE 6 annas.

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Saturday 24th September*, 1955.

The House met in the Assembly Hall Kurnool at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS.

MR. SPEAKER : Questions Nos. 414 and 415 will be taken up together.

*Subsidy under various Wells Schemes.*

414—

*225 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the number of wells to which subsidy was granted under various wells schemes;

(b) the amount of subsidy;

(c) the number of wells completed; and

(d) whether there is extension of time till now ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) The number of wells for which subsidy was granted under the various well subsidy schemes is 36,620.

(b) the amount of subsidy given is Rs. 2,09,41,249.

(c) the number of wells completed upto 31st March, 1955 is 20,610.

(d) No, Sir. The extension of time granted for completion of the well works has already expired on 30th September 1954.

24th September 1955]

*Collection of subsidy given for Wells.*

415—

*1099 Q.—SRI V. VISVESWARA RAO: Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether the Government have issued orders to collect the well subsidy loans given to the ryots for digging agricultural wells; and

(b) whether it is a fact that special orders have been issued by the Government exempting Nuzvid taluk from recovery of these loans?

THE HON. SRI B. GOPALA REDDI:—

(a) Under the scheme of well subsidies the loans advanced to the ryots for sinking wells will be treated as subsidy only if the work is duly completed within the specified date, i.e., 30th September 1954. If the ryot to whom the loan is advanced takes no steps to sink a well or fails to sink a satisfactory well by the prescribed date, the amount advanced together with interest thereon is liable to be recovered summarily.

(b) No, Sir.

SRI S. VEMAYYA:—కొన్ని కొన్నిచోట్ల ఆర్థికయిబ్బందులవల్లగాని seasonal conditions వల్లగాని అనేకమైన బావులుత్రవ్వి complete చేయ లేకపోయినవారికి యింకా ఒక సంవత్సరమో, రెండు సంవత్సరాలో కాలపరిమితి పొడిగించటానికి ప్రభుత్వం పూనుకుంటుందా?

THE HON SRI B. GOPALA REDDI:—లేదండి.

SRI V. VISWESWARA RAO:—కొన్నిబావులు త్రవ్వించారు. వాటికి measurements సరిగాలేవు అనిగాని, లేక నీరు తక్కువగా వున్నదనిగాని, ఏదో కారణముపెట్టి అక్కడవున్న స్థానిక ఉద్యోగులు సగము అని, మూడు వంతులు అని యీ విధంగా refund చెల్లించాలని అంటున్నారు. అటువంటి వాటి విషయములో విజ్ఞప్తిని పునర్విచారణచేసి వారు చెల్లించవలసిన మొత్తములను refund చేయ నవసరము లేకుండా subsidy గా treat చేయటానికి ప్రభుత్వము పూనుకుంటుందా?

THE HON. SRI B. GOPALA REDDI:—అటువంటి కేసులు ఏవైనా వుంటే, కలెక్టరు నోటీసుకు తీసుకొనివస్తే ఆయన తప్పకుండా విచారిస్తారు. తరువాత

subsidy విషయములో Government of India వారు కొంత భాగమయిస్తారు. పోయిన ఏప్రియల్ ఆఖరులోపలనే కేంద్ర ప్రభుత్వమువారు యీ బావులు అన్నీ పూర్తిచేయాలని, ఆపైనవాటికే యివ్వటానికి వీలులేదని వారు ఖచ్చితముగా చెప్పారు. ఏప్రియల్ నుంచి సెప్టెంబరు నెలవరకు జరిగిన adjustments అన్నిగూడా యీ ప్రభుత్వమువారే పెట్టుకోవలసివస్తుంది. April ఆఖరులోపుగా complete అయిన బావులకు మాత్రము కేంద్రప్రభుత్వమువారి subsidy వుంటుంది. ఆ తరువాత జరిగిన adjustments విషయములో కేంద్రప్రభుత్వమువారు subsidy యివ్వరు. అందువల్ల యిది అంతా ఎంతత్వరగా settle చేస్తే అంతమంచిదనే వుద్దేశ్యముతో ప్రభుత్వము వుంటున్నది.

SRI N. P. CHANGALRAYA NAIDU :—ఈ subsidy లతో బావులు తవ్వించారు. త్రవ్విన రెండు సంవత్సరాలనుంచి పైర్లువేస్తున్నారు. అయితే ఆ పైన decorations, అంటే బావులకు revitment కట్టేది, యిటువంటివి తేవ్ర అనే కారణముతో మొత్తము వసూలుచేస్తున్నారు. గడ్డ గట్టిగావున్నది కాబట్టి యీ decorations చేయడము అవసరమువుండదు. గనుక దాని విషయములో ప్రభుత్వము ఏమైనా వుత్తరువులు యిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—మొట్ట మొదటవారు ఏ conditions మీద ఆ బావులు త్రవ్విస్తామని అప్పు తీసుకున్నార్లో, ఆ conditions అన్నీ పూర్తిచేయవలసినదే. వాటి విషయములో ఏమైనా hard cases వుంటే, అవి కలెక్టరు నోటీసుకుతెస్తే, ఆయన విచారిస్తారు.

SRI P. RAJAGOPAL NAIDU :—బావులు అన్నీ పూర్తిచేశారు. కాని అధికవర్షాలవల్ల కట్టిన revitments అన్నీ పడిపోయినవి. ఏటి గట్లు తెగిపోయినందువల్ల బావులలోకి యిసుకమట్టి కొట్టుకొని వచ్చినందువల్ల బావులు పూడిపోయినవి. అటువంటి బావులవిషయములో demand చేయకుండా cancel చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అటువంటి బావుల విషయములలోకూడా demand చేయకుండా cancel చేయటానికి వీలులేదు. ఆ బావులు ఏ షరతులమీద త్రవ్విస్తామని డబ్బు తీసుకున్నారో, ఆ conditions కు లోబడి పూర్తిచేయవలసి వుంటుంది.

SRI R. B. RAMAKRISHNA RAJU :—గడువులోపల పూర్తిచేయక పోయినప్పటికినీ, గడువుతరువాత పూర్తిచేసిన బావులు చాలావున్నవి. అటువంటి బావులవిషయములోనైనా దీన్ని subsidy గా treat చేయటానికిగాని, లేక అది

సాధ్యపడకపోతే, easy instalments లో యివ్వటానికి ప్రభుత్వము ప్రయత్నిస్తారా?

THE HON SRI B. GOPALA REDDI :—ఈ విషయము నేను మొదటనే చెప్పాను. ఇందులో కేంద్రప్రభుత్వమువారు యిచ్చేది కొంతభాగము subsidy ఒకటి వున్నది. పోయిన సంవత్సరం జూలై ఒకటవతేదీలోపల పూర్తిచేసిన వాటికే subsidy యిస్తామనిన్నీ ఆ తరువాత పూర్తిచేసిన వాటికి యివ్వము అని ఖచ్చితముగా చెప్పివేశారు. కాబట్టి పోయినంతవరకూ యిది పొడిగిస్తూ పోతుంటే, వారుయిచ్చే ఆ subsidy గూడా లేకుండాపోతుంది. అప్పుడు యీ ప్రభుత్వము పూర్తిగా పెట్టుకోవలసివస్తుంది. కాబట్టి అది సాధ్యపడదేమోనని అనుకుంటాను.

Sri R. B. RAMAKRISHNA RAJU :—జూలై తరువాత సెప్టెంబరు వరకు యీ గవర్నమెంటువారు పెట్టుకుంటున్నారు. Government of India వారు యిచ్చేది లేదు. సెప్టెంబరు తరువాతకూడా కొన్నిబావులు పూర్తి అయినవి వుంటే వాటి విషయములోనైనా కనీసము యిది loan గా treat చేసి, instalments లో తీసుకోటానికి ప్రభుత్వము ఒప్పుకోకూడదా?

THE HON. SRI B. GOPALA REDDI :—No answer.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా! Well subsidy scheme విషయములో చాలామంది సభ్యులుచెప్పినట్లు, కొన్ని పూర్తి అయినవి, కొన్ని తవ్వి వూరుకొన్నారు. అందుచేత కనీసము యీ రాష్ట్ర ప్రభుత్వము ఒక సంవత్సరము అయినా గడువు యివ్వమని కేంద్రప్రభుత్వమునుకోరితే, యీ లోపల యివన్నీ settle అయిపోతవి, గనుక యీ విషయములో ప్రభుత్వం ప్రయత్నిస్తుందా?

THE HON SRI B. GOPALA REDDI :—ఇది ఆంధ్రరాష్ట్రము ఒక్కదానికి సంబంధించిన స్కీముకాదు. అన్ని రాష్ట్రాలకు సంబంధించింది. కేంద్రప్రభుత్వమువారు యింతవరకు చాలా ఉదారంగానే ఉన్నారని అనుకుంటున్నాను. ఇంకా రెండు సంవత్సరాలవరకు గడువు extra time యిచ్చినప్పటికిన్నీ, ఎన్నోవేల బావులు పూర్తికాకుండా మిగిలిపోతాయి. ఏ ఏ సంవత్సరములో ఎన్నెన్ని బావులు పూర్తి అయినవో, వాటి అన్నిటికీ లెక్కలు వున్నవి. ఇవన్నీగూడా పూర్తి కావటము చాలామంచిది. ఇంతవరకు కేంద్రప్రభుత్వమువారు చాలా ఉదారంగానే వున్నారు. ఇంకను వాయిదా యివ్వమని వారిని కోరడముగాని, వారు యివ్వడము గాని జరగదేమోనని అనుకుంటాను.

SRI SHAIK MOULA SAHIB :—అధ్యక్షా, ఈ బావుల subsidy విషయములో మా నెల్లూరు జిల్లాలో వుండే మెట్ట తాలూకాలలో యింతవరకు వర్షాలు లేక కరువు ఏర్పడింది. అందువల్ల ప్రజలు చాలా ఆందోళన చెందుతున్నారు. అట్టి సందర్భములో వారు డబ్బు కట్టలేకుండా వున్నారు. అటువంటి వారికైనా కనీసము ఒక సంవత్సరము పాటు గడువు, special case గా treat చేసి, యిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—రైతులు బావులు కట్టలేని చోట అప్పులు కట్టమని కోరుతున్నాను.

SRI T. GOPALAKRISHNAYYA GUPTA :—అధ్యక్షా! బావుల కొరకు subsidy మొత్తమే కాకుండా అవి పూర్తి కావటానికి రైతులు వారికి వున్న స్వంత ఆస్తులుకూడా తాకట్టు పెట్టి, అప్పుచేసి బావులు పూర్తి చేయడానికి ప్రయత్నించినవారు వున్నారు. కాని డబ్బు ఖర్చుచేసి త్రవ్వినను బావులలో బండ పడి నీరు పడనందువల్ల, రైతులు చాలా నష్టపడినప్పటికినీ ప్రయోజనములేని కేసులు వున్నవి. అటువంటి బావుల విషయములో బావులు త్రవ్వించినట్లుగానే treat చేసి వారి వద్దనుంచి డబ్బు వసూలుచేయకుండా ప్రభుత్వంవారు మినహాయింపు చేస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—ఇటువంటి hard cases ను కొంచెము ఉదారముగా చూడమని యిదివరకే కలెక్టర్లకు వుత్తరవులున్నాయి. అటువంటి hard cases వుంటే, కలెక్టరు నోటీసుకు తీసుకువస్తే, వారు విచారిస్తారు.

SRI M. BAPAIAH CHOWDARY :—ఈ సంవత్సరము ఆర్థిక మాంద్యమువల్ల subsidy ఋణములు రైతులు చెల్లించలేకపోతున్నారు. వారికి గడువు యివ్వవలసిందిగా ప్రభుత్వానికి విజ్ఞప్తులు ఏవైనా వచ్చాయా ?

The HON. SRI B. GOPALA REDDI :—వచ్చినవి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇచ్చిన టైము లోపల బావులు పూర్తి చేయమని ప్రభుత్వము ఆదేశించినప్పుడు, అక్కడ అవి పూర్తి చేసినప్పటికినీ, తహశ్శీలుదారు, ఆ బావిని చూచి సర్టిఫై చేయడములోనే ఆలస్యం చేసినందున బావి పూర్తిచేసినప్పటికినీ ఆలస్యము చేశారని డబ్బు కట్టమని ఒత్తిడి చేసి వసూలుచేశారు. బావులు పూర్తిచేసినట్లు సర్టిఫికేట్లు వున్నవి. పైనుంచి formal ordersరాగానే డబ్బు refund చేస్తామని వసూలు చేశారు. ఎన్నాళ్లు చూచినా, పైనుంచి orders రాలేదు. రాగానే యిస్తామని జరుపుతున్నారు. కాబట్టి యీ విషయములో ఆర్డర్లు యిప్పిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఓ! ఇప్పిస్తాము.

SRI C. SUBBARAYUDU :—కొన్నిచోట్ల యీ subsidy మొత్తాలకు అయిదు, ఆరు రెట్లు హెచ్చు ఖర్చు చేస్తేగాని బావులు పూర్తికావు. ఇదివరలో కొన్ని ప్రాంతాలలో వరదలవల్ల కరువువల్ల, యిచ్చిన గడువులోగా రైతులు పూర్తిచేయటానికి వీలులేక బావులు తయారుకాలేదు. వారికి యిచ్చిన గడువు లోపల ఎంతో డబ్బు ఖర్చు పెట్టి అంటారు. అటువంటి hard cases విషయములో కేంద్ర ప్రభుత్వమునకు వ్రాసి వాటికైనా మినహాయింపు చేయించటానికి ప్రభుత్వము ఏర్పాటు చేస్తారా ?

THE HON SRI B. GOPALA REDDI :—ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వానికిగాని, రాష్ట్ర ప్రభుత్వానికిగాని తెలియని సంగతులు ఏమీలేవు. ఇచ్చిన చోట్లలో యింకా ఎక్కువ ఖర్చు పెట్టవలసి వచ్చిందనికూడా తెలుసు. కాని యీ అప్పులు ఏవుద్దేశముతో యిచ్చారో ఆ వుద్దేశ్యము నెరవేర్చకుండా వున్నారు. 1947-48 సంవత్సరములో యిచ్చిన 13 వేల బావులకు, 8 వేల చిల్లర మాత్రము పూర్తి అయినవి. యింకా అయిదువేల చిల్లర 1947-48 లో ఇచ్చినవి యింకా పూర్తికాలేదు. ఇంతకన్నా ఉదారంగా వుండటానికి వీలు కాదేమో అని అనుకుంటాను.

SRI S. VEMAYYA :—కొన్ని అసాధారణ పరిస్థితులలో రైతుల అసమర్థతవల్లగాని, నీరు పడకపోవడమువల్లగాని బావులు పూర్తికాక పోయినప్పటికినీ, యిటువంటి వాతావరణమువల్ల జరిగినటువంటి విషయములో మినహాయించవలెనని కోరుతున్నాను. మినహాయింపుకాని పక్షములో, అవి తక్కావి లోన్సు మాదిరిగా instalments లో వసూలు చేయడానికి ప్రభుత్వము ప్రయత్నము చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:—తక్కావి లోన్సుకు, దీనికి ఎలాంటి సంబంధములేదని అనుకుంటాను. తక్కావి లోన్సు భూములు బాగుచేసుకోటానికి యిచ్చేవి కాని బావులు త్రవ్వటానికి యిచ్చేవికావు. ఇప్పుడు యివి బావులు కొరకు తీసుకున్న అప్పులు కాబట్టి యివి తిరిగి యిచ్చివేయవలసి వస్తుంది.

**MR. SPEAKER : The Hon. Member asks whether it cannot be recovered in instalments.**

THE HON SRI B. GOPALA REDDI :—ఇప్పుడు ఆ విషయములో నేను ఏదీకూడా చెప్పలేకుండా వున్నాను.

24th September 1955]

SRI V. VISVESWARA RAO :—అధ్యక్షా, వీటి విషయంలో చాలా చేస్తున్నామని కలెక్టరుగారికి చెప్పామని మంత్రిగారు చెప్పారు. చాలా hard cases ను తీసుకొన్నప్పటికికూడా కలెక్టర్లు మాకు పైనుంచి ఉత్తర్వులు రాలేదని చెప్పి వెంటనే వసూలుచేయాలని అనేక చోట్ల జప్తులు కూడా చేస్తున్నారు. 1947 లో ఇచ్చాము. 1948 లో ఇచ్చాము అంటున్నారు. 1950-1951 లో వాళ్లు బావులు కట్టి అప్పట్నుంచే సాగుచేస్తున్నటువంటి బావులక్రింద కూడా కరణాలు రికార్డులు వ్రాసినప్పటికి వాటినికూడా వసూలుచేయటమనేది జరుగుతుంది. వాటిని రద్దుచేయటానికి ప్రభుత్వము పూనుకొంటుందా ? బావుల క్రింద సాగుచేసినట్టు రికార్డులలో వున్నప్పటికీ వాటిక్రింద ఈనాడు బావులు పూర్తికాలేదని అవి కావలసిన డైమన్షనులేదని ఏదో ఒకవంకచెప్పి అన్నీ వసూలు చేయడమనేది జరుగుతుంది. వాటిని వసూలు చేయకుండా అపుతారు. కనీసం అటువంటి వాటికైనాసరే instalments ఏర్పాటు చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఏదో ఒకవంకపెట్టి రైతులను పీడించాలని ఎవరు అనుకొంటున్నారో బోధపడటంలేదు. రైతులవంక పెడుతున్నారా ? ఉద్యోగస్తులవంక పెడుతున్నారా ? ఇవన్నీ కలెక్టర్లు ఆలోచిస్తారని చెప్పినాను.

SRI P. BAPAYYA :—ఈసంవత్సరం తిరువూరు తాలూకాలో బుణాలు వసూలు చేయడంలో పాడిపశువులు, దుక్కిటెద్దులనుకూడా జప్తుచేస్తున్నారు. ఆ విషయం ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI B. GOPALA REDDI:—తెలియదు.

*Construction of Krishna Regulator-cum-road bridge.*

416—

* 182 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Deputy Chief Minister be pleased to state the stage at which the construction of Krishna Regulator-cum-bridge stands at present ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—5769 Running feet of well sinking, 7167 units of mass concrete for floor and aprons, the construction of the scew bridge and the

approach road have all been completed. 30 per cent of the entire work on the project was done by the end of May, 1955.

SRI S. VEMAYYA :—ఇప్పుడు పనిజరుగుతోందా ? ఎంతకాలములో పని పూర్తిఅవుతుందని ప్రభుత్వము భావిస్తున్నది ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇప్పుడు కృష్ణానదిలో నీరుపారుతుందనే సంగతి వేమయ్యగారికి తెలుసును. చురుగ్గా పనిజరుగదు. ప్రవాహము ఇబ్బందులులేని ప్రదేశంలో మాత్రము పనిజరుగుతూఉంటుంది. రెండు working seasons లో పూర్తిచేయగలమని ఆశిస్తున్నాము. అది సాధ్యమవుతుందని అనుకొంటాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ప్రారంభంలో దీని అంచనా ఎంత ? ఇప్పుడు కట్టుబడి 30% వరకుఅయిందికాబట్టి అంచనా ప్రకారం ఖర్చు జరుగుతున్నదా ? లేక పెరిగిందా ? పెరిగితే ఎంత పెరిగింది?

THE HON. SRI N. SANJEEVA REDDI:—Revised estimates వస్తేనేగాని పెరిగిందో తరిగిందో తెలియదు. ఇంకా ఇప్పటికి revised estimates రాలేదు. ఉన్నడబ్బు ఖర్చు పెడుతున్నారు. చాలకపోయినప్పుడుకదా revised estimations.

*Re-opening of the Deputy Tahsildar's office at Chitvel, Rajampet taluk.*

417—

* 343 Q.—SRI P. VENKATASUBBAYYA: Will the Hon. the Minister for Revenue be pleased to state whether there is a proposal pending with the Government to re-open the Deputy Tahsildar's office at Chitvel, Rajampet taluk, which was abolished in the year 1949-50 after separation of Judiciary from the Executive ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

Yes, Sir. The proposal is under the consideration of the Government.

SRI P. VENKATASUBBAYYA :—డిప్యూటీ తహశీల్దారు ఆఫీసు అక్కడ పెట్టడం ఆలస్యము అయినందువల్ల అక్కడవున్న రైతులు అక్కడకు 16 మైళ్ళ దూరములోవున్న రాజంపేటకు పోవడానికి చాలా కష్టపడుతున్నారు.

మధ్యగా ఒకనదికూడావున్నది. వర్షాకాలం ఆ నది పూర్తిగా ప్రవహించడముచేత ప్రజలకు ఇబ్బంది కనుక ఇది సత్వరంగా ఏర్పాటు చేయడానికి ప్రయత్నము చేస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సాధ్యమైనంత త్వరలో ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తాము.

MR. SPEAKER : Questions put in the name of the Hon. the Planning Minister (Nos. 418, 426, 427 and 428) will be taken up on another date, as he is not now in the House. I proceed to Question No. 419.

*Compensation under section 8 of the Workmen's Compensation Act.*

419

* 382 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of cases of women and persons who were not paid compensation under section 8 of the Workmen's Compensation Act, and whose cases have been (i) disposed of and (ii) pending for the year ending 1954 ; and

(b) the amount of money deposited in their favour ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) (i) ... ... 7

(ii) ... ... 9

(b) Rs. 900.

SRI S. VEMAYYA :...ఇప్పుడు అనేక విషయాల్లోకూడా deposit చేయడమనేది మానేస్తుందని ప్రభుత్వానికి తెలుసునా ? అక్కడ deposit చేయడానికి ఏదైనా చర్యలు తీసుకుంటారా ?

THE HON. SRI G. LATCHANNA :—చేయని కేసులు ఏవైనా ఉంటే వాటిమీద చర్యలు తీసుకుంటూనే ఉన్నాము. అట్లాంటిది ఏదైనా specific కేసు ఏదైనావుంటే గౌరవసభ్యులు తెలియజేయవచ్చును.

*Misappropriation of funds of Pedamuttevi Marketing Society.*

420—

* 767 Q. —SRI S. R. Y. SIVARAMA PRASAD BAHADUR : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) whether it is a fact that huge funds of the Marketing Society of Pedamuttevi of Divi taluk, Krishna district, were misappropriated by the Presidents and Directors of the Society during the year 1953-54 ;

(b) whether any action was taken in the matter ; and

(c) if so, the nature of the action taken ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) : The misappropriation is alleged to be true. It is reported to have been by the President and the other Directors of the society are not involved.

(b) : Yes, Sir.

(c) : The nature of the action cannot be disclosed in public interest.

SRI PRAGADA KOTAIAH :—ఎంతడబ్బు ఇందులో involve అయిఉన్నది,. తరువాత ఎలాంటి చర్యలు తీసుకోబోతున్నారు.

THE HON. SRI D. SANJIVAYYA :—Nature of action అంటే ఇలాంటిచర్య అనేదానికి అర్థము. అది disclose చేయటానికి వీలులేదు. ఈ misappropriated amount క్రింద చాలా మొత్తం ఉంది.

SRI S. RANGANADHA MUDALIAR : When such huge amounts are involved, is there any sanctity about these persons that the Government consider it not fit to reveal the nature of the action proposed to be taken ?

THE HON. SRI D. SANJIVAYVA :—ఒక్కొక్కతూరి ఆ విషయాన్ని మనము తెలియపరచినట్లయితే action తీసుకోడానికి కొన్ని అడ్డంకులు

రావడానికికూడా అవకాశము ఉంటుంది. కాని ముందు దాంట్లో influence చేయడానికి ఎటువంటి అవకాశాలు ఉంటాయో చెప్పడానికి సాధ్యంకాదు.

SRI S. RANGANADHA MUDALIAR : Will the Government at least guarantee that some action will be taken against them?

THE HON. SRI D. SANJIVAYYA : Certainly.

SRI P. VENKATASUBBAYYA :—అంత పెద్దమొత్తాలు misappropriate చేసినప్పుడు ఆ సొసైటీ రిజిస్ట్రేషను రద్దుచేసి liquidator ద్వారా ఎందుకు చర్యతీసుకోకూడదు ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇది iiquidate చేయబడింది. ఇప్పుడు Liquidator in charge లో వున్నది.

SRI PRAGADAKOTAIAH:—అధ్యక్షా, ఈధనం దుర్వినియోగము జరిగింది అంటున్నారు. ఆయా తేదీలమధ్య ఇన్‌స్పెక్టర్లుగాని డిప్యూటీ తహశీల్దార్లుగాని ఆ సొసైటీలను visit చేశారా ? లేకపోతే తరువాత visit చేశారా ? Visit చేస్తే అప్పుడే ఎందుకు తెలుసుకోలేదు?

THE HON. SRI D. SANJIVAYYA :—Visit చేసినారు. Visit చేసిన కారణంచేతనే ఇవన్నీ బయటపడ్డాయి. బయటపడిన తరువాత action తీసుకొంటున్నారు.

*Representation regarding Gudur-Duggarajapatnam Road, etc.*

421—

*635 Q.—SRI P. GOPALAKRISHNA REDDI : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether any representations were made to the Minister for Local Administration and Prohibition on 3rd November, 1954 and 26th April, 1955 by Sri P. Gopalakrishna Reddy, M.L.A., regarding (1) Gudur-Duggarajapatnam Road in Nellore district to be taken up by Highways Department, and (2) to construct a causeway on the Swarnamukhi river

near Vakadu village which was sanctioned about 3 years back ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The answer is in the negative. But a representation was made to the Governor in the matter on 3rd November, 1954 and another representation was made to the Deputy Chief Minister on 25th April, 1955.

(b) The two representations are under consideration.

Sri S. VEMAYYA :—ఇప్పుడు ఎంతకాలములో ఈ ప్రభుత్వము ఒక నిర్ణయానికివచ్చి దీనిలో ఏదైనా పనిచేయడానికి పూనుకుంటుందె ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—ఈ విషయంలో జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసరుగారికి వుత్తరాలు వ్రాయబడ్డాయి. వారిదగ్గరనుంచి జవాబు వచ్చినతరువాత చర్య తీసుకోబడుతుంది.

Sri B. SANKARIAH :—ఇప్పుడు జిల్లాబోర్డుల క్రిందవున్న రోడ్లుఅన్నీ మరల కొత్తగా వేయవలసిన పరిస్థితి ఏర్పడుతోంది. అవి పాడయిపోయాయి. ఈ విషయంలో వెంటనే చర్య తీసుకుంటారా ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—తప్పకుండా ముందు పాతరోడ్లకు ప్రాధాన్యము ఇస్తాము.

*Expenditure incurred for providing tents and buildings at Kurnool.*

422—

*887 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the total expenditure incurred by the Government upto 31st March, 1955 at Kurnool for (1) providing tents (of all classes) and (2) buildings for the Secretariat staff ;

(b) the expenditure incurred for the re-modelling of the legislature building during the period ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) (i) Rs. 19,44,246.

(ii) Rs. 41,24,894-7-7.

(b) Rs. 39,308.

SRI P. SUNDARAYYA :—ఈ లెజిస్లేచరు భవనమునకు 39 వేలు రూపాయలు అయిందా ? ఇప్పుడు మనం కూర్చున్నది లెజిస్లేచరు భవనమేనా ? అయితే ఎందువల్ల ఎక్కువ ఖర్చుఅయిందో ప్రభుత్వము విచారించిందా ? చేసిన మార్పులకు 39 వేలుదాకా ఎందుకు అయింది ?

THE HON. SRI B. GOPALA REDDI :—మార్పులు చేయకముందు గౌరవనీయ సభ్యులు ఈ భవనమును చూడలేదేమో అని అనుకొంటున్నాను. చూచి వుంటే ఆప్రశ్న అడిగిఉండేవారు కాదేమో ?

SRI S. VEMAYYA :—Tents అన్నీ బిల్డింగులుగా కట్టించిన తరువాత ఈ material ఏమిచేస్తున్నారు ? వేలాం వేస్తున్నారా ? అలాగే ఉంచుతున్నారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—మంచి condition లో ఉంటే తప్పకుండా auction చేస్తాము.

*Private buildings taken over by Government at Kurnool and their repairs.*

423—

*1543-C Q.—SRI P. SUNDARAYYA : AND SRI PILLALA. MARRI VENKATESWARLU : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) how many private buildings are taken over by the Government in Kurnool for Government purposes from 1st October, 1953 up-to-date ;

(b) whether any improvements are made to them and who bore the cost ? Is it the Government or the owner ;

(c) if Government, what the total amount spent by them is ;

(d) the houses on which more than Rs. 1,000 are spent as repairs and for what purposes they are used and are being used ; and

(e) how much money was spent on each of the buildings that are occupied by the Ministers from 1st October. 1953 ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) 73.

(b) Yes. The Government have borne the expenditure for improvements made.

(c) Rs. 3,38,066.

(d) 37 private buildings, of which 5 buildings are being used as residential accommodation for Ministers, 6 buildings for the offices of both the State and Central Governments and the rest for residences for Government Officers.

(e) A sum of Rs. 64,989 has been spent upto 31st March, 1955 on the 5 private buildings occupied by Ministers as indicated below :—

| | Rs. | a. | p. |
|---|---|---|---|
| Deputy Chief Minister's Bungalow ... | 12,181 | 0 | 0. |
| Minister (Planning and Industries, Bungalow ... ... | 12,800 | 0 | 0 |
| Minister (Revenue) Bungalow ... | 27,808 | 0 | 0 |
| Minister (Co-operation and Commercial Taxes) Bungalow ... ... | 5,000 | 0 | 0 |
| Minister (Local Administration and Prohibition) Bungalow ... | 7,200 | 0 | 0 |

SRI P. SUNDARAYYA :—మంత్రులు ఉపయోగించే అయిదు బంగాళాలు అసలు original ఖరీదు ఎంత ఉంటుందో estimates వేయించినారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Acquire చేయాలనే ఉద్దేశం అపుడులేదు కాబట్టి estimates వేయించలేదనుకుంటాను.

Sri P. SUNDARAYYA :—ఇప్పుడు రెవెన్యూమంత్రిగారు ఉన్న బంగాళాకు రు. 25,800లుపైగా మరమ్మత్తులు కోసమే ఖర్చుచేసినారు. ఇప్పటికి ఇంత ఖర్చుచేశారు కాబట్టి ఇప్పుడైనా దానిని acquire చేయడానికి ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నదా ?

THE HON SRI B. GOPALA REDDI:—Acquire చేస్తే లాభమో, నష్టమో ఆలోచించుకోవాలి.

SRI P. SUNDARAYYA :—అంతవృధాగా ఉన్న బంగాళాకు రు. 30,000 ప్రభుత్వడబ్బు తేరగా ఉన్నదనా ఖర్చుచేసారు ?

THE HON. Sri B. GOPALA REDDI:—అవసరసమయంలో ఈబిల్డింగులు తీసుకోవలసివచ్చింది. ఈడబ్బు మరమ్మతులకే కాకుండా additions కు కూడా జరిగింది.

SRI P. SUNDARAYYA :—ఈడబ్బు owners దగ్గరనుంచి రాబట్టడానికిమార్గం ఉన్నదా ? బంగళాలు వదలివెళ్లేటప్పుడు ఈ డబ్బును వారికి దానంచేసినట్లే అవుతుందా ?

THE HON. SRI B. GOPALA REDDI:—వదలి వెళ్ళేటప్పుడు ఆప్రశ్న ఉదయిస్తుంది.

SRI P. SUNDARAYYA :—ఈ ఇండ్లకు ఎంత అద్దె చెల్లిస్తున్నారు?

THE HON. SRI B. GOPALA REDDI :—వేరేప్రశ్న వేయండి.

SRI P. NARASIMHAPPA RAO :—ఈబిల్డింగులు మొదటే ఎందుకు acquire చేయలేదు ? క్రొత్తగా కట్టించుకుంటే హెచ్చు అయేదికాదుకదా ?

THE HON. Sri B. GOPALA REDDI:—అనుకోనంత త్వరితంగా Special Officer రావడం ఆంధ్రరాష్ట్రం రావడం జరిగాయి. Acquire చేయాలనేది అప్పుడు అనుకోలేదు. తొందరలో accommodation కావలసివచ్చి ఆ విధంగా చేశారు. Acquire చేయాలనే ఉద్దేశం గవర్నమెంటుకు లేదు.

THE HON. Sri N. SANJEEVA REDDI :—May I add one word Sir. ఈ మొత్తాలు బిల్డింగులు కట్టడానికే కాదు. Electric పంపు, flush outs, servants కు shed వేశారు. ఇవన్నీ ఊడతీసుకుని పోవచ్చును. రెవెన్యూ మంత్రిగారి ఇంటి విషయంలో repairs కు కాకుండా, పాతఇల్లు కాబట్టి తిరిగి కట్టవలసివచ్చింది. ఆంధ్రరాష్ట్రం రాకముందు మనకు ప్రభుత్వంలేదు. కొద్ది

రోజులకుముందు ఇక్కడకువచ్చాము. ఉన్నఇండ్లు నాలుగు స్వాధీనం చేసుకున్నారు. కొంచెం డబ్బు ఖర్చుచేశారు. ఆంధ్రరాష్ట్రంవచ్చి ప్రభుత్వం ప్రారంభించే సమయానికి కొన్ని ఇండ్లకు మరమ్మతులు చేశారు. అందులో ఇదికూడా ఒకటి. ఇది చాలా పాతఇల్లు అవడంవల్ల పడిపోతుంటే repairs చేయడానికి చాలా ఖర్చు చేశాము. అది వదిలిపెట్టి వెళ్ళేటప్పుడు acquire చేసే విషయంవస్తుంది. ఎట్లా చేస్తే Government కు profitable అవుతుందో పరిశీలిస్తాము. అంతా వదిలిపెట్టి వెళ్లము. ఇందులో చాలా removable property ఉన్నది. దాన్ని detach చేసి తీసికొనిపోవచ్చును.

SRI P. SUNDARAYYA :—వదిలివెళ్ళేటప్పుడు ఊడ బెరుక్కొని పోవచ్చునని ఉపముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు. ఊడబెరుక్కొనే దానికయ్యే ఖర్చుకూడా ఊడబెరికినవాటికిరాదని మంత్రిగారికి తెలుసునా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఇప్పుడు engines మొదలైనవి ప్రాజక్టులకు స్టేషన్లనుంచి ఊడబెరకడం మామూలుగా ఉన్నది. తరువాత వేలంవేస్తే 50% cost అయినా వస్తుంది.

Mr. SPEAKER :—You are making a speech.

SRI S. K. V. KRISHNAVATARAM :—ఈప్రశ్నకు సరియైన సమాధానం ప్రభుత్వం దగ్గరనుంచి రాలేదు. ఈ బిల్డింగులు తీసుకున్నప్పుడు ఏ ఏర్పాటుపై తీసుకొన్నారు? అద్దె నిర్ణయించినపుడు అద్దె మినహాయింపుచేసేట్లా చేసుకొన్నారా ? మిగతా investments ఏవిధంగా రాబట్టుకునేది ఏర్పాటు చేసుకున్నారు ?

THE HON. SRI B. GOPALA REDDI :—అన్ని ఇండ్లు ఏ విధంగా తీసికుంటారో ఆ విధంగానే తీసుకున్నారు. ఎంత అద్దెయిస్తే సరిగాఉంటుందో ఆ ప్రకారం తీసికున్నారు. ఖర్చుపెట్టినది అద్దెలో తీసుకుంటే రివెన్యూమంత్రిగారి యింటి యజమాని మనకే రు 150 లు, రు 200 లు నెలకు యివ్వవలసి ఉంటుంది.

SRI A. KALESWARA RAO :—ఈ ప్రభుత్వం క్రొత్తబిల్డింగులు కట్టినపుడు ఇవి ఏమి అవుతాయి? Agreement ఏమి లేకుండా తీసికున్నారా ? అటువంటి agreement ఏమైనా ఉన్నదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—మామూలుగా గవర్నమెంటు ఆఫీసులకై ఇండ్లు తీసుకున్నప్పుడు ఏ షరతులు ఉంటాయో అవే ఉంటాయి. ప్రత్యేకమైన షరతులు ఏమిలేవు. వాళ్లకు మనమూ ఏమిఇవ్వలేదు.

Sri A. KALESWARA RAO :—గవర్నమెంటు ఆఫీసులకై మామూలు ఇండ్లు తీసుకున్నపుడు ఎటువంటి షరతులు ఇదివరకు నిర్ణయమైనాయి ?

THE HON. SRI B. GOPALA REDDI :—వేరేప్రశ్న వేయండి.

SRI P. SUNDARAYYA :—ఇండ్లు గవర్నమెంటు ఆఫీసులకు ఉపయోగిస్తున్నాము అన్నారు. ఇచ్చిన సమాధానంలో అయిదు మంత్రులకోసము, ఆ గవర్నమెంటు ఆఫీసులకోసము ఉపయోగిస్తున్నాము అన్నారు. ఇవి ఏఏ గవర్నమెంటు ఆఫీలకోసము ఉపయోగిస్తున్నారు ? వారికి ఎంత repairs అయినాయి ?

THE HON. Sri B. GOPALA REDDI —Director of Posts and Telegraphs ఆఫీసు మొదలైనవి ఉన్నాయనుకుంటాను. వేరేప్రశ్న వేయండి.

Sri P. SUNDARAYYA :—అసెంబ్లీ సభ్యుల నూతన house కూడా అందులో ఒకటా ? దానికి ఎంతఖర్చు చేశారు ?

THE Hon. SRI B. GOPALA REDDI :—అది వేరేప్రశ్న. దీనిలో రాదు.

SRI M. SATYANARAYANA RAJU :—గౌరవసభ్యులు దిగేముందు ఇంటి యజమానులతో agreement తీసుకున్నారా ? Owner one month notice ఇస్తే గవర్నమెంటు position ఏమిటి ?

THE HON. SRI B. GOPALA REDDI :—House Rent Control Act, వున్నాయి. వంటివి ఫరవాలేదు.

SRI P. SUNDARAYYA :—అసెంబ్లీ సభ్యులు వున్న hostel కు సుమారు 40, 50 వేల రూపాయలు ఖర్చు పెట్టినమాట వాస్తవమేనా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఉండవచ్చును. లేకపోవచ్చును. వేరేప్రశ్న వేస్తే సమాధానము ఇస్తాను.

SRI K. V. S. PADMANABHA RAJU :—ఇంకాకా Deputy ఇప్పుడున్న ఇళ్ళను వదలిపెట్టి వెళ్లినప్పుడు ఈ మరామ్మతులు చేసినవన్నీ వదలి పెట్టి వెళ్ళవలెనని నిశ్చయించుకొన్నారా ?

Mr. SPEAKER :—That is a different question.

THE HON. SRI B. GOPALA REDDI :—అటువంటి ప్రశ్న ఉదయించదు.

SRI P. SUNDARAYYA :—ఈ ప్రభుత్వం ఏ ఇంటికయినాసరే దాని అసలు ఖరీదుకన్న నాల్గవవంతుగాని మూడవవంతుగాని మరమ్మతుల కోసము ఖర్చు పెట్టినపుడు వాటినితప్పనిసరిగా requisition చేసి acquire చేసేదానికి ప్రభుత్వం చర్య తీసుకుంటుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆ మాదిరిగా acquire చేస్తే ప్రభుత్వానికి లాభముగా ఉంటే ప్రభుత్వం తప్పకుండా తీసుకుంటుంది. కొంత విచారించవలసి ఉంటుంది. పడిపోయిన ఇళ్ళు నెత్తిన వేసుకోనడం లాభమా కాదా అనేది చూడాలి.

SRI P. SUNDARAYYA :—నాల్గవవంతుగాని మూడవవంతుగాని మరమ్మతులనుఖర్చు పెట్టినప్పుడు వాటిని తీసుకోనడము లాభముకాదా ?

MR. SPEAKER :—It is a matter of opinion.

SRI V. VISWESWARA RAO :—విడిచిపెట్టి వెళ్ళినప్పుడు acquire చేస్తామని చెప్పారు. ఇప్పుడుచేసిన repair లను దృష్టిలో పెట్టుకొని వాటిఖరీదు నిర్ణయిస్తారా లేక అద్దెకు తీసుకున్నప్పుడు ఇళ్ల స్వభావాన్నిబట్టి ధరలు నిర్ణయిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Hypothetical question గా ఉంది.

MR. SPEAKER :—Hypothetical questions need not be answered.

*Expenditure incurred for buildings construction after formation of Andhra State.*

424—

*615 Q.—SRI P. GOPALAKRISHNA REDDI : Will the Hon. the Deputy Chief Minister be pleased to state the total expenditure incurred by the Government towards construction of buildings at Kurnool after formation of Andhra State ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

Rs. 1,00,34,850, (to end of May, 1955)

*Tahsildars and Deputy Tahsildars in undivided Bellary district.*

425—

* 1079 Q.—SRI N. K. LINGAM : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) the number of Deputy Tahsildars and Tahsildars who were working in the undivided Bellary district who were taken to Kurnool district ; and

(b) whether they were all absorbed in Kurnool district alone or distributed to various districts ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

| | | | |
|---|---|---|---|
| (a) | Deputy Tahsildars | ... | 14 |
| | Tahsildars | ... | 3 |

(b) Deputy Tahsildars and Tahsildars who were working in undivided Bellary district, have been absorbed in other districts also viz., in the Districts of Anantapur, Cuddapah, Chittoor and Srikakulam.

SRI C. SUBBARAYUDU :—ఈ డిప్యూటి తాసీల్దారు, తాసీల్దార్లు కాకుండా Upper division clerks రివెన్యూ డిపార్టుమెంటులో పనిచేసే వారు బళ్లారిలో ఇంకా ఉన్నారు. వారిలో చాలామంది ఇక్కడకు రావడానికి representation చేసుకొన్నారా ? అది ప్రభుత్వానికి తెలుసునా ? తొందరగా ఆలోచన చేస్తారా ?

THE HON SRI K. CHANDRAMOULI :—ఆలోచిస్తాము.

SRI N. K. LINGAM :—14 మంది డిప్యూటీ తాసీల్దార్లు 3 తాసీల్దార్లు ఈరాష్ట్రములోకి రావడంచేత ఈ మూడుజిల్లాలలో absorb చెయ్యడంవల్ల ఇక్కడ పనిచేస్తున్న Deputy Tahsildars, Upper division clerks కు promotions భంగము కలుగుతుందని నిరుత్సాహం కలుగుతుందని ప్రభుత్వం ఆలోచిస్తుందా ? వారిని అన్నిజిల్లాలకు పంపకముచేసే పథకము ఏమైనా ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—వేరే ప్రశ్న వేస్తే ఆలోచిస్తాము.

SRI N. C. SESHADRI :—ఇదివరకు ఆంధ్రరాష్ట్రానికి రావతెనని application పెట్టుకొన్న తాహసిల్దార్లందరినీ ఆంధ్రరాష్ట్రానికి తీసుకొని రాలేదు. చెన్నూరిలో ఎంతమంది మిగిలిపోయినారు ?

THE HON. Sri K. CHANDRAMOULI :—కొంతమంది మిగిలి ఉండవచ్చును. Information కావలెనంటే వేరే ప్రశ్న వెయ్యవచ్చును.

MR. SPEAKER :—Question Nos. 426-428 will be taken up another day.

*Electricity supply to the Panchayats of Palakonda, Rajam and Veeraghattam.*

429—

* 666 Q.—SRI P. NARASIMHAPPA RAO : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) whether the Panchayats of Palakonda, Rajam and Veeraghattam have applied for electrification and if so whether they were electrified ; and

(b) if not, why ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) and (b) The Panchayats of Palakonda and Rajam have applied for extension of electricity and no representation has been received from the Panchayat of Veeraghattam.

24th September 1955]

The proposal for extension of electricity supply to the Panchayats of Palakonda and Rajam has been sanctioned by the Government and the proposal for extension of electricity to Veeraghattam is under formulation in the Government Electricity Department.

Sri P. NARASIMHAPPA RAO:—అధ్యక్షా, ఇప్పుడు sanction అయినవి అని చెబుతున్నారు. ఇదివరకు మద్రాసు గవర్నమెంటులో ఉన్నప్పుడు Dadunia works శాంక్షను చేశారుగాని ఇప్పటివరకు ఈడ్చుకొస్తున్నారు. పని చెయ్యవలెననే ఉద్దేశం ఉంటే తొందరగా అవుతుంది. లేకపోతే సంవత్సరాల కొద్ది అవుతుంది. ప్రస్తుతం ఆ పనులు తొందరగా తీసుకోవాలని కోరుచున్నాను.

SRI B. SANKARAIAH :—Sanction అయిన స్కీములు అన్నీ మార్చిలోగా పూర్తిచేస్తామన్నారు. ఇంతవరకు ఏమి చర్చలు తీసుకున్నారు ? ఇక ముందు ఏమి చేస్తారు ?

THE HON. SRI G. LATCHANNA :—Sanction అయిన స్కీములు అన్నికూడా సుమారు 4½ కోట్లు రూపాయలకు వున్న. ఇదివరకటి ప్రభుత్వం శాంక్షను చేసినవి కొన్నివున్నవి. ఇప్పుడు sanction చేసినవి 4½ కోట్లకు వున్నాయి. పాతశాంక్షన్సు పాతర్లో పెట్టి క్రొత్తశాంక్షన్సు అమలు పరచాలి అనే పద్ధతిలో చెయ్యలేము. సరుకును బట్టి అమలు జరుపవలసి వున్నది. వీలైనంత త్వరలో పథకాలు అమలు జరుగుతాయి. సభ్యులు అపోహపడ నవసరం లేదు అని మనవి చేస్తున్నాను.

SRI P. RAMACHARLU :—Mysore గవర్నమెంటు Jog Electricity ఇవ్వడము లేదు. కాబట్టి మాచ్‌ఖండు ప్రాజక్టు తయారైన తరువాత క్రమ క్రమముగా అక్కడి engine లను తీసి అనంతపురంజిల్లా కళ్యాణదుర్గం మడకశిరా తాలూకా town లకు ఇస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :-మాచ్‌ఖండు ప్రాజక్టు పవరువచ్చిన తరువాత ఆ మాచఖండ్ ప్రాజక్టు క్రింద సప్లయి అయ్యే ప్రాంతాలలోవున్న అసలు ఇంజనీర్ల మెట్టప్రాంతాలకు హైడ్రోఎలక్ట్రికు సప్లయి లేనిప్రాంతాలకు మార్చవలెనని ప్రభుత్వం తీర్మానించుకొన్నది. ఆ డీసెలు ఇంజనులను ముఖ్యముగా రాయలసీమ ప్రాంతాలకు వీలైనంత త్వరలో అవకాశం కలిగినపుడు మార్చబడుతాయి.

SRI T. PAPA RAO :—మాచ్‌ఖండు ప్రాజక్టు ఎలక్ట్రిసిటీ శ్రీకాకుళం నుండి ఆమదాలవలసకు వెళ్లుతుంది. రాజోలునుండి దూసి మీదుగా తీసుకువచ్చి

సారాయణ పురంవరకు ఇస్తారా మళ్యప్రాంతాలకు ఇంజన్లు సప్లయిచేసే ఉద్దేశము ప్రభుత్వానికి ఉందా ?

THE HON. SRI G. LATCHANNA:-ప్రత్యేక ప్రశ్న వేస్తే విచారిస్తాను.

SRI L. LAKSHMANA DAS:-అధ్యక్షా, ఇప్పుడు రాజోలుకు పాలకొండకు శాంక్షను అయినదన్నారు. పాలకొండకు ఆమదాలవలసనుండి శాంక్షను చేసినారా లేక ఇంకెక్కడినుండైనా లైనుతీసుకువచ్చారా ? అలా ఆమదాలవలసనుండి శాంక్షను చేసినపుడు, పాలకొండమీదుగా వెళ్లినప్పుడు పారమండలంమీదకు తీసుకొనివెళ్ళడానికి స్కీము ఉన్నదా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇది ప్రత్యేకమైన స్కీము. దానికి sub station ప్రత్యేకముగా ఏర్పాటుచేసి శ్రీకాకుళంనుండికూడా కనెక్షను ఉంది.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, వీరఘట్టంకు electricity sanction అయినట్టు చెప్పారు.

MR. SPEAKER :—వీరఘట్టం లేదని చెప్పారు.

SRI P. GUNNAYYA :—అదేవచ్చిన ఇబ్బంది. అధ్యక్షులవారికి మొట్టమొదట ప్రశ్నలు జవాబులు తెలుగులో translate చేయించాలని అనేక దఫాలు తమతో మనవి చేసుకున్నాను. తెలియక చాలా ఇబ్బందిపడుతున్నాను.

THE HON. SRI G. LATCHANNA :—వీరఘట్టం పంచాయితీవారు ఏమీ మనవి చెయ్యలేదని మనవి చేస్తున్నాను. వీరఘట్టం స్కీము లేదని చెప్పలేదు. వీరఘట్టం పార్వతీపురంనుండి మరొక 20 గ్రామాలకు సంబంధించిన స్కీము మరొకటి 7 లక్షల రూపాయలు ఖర్చు అంచనా వేయబడింది. Investigation పూర్తి అయిన తరువాత remunerative గా ఉంటే స్కీము శాంక్షను చేస్తాము.

SRI N. VENKAIAH :—ప్రత్యుత్తరం ఇవ్వడంలో డీజెల్ స్టేషన్సు కొన్ని ప్రాంతాలకు మారుస్తామన్నారు. ఒకటి రెండు సంవత్సరాలలోపల విద్యుచ్ఛక్తి అందించడానికి అవకాశంవున్న ప్రాంతాలకు మార్చకుండా ఉండడానికి ప్రయత్నిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—ఇందాకా నేను మనవి చేసినదాని అంతరార్థం అదే అని సభ్యులు గమనిస్తారని ఆశిస్తున్నాను.

SRI SHEIK MOULA SAHEB :—అధ్యక్షా, రాయలసీమకు elec- tricity విషయంలో ఇచ్చిన ప్రాధాన్యత వెనుకబడిన నెల్లూరు జిల్లాలో యుండే మెట్ట తాలూకాలలో కూడా ఇవ్వాలనే విషయం ప్రభుత్వం గుర్తించిందా, గుర్తించినట్లయితే ఎప్పుడు ఇవ్వదలచారు ?

THE HON. SRI G. LATCHANNA :—రాయలసీమకు ప్రాధాన్యత ప్రత్యేకంగా ఉన్నదనే అభిప్రాయం సభ్యులకు ఎల్లా కల్గిందో తెలియదు. మొత్తంమీద రాష్ట్రంలో యున్న మెట్ట ప్రాంతాలన్నిటికీ కూడా ఒకే రకమైన ప్రాధాన్యత ఇచ్చే విధానమే ప్రభుత్వం అవలంభిస్తుంది ?

SRI P. SURYANARAYANA :—శ్రీకాకుళం దగ్గర తొమ్మిది మైళ్ళలో శ్రీకూర్మం కళింగ పట్టణం రెండున్నాయి. వాటికి చాలాకాలంనుంచి proposals ఉన్నాయి. వాటికి ఇప్పుడు electricity ఇస్తారా ?

THE HON. SRI G. LATCHANNA:—అవి investigation లో ఉన్నాయి. ప్రభుత్వానికి report రావడంతోటే, అవి remunerativeగా ఉంటే sanction చేస్తాం.

SRI N. K. LINGAM :—అధ్యక్షా ! నందికొట్కూరు పట్టణానికి tenders పిలిచినట్లు పత్రికలలో చూచాం. ఆ scheme ఎంతకాలంలో అమలులోకి వస్తుంది?

THE HON. SRI G. LATCHANNA :—వీలైనంత త్వరలోనండి.

*Ayacut under Sayannagedda.*

430—

* 664 Q. SRI P. NARASIMHAPPA RAO: Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether the Government are aware of the fact that "Sayannagedda" in the Palakonda taluk used to irrigate 24,000 acres of land formerly when it was managed by the Bobbili Estate; and

(b) if so, the reasons for not supplying water to the ryots of that land after it was taken over by Government?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) As per the information furnished by the Estate authorities the total ayacut under Sayannagedda is 5,023 acres for the 1st crop and 4,764 acres for second crop.

(b) The whole ayacut under the Sayannagedda is getting its normal supply of water even after it is taken over by the Government.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా! Estates hand over చేసుకున్న తరువాత మొట్టమొదట ఈ శాయన్న గెడ్డ క్రింద ఉన్న lands కి రెండు పంటలకూ కూడా శిస్తులిస్తున్నారు. ఇప్పుడుకూడా ఎకరాకు 30 రూపాయిలు, 40 రూపాయిలు వఱకూ శిస్తులిస్తున్నారు. గవర్నమెంటు ఒక్క పంటకుకూడా నీరు ఇవ్వడంలేదు. ముఖ్యంగా దీన్నిగురించి special గా staff వేసి ఇదివఱకు Estate లో యున్నప్పుడు రెండుపంటలకూ నీరు supply చేసే విధంగా చెయ్యడానికి action తీసుకుంటారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—అక్కడ నీళ్లు రాకుండా మేట వేయడం ఏదో ఈ రకంగా కొన్ని ఇబ్బందులువచ్చినవి. కాబట్టి Executive Engineer, వాళ్ళు repair చేశారు. ఇప్పుడు సక్రమంగా నీళ్లు వస్తున్నాయని మాకు report వచ్చింది. ఇంకా ఏమైనా చేయవలసినది ఉంటే, అప్పారావుగారు చెబితే ఆలోచిస్తాం.

MR. SPEAKER :—వేరే ఏమైనా ఉంటే చెప్పమంటున్నారు.

*Age-limit of Scheduled Castes etc., for appointing to Government Service.*

431—

*846 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state whether there are proposals with the Government to raise the age-limit of Scheduled Castes, Scheduled Tribes and Backward Communities so as to be equal to that obtaining in the Government of India, in appointment to Government service ?

THE HON. SRI G. LATCHANNA :—

Yes. The matter is under consideration.

SRI S. VEMAYYA :—కేంద్రప్రభుత్వంవారు ఈవిషయాన్ని గురించి ఈ ప్రభుత్వాన్ని ఏదైనా సలహా పంపించమని కోరిందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—కొన్ని departments విషయంగా వారు సూచనకూడా చేసినారు.

SRI S. VEMAYYA :—ఎంతకాలంలో ఒక నిర్ణయానికి ప్రభుత్వం వచ్చి ఈ వయస్సునుగురించి నిర్ణయం తీసుకుంటుందో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఒకమాసంలో పల నే ఐతే కావచ్చును. కాని ఉన్నటువంటి ఇబ్బంది, ఇప్పుడు మనకున్నటువంటి rules కొంత ఉదారంగా వున్నాయి. Government of India వారు చేసేటటువంటి rules ఇంకాకొంచం సంకుచితపరుస్తావేమో అనికూడా అనుకోవలసియుంది. ఎందుకంటే ప్రస్తుతం అనేక departments లో ఈ scheduled classes కు, scheduled tribes కు, backward classes కు upper age limit ఏమీ లేదు. మన services లో Government of India వారు minimum age limitకు ఇతర communities కిచ్చిన age limit కు, దీనికీ మూడు సంవత్సరములు మొదలుకొని 5 సంవత్సరముల వరకూ ఇస్తే చాలుననే మాటగా ఉన్నది. ఇప్పుడు 45 ఏళ్ళ వాళ్ళుకూడా Deputy Collector post కు apply చేయవచ్చును. Scheduled castes backward classes వాళ్ళు రేపుప్రొద్దున Government of India వారియొక్క rules కనుక అవలంబించినట్లయితే ఇతరులకు 24 వుంటే, వీళ్ళకు 27 వరకూ మాత్రమే వస్తుంది. మూడుసంవత్సరాలు మాత్రమే. కాబట్టి ఇప్పుడున్నటువంటి concessions కూడా తీసివేయవలసి వస్తుందేమో ననికూడా వున్నది. ఏమైనప్పటికీ Government of India వారు చేసినట్లుగానే చేస్తే బాగుంటుందని మేముకూడా ఆలోచిస్తున్నాం. త్వరలోనే ఆ rules వస్తాయి.

SRI N. SRINIVASA RAO :—Age limit నిర్ణయంచేయడంలో ఉద్యోగాలేకాకుండా విద్యార్థులకు వేతనాలు ఇచ్చే సందర్భంలోకూడా ex-criminals కు వారికిన్ని 5 వక్లాసు, 6 వ క్లాసు చదివినవారికి మాత్రమే సహాయంచేస్తామని ప్రభుత్వంవారి G. O. వున్నది. ఆప్రకారంగా చూచినట్లయితే ఈ ex-criminals ఎవ్వరూకూడా చదువుకోడానికి అవకాశంలేదుకాబట్టి అక్షరాభ్యాసం చేసినప్పటినుంచికూడా వాళ్ళకు సహాయంచేయడానికి ఏర్పాటుచేస్తారా?

MR. SPEAKER :—ఇది age ని గురించినప్రశ్న. యోగ్యతను గురించి కాదు.

[24th September 1955

SRI N. SRINIVASA RAO :—వయస్సుగురించే నేను తెలుపుతున్నానండి. వయస్సు నిర్ణయంచెయ్యడంలో ex-criminals కు I form వరకూ ప్యాసైతే తప్ప, ఇంతవయస్సుంటేతప్ప school లో join అవడానికి వీల్లేదన్నారు. ఆ age limits లేకుండా వారికి సదుపాయం చెయ్యడంకోసం ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—నాకేమీ అర్థంకాలేదు.

SRI N. SRINIVASA RAO:—ఎక్కువ వయస్సున్నవారికి scholar-ship ఇవ్వం అని definite గా చెప్పారు కదా?

(No reply.)

SRI P. SUNDARAYYA :—మంత్రిగారు 40, 45 సంవత్సరాలున్నప్పటికీకూడా Deputy Collector లు, ఇంకా పైఉద్యోగాలకుగాని application పెట్టుకోవడానికి ఇప్పుడున్న rules లో ఏమీ అభ్యంతరం లేదన్నారు. వారు చాలాకాలంగా మంత్రిగారయుంటున్నారు. కాబట్టి వారి హయాంలోగాని అంతకు ముందుగాని 40 ఏళ్ళుదాటిన హరిజనులుగాని, ఏ వెనుకబడిన జాతులలోయున్నటు వంటివాళ్ళుగాని Deputy Collector లుగాని, D. E. O. లుగాని applica-tions ఎంతమంది పెట్టుకున్నారు? పెట్టుకుంటే ఎంతమందికి ప్రభుత్వం వుద్యోగాలిచ్చింది?

THE HON. SRI B. GOPALA REDDI :—ఒకవేళ Deputy collector గా apply చేయకపోవచ్చును. కాని 30 సంవత్సరములు దాటినటు వంటివాళ్లు ఇతర departments లో అంటే Registration Department మొదలైన Department లో గాని apply చేసినటువంటివాళ్లున్నారు. ఇప్పుడు తీసుకున్నటువంటివాళ్లు కూడా ఉన్నారు. ఒకవేళ 45 కాకపోతే కాకపోవచ్చును గాని between 30 and 40 apply చేసినటువంటి వాళ్లున్నారు. District Munsiffs కూడాఉన్నారు.

SRI V. KURMAYYA:—అధ్యక్షా! Composite Madras ప్రభుత్వంలో హరిజనులకు Intermediate ప్యాసైనా, వాళ్లకు వయస్సుతో సంబంధంలేకుండా ఉద్యోగాలివ్వమని G. O. pass చేసినమాట వాస్తవమే. ఇప్పుడు Central Government వారు ఇచ్చేటటువంటి ఆదేశాలను పాటించినట్లయితే హరిజనులకూ, ఇతరులకూ, కూడా నష్టం వస్తుంది. కాబట్టి ఉన్నటువంటిదాన్నే అట్లా ఉంచుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అది Government of India వారు చేసినదాన్ని అనుసరించాలనే ఉద్దేశ్యంతో గవర్న మెంటు ఉన్నారు.

SRI PRAGADA KOTAIAH:—అధ్యక్షా ! ఇప్పుడు ప్రస్తుతం ఉన్నవే చాలా ఉదారంగా ఉన్నాయి. Govt. of India వారి rules వల్ల కొంత అపకారం జరుగుతుందన్నప్పుడు మరీ ఉదారంగా ఉండడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందంటారా లేక పోతే ప్రభుత్వం వెనకకు నడవడానికి ప్రయత్నం చేస్తుందా?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇది వెనకకు నడవడం ముందుకు నడవడం విషయం కాదు. యుద్ధానంతరం అనేకమంది హరిజనులు ఎంత వయస్సుతో ఉన్నప్పటికీ అప్పుడు Government Service లోకి రావచ్చునన్నారు. పెద్ద వయస్సున్నటువంటి వారంతా ఈపాటికి Government Service లో ఉంటారు. కాబట్టి ఇక ముందైనా సరియైనటువంటి వయస్సులో సరియైనటువంటి ఉద్యోగాలలో తర్ఫీతు పొంది పైకి వచ్చినప్పుడు అది బాగుంటుందని ప్రభుత్వం ఆలోచిస్తున్నారు.

*Separation of judiciary (Criminal) from the judiciary (Civil).*

523—

*1375 Q.—SRI P. RAJAGOPAL NAIDU : Will the Hon. the Deputy Chief Minister be pleased to state :—

(a) whether the Government propose to separate Judiciary (Criminal) from the Judiciary (Civil) ; and

(b) if so, when ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No.

(b) Does not arise.

SRI S. VEMAYYA :—ఎందువల్ల ఈ seperation కు ఒప్పుకోకుండా ఆలస్యం చేస్తున్నారు ! ఏ ఏ ఇబ్బందులు ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్నాయో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—వేమయ్యగారు ఏదో పొరపాటు చేస్తున్నట్లున్నారు. Further separation between civil

బుక్కపట్టణం అనే ఫిర్కాను కదిరికి చేర్చినట్లయితే అది economic unit గా work చేయడానికి అవకాశం అనుకుని ఉందని, బుక్కపట్టణం ఫిర్కాను కదిరికి కలిపే దానికి హిందూపురం బ్యాంకు వాళ్లను అడిగితే ఒప్పుకోలేదు. ఆ కారణంచేత చేయలేదు. ప్రత్యేకంగా కదిరి పెట్టితే చాల కష్టంగా ఉంటుంది. అందువల్ల ధర్మవరంతో చేర్చవచ్చును.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా! ఇది అంతా ధర్మవరం సంఘముయొక్క area of operation లో చేర్చాలంటున్నారు. అది సలహా మాత్రమేనా? తీరా సొసైటీ జనరల్ బాడీవారు refuse చేసినపుడైనా ప్రత్యేకంగా కదిరికి సొసైటి పెట్టుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది refuse చేయదని నేను హామీ ఇవ్వగలను.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా! ఇపుడు క్రమేపి private lending stop చేసి, బాంకులద్వారా మనం ప్రతి తాలూకాకుకూడ అన్ని కార్యాలు కల్పించాలని ఉండేటప్పుడు, economic uneconomic అనకుండా ఒక్కొక్క Land Mortgage Bank స్థాపించడానికి ప్రభుత్వం ఎందుకు ప్రయత్నం చేయకూడదని అడుగుతున్నాను.

THE HON. SRI D. SANJIVAYYA :—ప్రతితాలూకాకు ఒకటి ఏర్పాటుచేస్తే అక్కడ వుండేటటువంటి సిబ్బందిఖర్చు మిగత వ్యవహారాలు అన్ని కూడా చూచుకోవాలి. మరి ఆ ఖర్చుకూడా రానట్లయితే బాంకులుపెట్టి ఏమి ప్రయోజనం ?

*Harijan Colony at Gotlur.*

527—

*1132 Q.—SRI M. RAJARAM : Will the Hon. the Minister for Revenue be pleased to state whether there is any proposal to start a Harijan Colony with Government funds at Gotlur in Dharmavaram Taluk, Anantapur District ?

24th September 1955]

THE HON. SRI K. CHANDRAMOULI :—

The answer is in the negative.

SRI S. VEMAYYA :—ప్రభుత్వానికి అటువంటి కాలనీలు స్థాపించే ఆలోచన లేదంటున్నారు. ప్రభుత్వాన్ని స్థాపించమని ఎక్కడనుంచైనా దరఖాస్తులు వచ్చినాయా, తెలుసుకో వచ్చునా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంతవరకు అటువంటిది ఏమీ లేదు.

*Buses Plying in City service.*

528—

*1470 Q.—SRI M. MAHABOOB ALI KHAN : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state the number of buses plying in city service in Kurnool and the number of such buses in each district.

THE HON. SRI D. SANJIVAYYA :—

The number of buses plying in City service is 2 in Kurnool, 34 in Krishna, 12 in East Godavari, 9 in Visakhapatnam, 8 in Guntur, 3 in Cuddaph, 2 in West Godavari and 1 in Nellore. There is no city service in the districts of Srikakulam, Anantapur and Chittoor.

Sri S. VEMAYYA :—నెల్లూరులో city bus ఒకటి వున్నదని సెల విచ్చారు. ఒక bus కూడా ఇప్పుడు నెల్లూరులో run కావడంలేదు. ప్రతి జిల్లాలోకూడ కనీసం city bus ఒకటి regular గా నడిచేటట్లు ప్రభుత్వం చూస్తుందా?

THE HON. SRI D. SANJIVAYYA:—ఒక బస్సు run అవుతుందని చదివానండి. గౌరవసభ్యులు వినలేదు.

SRI D. KONDAIAH CHOWDARY :—ఈ మునిసిపల్ area లో city bus service నడపడానికి Municipality వారు కోరితే, వాండ్లకు preference ఇచ్చి, వాళ్ళే నడుపుకోడానికి అభ్యంతరమా ? Preference ఇస్తారా ఆ విధంగా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇంతవరకు ఎవరు అడుగ లేదు. అడిగితే చూస్తాము.

SRI N. C. SESHADRI :—కర్నూలులో కేవలం రెండు city bus లున్నాయని అన్నారు. రెండే bus లు ఉండడానికి కారణం traffic లేకుండా ఉండడమా? లేకుంటే ప్రభుత్వం ఏమైనా permit లు ఇవ్వకుండా వున్నారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—వృత్తులకు చాలినంత కలెక్షనులేదు. అవికూడా ఆగే ఆగే పరిస్థితులలోకూడా వుండినాయి. ఇప్పుడు అసెంబ్లీ మెంబర్సు ఎక్కువమంది వచ్చినారు. 196 మంది అయినందువల్ల కొంచెము బాగా ఉంది ?

Sri P. SURYANARAYANA :—శ్రీకాకుళంజిల్లా head-quarters పెట్టి, శ్రీకాకుళంనుంచి ఆముదాలవలసకు మరి ఒకటి రెండు బస్సులు వేయించుతారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది మీరు local Regional, Transport authorities కు వ్రాస్తే, వాండ్లు ఆలోచిస్తారు. వాండ్లు నిరాకరిస్తే గవర్నమెంటువద్దకు రావచ్చును.

SRI B. SANKARAIAH :—City service అని పేరేగాని, చాల చోట్ల ఆ ప్రక్క ప్రక్కనవున్న గ్రామాదులన్నీకలిపి అది city service కాకుండా చేస్తున్నారు. నెల్లూరులో ఒకటివుందని చదివారు. నెల్లూరులో ఒకటి కూడలేదు. ఇక ముందైనా city service అన్నప్పుడు దానిని city కి మాత్రం పరిమితం చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—City service అంటే 2 మైళ్ళలో, 3 మైళ్ళలో చిన్న చిన్న ఊళ్లు ఉండి ఆ city కి సప్లయి అయ్యే vegetables పాలు ఏదైనా ఉంటే, వాటికికూడ ఆ సౌకర్యం ఇవ్వాలని నేను భావిస్తున్నాను. నెల్లూరులో ఒక బస్సు ఉందని రికార్డులో ఉంది. ఈమధ్య ఈ answer వచ్చిన తర్వాత ఆగిపోయిందేమో ?

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా ! మంత్రిగారు సమాధానం చెప్తూ ఏ Municipality వారు కోరలేదని చెప్పారు. Chirala Municipality వారు ఒకసారి కోరడం జరిగింది. Turn down చేయడంకూడా జరిగింది. మళ్ళీ కోరి ఉన్నారు. దానిని ప్రభుత్వం పరిశీలిస్తుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—నేను రవాణా శాఖామంత్రి అయి ఆరు మాసాలు అయింది. ఈలోగా అటువంటిది ఏదీ నా దృష్టిలోకి తీసుకొని రాబడలేదు. నా దగ్గరకువస్తే తప్పక చూస్తాను.

SRI N. VENKAIAH :—శాసన సభా సమావేశ time లో కర్నూలులో ఎక్కువ ఆదాయం వస్తుందని అన్నారు. ఆ సమయంలో నైనా అదనపు బస్సులు నడపడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA :—పోయిన session లో అదనంగా రెండు బస్సులో ఒక బస్సో అదనంగా వేసినట్లు నాకు జ్ఞాపకం వుంది. మరి ఈ session లో కూడా వేసి వుంటారు. ప్రతిసారి session వున్నప్పుడు వుండే రెండు బస్సులు కాకుండా రెండో ఒకటో అదనంగా వేస్తూ వుంటారు.

SRI S. VEMAYYA :—ఈ city బస్సు సర్వీసులన్నీ కూడ private యాజమాన్యం క్రింద వున్నవా? ప్రభుత్వయాజమాన్యం క్రిందకూడా ఉన్నాయా? వుండకపోతే, ప్రభుత్వ యాజమాన్యమున, నడపటానికి, ఒకటి రెండు పట్టణాలలో ప్రయత్నిస్తుందా?

THE HON. SRI D. SANJIVAYYA:—ఇంతవరకు ప్రభుత్వ స్వాధీనంలో ఏమీ లేవు. ఆ ప్రయత్నం కూడ ఆలోచనలో లేదు.

SRI J. CHANDRAMOULI :—ప్రస్తుతం శాసన సభ్యులు అసెంబ్లీకి రావటానికి ఒక lorry supply చేస్తున్నారు. అదికాకుండా, సరియైన బస్సో కారో, ఏర్పాటు చేయటానికి మంత్రిగారు ఆలోచిస్తారా?

THE HON. SRI D. SANJIVAYYA:—ఆలాగే ప్రభుత్వంవారు ఏర్పాటు చేసింది. ఎవరికైనా operators కు permission ఇస్తే వాండ్లు first class బస్సులు (కార్లకంటే బాగా వుండే బస్సులు) పెట్టుతారు.

SRI P. SUNDARAYYA :—ఈ New hostel నుంచి Assembly కి వస్తున్నటువంటి బస్సులుకూడా, ప్రభుత్వ దృష్టిలో, city service బస్సుల క్రింద లెక్కేనా?

No answer.

SRI L. LAKSHMANA DAS :—ఇపుడు ఆంధ్రదేశంలో చాలా చిన్న చిన్న పట్టణములు వుండుటచేతను ఈ service విషయంలో baby cars సర్వీసు పెట్టితే చాలా వుపయోగంగా వుంటుంది. వాటిని introduce చేస్తారా?

THE HON. SRI D. SANJIVYYA :—ఆలోచనలో వుంది. త్వరలో నిర్ణయం జరుగుతుంది.

[Note: An Asterisk* at the commencement of a speech indicates revision by the member.]

12-00 Noon.

## II. NON-OFFICIAL BUSINESS.

### (1) Bills.

### (i) The Andhra Dowry Prohibition Bill, 1955.

SRI A. KALESWARA RAO : Mr. Speaker, Sir, I beg to move :

> " That leave be granted to introduce the Andhra Dowry Prohibition Bill, 1955 ".

MR. SPEAKER :—Is it opposed ?

THE HON. SRI B. GOPALA REDDI :—నేను oppose చేయడంలేదు.

MR. SPEAKER : The question is :

> " That leave be granted to introduce the Andhra Dowry Prohibition Bill, 1955 ".

The motion was carried and leave was granted.

SRI P. SUNDARAYYA :—ఈబిల్లు శీర్షిక తప్పితే, ఈబిల్లుయొక్క స్వరూపముగాని దాని క్లాజులుగాని మాముందేమిలేవు. అటువంటప్పుడు, మేము దేనినిబట్టి మా అనుమతిని ఇవ్వవలసి వుంటుందో అర్థంకావడంలేదు.

MR. SPEAKER : We are following the rules now in vogue. It is only when a Bill is opposed, the Chair will permit the member to make a brief explanatory statement.

I shall read the relevant rule. Rule 76 (1) of the Madras Assembly rules reads thus : " If a motion for leave to introduce a Bill is opposed, the Speaker, after permitting, if he thinks fit, a brief explanatory statement from the member who moves and from a member who opposes the motion, may, without further debate, put the question thereon. (2) If such a motion is agreed, the Bill shall be deemed to have

been introduced." Now, leave for introduction has been given and it shall be deemed to have been introduced.

SRI P. SUNDARAYYA:—ఇపుడు ప్రభుత్వము ఈబిల్లునుచూచే అనుమతించారా ?

MR. SPEAKER :—That is left to the Government.

SRI P. SUNDARAYYA :—గవర్నమెంటు ఇష్టం వచ్చినట్లు చేసుకోవచ్చా ?

MR. SPEAKER : It is open to you to oppose. It is not the Government alone that can oppose the Bill ; every member can oppose it.

Sri P. SUNDARAYYA :—ఈ బిల్లులో ఏ ముంచో చూడకుండానే oppose చేయడం ఎట్లాగు ? కనీసం శాసనసభ యొక్క ఆఫీసుకు నోటీసు వచ్చినప్పుడు, శాసనసభ ఆఫీసు మిగిలిన motions అన్నీ circulate చేసినట్లుగానే, ఇదికూడ శాసనసభ్యులకు circulate చేసి అనుమతి ఇచ్చినతరువాత Gazette లో print చేయవలసి యుంటుంది.

MR. SPEAKER : I have not got the machinery to publish it.

SRI P. SUNDARAYYA :—మీరు Speaker గా ఉండి ఆ విధంగా అంటే ఎట్లాగు? మీరు demand చేస్తే అవుతుంది.

MR. SPEAKER : It cannot be published before it is introduced. The rules do not admit of publication of a Bill before it is introduced, I can ask the Press to publish it.

SRI P. SUNDARAYYA :—ప్రజలకోసము, public కోసము చేయడమనేమాట లేదు. కాని శాసనసభ్యులకు ఈ బిల్లు తీసుకురావచ్చునా లేదా అని చెప్పడానికి కాపీలు ఇవ్వడం చాలా అవసరము. పార్లమెంటులో, ఇవి Gazette లో publish కాకముందు,: public కు, news-papers కు ఇవ్వక ముందు Parliament office అచ్చువేసి శాసనసభ్యులకు పంచిపెడుతారు. కాని ఇక్కడ ప్రవేశపెట్టిన తరువాత, అనుమతించడమా లేదా అనే సమస్య వస్తున్నది. Bill చూడకుండా అనుమతించడమనేది force క్రింద తయారవుతుంది. శాసనసభ ఆఫీసు దీనిని అచ్చువేసి శాసనసభ్యులకు పంచిపెట్టడానికి rules అడ్డము రావు.

THE HON SRI B. GOPALA REDDI :—కొత్త rules త్వరలోనే రాబోతున్నాయి. అవి బహుశా next sitting లో adopt చేయబోతాము. దాంట్లో దీనికి ఒక provision ఉందేమో అనుకొంటాను.

MR. SPEAKER :—I do not think we have made any provision even there.

THE HON. SRI B. GOPALA REDDI :—అయితే, ఇప్పుడు ఉన్నటువంటి రూల్సు ప్రకారం......

MR. SPEAKER : Mr. Sundarayya at one time was saying that by mere asking it could be introduced. That is what he was arguing at one time.

SRI P. SUNDARAYYA :—దానికి, దీనికి సంబంధంలేదు. ఏ బిల్లు అయినా శాసనసభకు వచ్చిన వెనువెంటనే, దాన్ని శాసనసభ ఆఫీసు అచ్చువేయించి శాసన సభ్యులకు అజెండాలో భాగముక్రింద పంచిపెట్టవలసి ఉంటుంది. ఈ పద్ధతి పార్లమెంటులో జరుగుతూ ఉన్నది.

MR. SPEAKER : If I understand the Parliament practice aright, as it obtains in England, the Bill need not be printed before it is introduced.

THE HON. SRI N. SANJEEVA REDDI : When once the Government accepts the principle, we will publish it. What is the purpose of publication if the principle is not accepted by the Government ? Supposing we are going to reject the principle itself, we need not waste so much time about the clauses, etc., and printing is a waste. We are only accepting the principle when we accept the introduction of a Bill.

Sri P. SUNDARAYYA :—బ్రిటిష్ పార్లమెంటు సాంప్రదాయాలు ఏమైనా కావచ్చు. అక్కడ ప్రభువులు, చక్రవర్తులు వీళ్లంతా ఉంటున్నారు. మన అదృష్టవశాత్తు, చక్రవర్తులుగాని, ప్రభువులుగాని ఇక్కడలేరని రాజ్యాంగములో ఉన్నది. మనము ఢిల్లీపార్లమెంటు సాంప్రదాయాలను అనుసరించవలసి యుంటుంది. అక్కడ ఏ బిల్లుఅయినా, దాని యొక్క స్వరూపము అంతాకూడా శాసనసభ్యుల ముందు పెట్టడం సాంప్రదాయము. ఇప్పుడు వీరు ఈ బిల్లు ఇచ్చారు. ఒక copy

ప్రభుత్వముదగ్గర వుందనుకుంటాను. ఒకశాసనసభ ఆఫీసుకు పంపించి ఉంటారు. తరువాత శాసనసభ ఆఫీసు అచ్చువేసి లేక cyclostyle అయినా చేసి శాసనసభ్యులందరికి ఈ రోజు సమావేశ మయ్యేటప్పటికి అందజేసి ఉండాలి.

MR. SPEAKER : I may tell the hon. Member Sri P. Sundarayya for his information that Sri Kaleswara Rao need not send a copy of his Bill at all ; it is enough if he sends notice that he wants to introduce a Bill to this effect. Any way, hereafter let us have a rule that when a member wants to introduce a Bill, he sends copies of it to the office.

Sri B. SANKARAIAH :—Principle ఒప్పుకుంటె తరువాత బిల్లు స్వరూపము తెలుసుకోవచ్చు, అసలు principle ఒప్పుకోకుంటే ఎందుకు బిల్లు అని సంజీవరెడ్డిగారు అన్నారు. ఇప్పుడు ఉదాహరణకు కొలుదార్లను తొలగించ కూడదనే principle పెడతారనుకోండి. కాని అయిదువేలు ఇస్తే తొలగించకూడదని బిల్లులో వుంటే, అది పెట్టిమట్టునప ఏమి లాభను. కనుక సభ్యులు బిల్లును అనుమతించడమా లేదా అనేందుకు ఆ బిల్లుయొక్క స్వరూపము, వివరాలు తెలుసుకోవడమనేది ప్రాథమికమైనటువంటి విషయం. అది సభ్యులకు ముందుగా అందజేయవలసియుంటుంది. దానికి ఇప్పుడు rules ఏమి అడ్డము రావనుకొంటాను. ఒకవేళ అట్లు కాకపోతే, rules ను సవరించి అయినా ఆ విధంగా చేయవలసిందని కోరుతున్నాను.

SRI P. SUNDARAYYA : Let the office do it.

MR. SPEAKER : We shall consider it next time. You provide a rule there. Then the office will do it.

SRI P. SUNDARAYYA :—బ్రిటిష్ ప్రభుత్వములో మేము ఏమి చేయలేకుండా పోయినామన్నారు. కాని 1947 నుంచి, మీరు అధికారానికి వచ్చినతరువాత ఢిల్లీ పార్లమెంటు యొక్క సాంప్రదాయాలను మనము అనుసరించవలసియుంటుంది. బ్రిటిష్‌వాళ్ళతో దెబ్బలాడి మన హక్కులు సంపాదించుకొన్నాము. అటువంటప్పుడు, దానిని శాసనసభలో ఎందుకు అవలంబించ కూడదు ?

MR. SPEAKER : We shall consider it in the next meeting.

THE HON. SRI B. GOPALA REDDI :—అంతవరకు ఈ bills introduce చేయకుండా ఉంటే బాగుంటుంది. (laughter)

[24th September 1955

(ii) The Andhra Moratorium Bill, 1955.

SRI VAVILALA GOPALAKRISHNAIAH : Mr. Speaker, Sir, I beg to move :

"That leave be granted to introduce the Andhra Moratorium Bill, 1955."

MR. SPEAKER : Is it opposed?

THE HON. Sri B. GOPALA REDDI :—అధ్యక్షా, దీనిని గౌరవ సభ్యులు ఒక తీర్మానం రూపములో పెట్టివుంటే అందరు దాన్ని గురించి చర్చించి, తమతమ అభిప్రాయాలను చెప్పడానికి వీలుండేది. అట్లు గాకుండా నోటీసులేకుండానే ఏదో Moratorium Bill ను తీసుకొనివస్తున్నారంటే, సుందరయ్యగారు చెప్పినట్లు, దాని స్వరూపమే తెలియకపోతే మేము దానిని అనుమతించడానికి వీలులేకుండా వుంది. అదీగాక, ఋణగ్రస్తుల విషయంలో ప్రభుత్వము ఆలోచించి త్వరలో ఏదైనా చేయుటకు పూనుకొంటున్నారు. కాబట్టి ఇది ఇప్పుడు అనవసరమైనటువంటి విషయమని నా అభిప్రాయము. కనుక గౌరవనీయ సభ్యులు దీనిని ఒక resolution రూపములో తెచ్చివుంటే బాగుండేది.

MR. SPEAKER . Mr. Gopalakrishnayya may make a brief statement.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, మొట్ట మొదట ఈ బిల్లును నోటీసులేకుండా తెచ్చామని అన్నారు. కాని దీనికి నోటీసు ఇచ్చి దాదాపు అయిదు నెలలైంది. తరువాత గవర్నమెంటుకూడా గవర్నరుద్వారా, దీన్ని move చేయడానికి మాకేమి రాజ్యాంగం 207 ఆర్టికల్ క్రింద అభ్యంతరం లేదు, move చేయవచ్చునని communicate చేసినారు. అందువల్ల నోటీసు లేదు అనేది చెల్లదు.

రెండవది, ఈ బిల్లుయొక్క ప్రధాన ఉద్దేశము గమనించవలసియున్నది. ఈ రోజున దేశంలో ఋణభారము చాలా జాస్తి అయింది. ఋణబాధ అనేది

చాలా విపరీతంగా పెరిగింది. దీన్నిగురించి ఇదివరకే ఒక చరిత్ర వున్నది. దీన్ని పరిశీలించడానికని సత్యనాథన్‌ను వేసినప్పుడు వారు దీనికి relief కావాలని చెప్పారు. దాని తరువాత మద్రాసురాష్ట్రంలో రాజాజీ ముఖ్యమంత్రిగా వచ్చినప్పుడు ఋణనివారణచట్టం (Debt Relief Act) తీసుకువచ్చారు. అందువల్ల, ఋణభారమును తగ్గించేటటువంటి ప్రయత్నం కొంత జరిగింది. ఇంతలోపల యుద్ధం వచ్చింది. దాని తరువాత దేశము ఆర్థికంగా అయోమయ అవస్థలో పడిపోయింది. ఆనాడు ఈ ఋణభారము ఎట్లా వున్నదో ఈ సమస్యను ఆలోచించి నివేదించవలసిందిగా కేంద్రప్రభుత్వం అన్ని రాష్ట్రప్రభుత్వములను ఆదేశించింది. అపుడు మద్రాసు గవర్నమెంటు B. V. నారాయణస్వామినాయుడుగారిని ఇందుకు ప్రత్యేక అధికారిగా నియమించినారు. వారు ఒక రిపోర్టు తయారుచేసి ఈ ఋణభారము ఏవిధంగా ఉన్నదో ఏస్థితికి మారిందో చెప్పారు. నోటుముమ్మరం (ఇన్‌ఫ్లేషన్) వచ్చినపుడు డబ్బు బాగావచ్చింది అనుకొన్నప్పుడు, 25 ఎకరాలకు పైగా ఉండేవారికి 30.9% ఋణభారము తగ్గింది. 25 నుంచి 5 ఎకరాలవరకు ఉన్నవారికి 24.6 వంతులు ఋణభారము తగ్గింది. అయిదు ఎకరాలక్రిందివారికి 12.3% మాత్రమే తగ్గింది. కౌలుదార్లకు 4% పెరిగింది. వ్యవసాయకూలీలకు 45% ఋణభారము పెరిగిందని అప్పుడు వారు చెప్పడం జరిగింది. యిదివరకు మనకు ఉమ్మడి మద్రాసురాష్ట్రంకు అటుతర్వాత మొన్నటివరకు ఆంధ్ర రాష్ట్రంకు Economic Advisor గా వుంటున్న నటరాజన్ గారు యింకను వి. కె. ఆర్. వి. రావుగారు, జాతీయ ఆదాయం, వ్యక్తి సగటు ఆదాయంగురించిన లెక్కలుతీసి రిపోర్టులు తయారుచేశారు. శ్రీ. వి. కె. అర్. వి. రావుగారు 1949-50లో సగటు ఆదాయం రు. 65/ వున్నదని అన్నారు. రూపాయిలలో ఆదాయం పెరిగినట్లు కనుపించినా అసలు ఆదాయం పెరగలేదని పైపెచ్చు 1931-32 వ సంవత్సరములో సగటు తల ఆదాయం 65 రూపాయలు వున్నదని చెప్పారు. శ్రీ నటరాజన్ గారు 1938-39 వ సంవత్సరములో, తలకు సగటు ఆదాయం రూ. 75-5-11 వున్నదని దానివల్ల పదిరూపాయలవరకు ఆదాయము జీవితములో తగ్గిందని చెప్పడము కూడా జరిగింది. జాతీయ ఆదాయం లెక్కలు తయారుచేశారు. 1951 వ సంవత్సరములో మహాలనబీసుకూడా తలకు సగటు ఆదాయం మదింపులో శ్రీ నటరాజన్ అంకెలతో అంగీకరించారు. ఆ నాడు డబ్బు అదవంగా కంటికి అగుపడిన మాట

Sri Vavilala Gopalakrishnayya] [24th September 1955

నిజమే అయితే అది పై తరగతివారికి వచ్చిందేమో కాని, క్రింది తరగతి సామాన్యజనముయొక్క జీవిత ఖర్చులో 53% ఆదాయాన్ని వారి తిండికి గింజలు కొనుక్కోటానికే ఉపయోగించవలసి వచ్చింది అనికూడా వివరించి నోటు ముమ్మరంవల్ల కూలీ రేట్లు పెరిగినందున ధాన్యం ధరలు పెరిగినా సామాన్య జనానికివచ్చిపడిన లాభం యేమీలేదని తేల్చిచెప్పారు. ఈ పరిస్థితులలో ఈ అంకెలు మదింపులు ప్రధానంగా ఇంటికి లెక్కలుప్రకారం వేశారు. ఈనాడు దేశములోవున్న పద్ధతిని బట్టి cost of living చాలా పెరిగింది అని గుర్తించాలి. 1936 వ సంవత్సరములో నూరువుంటే 1950 లో 434 వున్నది. ఇప్పుడు 1955 ఏప్రియల్ లో అది 360 కి వచ్చింది. అట్లాగే తెట్టంగి, ఆవడివరం, ఆలమూరు, మాధవరం యీ గ్రామాలలో మన ఆంధ్రప్రభుత్వము లెక్కలు తీస్తున్నది. ఆ అంకెనే గ్రామజీవితానికి సంబంధించినది అని చూపిస్తాను. తెట్టంగిలో 342, ఆలమూరు 344, మాధవరం 403, ఇవి గ్రామజీవితానికి సంబంధించినది. తరువాత పట్టణజీవితానికి సంబంధించినవి చూస్తే యేలూరు, విశాఖపట్టణం, బళ్లారి వీటికి లెక్కలు తీస్తూవచ్చారు. ఇప్పుడు బళ్లారికి లెక్కలు తీయటములేదు. యేలూరులో 385, విశాఖ పట్టణములో 375 వున్నది. అందువల్ల ఏ విధంగా చూచినప్పటికిని గ్రామజీవితములో అసలు ఆదాయంగా పరిగణించ గలిగింది 1936 నాటికి ఈ నాటికి మూడురెట్లు నాలుగురెట్లు పెరిగినట్లు కనుపించుచున్నది. అంటె అసలు ఆదాయం ఇంకొ వస్తుందని తేలుతున్నది. భారము చాలా ఎక్కువ అయిందని ఆ లెక్కలు చెబుతున్నది. పై పెచ్చు నిరుద్యోగం పెరిగింది. దానికోసమే రైతాంగంక్రింది మధ్యతరగతి జనం ఋణాలపాలు కావలిసి వచ్చింది. 900 కోట్ల రూపాయల గ్రామీణ ఋణంవుందని గ్రామీణ ఋణ విచారణ సంఘం (Rural Credit Commttee) తేల్చింది. ఈ నాడు గ్రామీణ పరపతి సౌకర్యాలు యెంతగా అవసరమువున్నదో, మనకందరకు తెలిసినదే. కేంద్ర ప్రభుత్వం ఈ విషయం పరిశీలించటానికి శ్రీ గోర్వాలా అధ్యక్షులుగా ఒక కమిటి వేసింది. వారు నివేదిక తయారుచేశారు. అందులోనే గ్రామీణ ఋణం 900 కోట్లని తేల్చారు. అందువల్ల గ్రామ ఆర్థికాభివృద్ధిలో గ్రామీణ ఋణసమస్య ఒక విడదీయలేని విధంగా పెనవేసుకొని వుంది అని చెప్పారు. అందువల్ల గ్రామజీవితానికి కావలసిన సహకారము అంతాకూడా గ్రామాలలోనుంచే రావాలి. కాని దానిసంగతి ఆలోచించే దిక్కు లేకుండావున్నది. అందువల్ల రాష్ట్రప్రభుత్వాలకుకూడా గ్రామాలనుంచివచ్చే బదులు పట్టణ జీవితాలనుంచే సౌకర్యాలు వస్తున్నవి. అంతే కాకుండా

యీ విధానము మార్చవలసి వున్నదనే వుద్దేశ్యముతో వారు ఒకమాట చెప్పారు. అది నేను యిప్పుడు "All India Rural Credit Survey" అనే పుస్తకములో నుంచి చదువుతున్నాను.

> "The problem of rural credit becomes inseparable from that of the re organisation of the socio-economic structure of the Indian village itself."

> "Lack of understanding and lack of sympathy, let alone a positive desire to help, are further and potent factors to be taken into account in explanation of the poverty of assistance which the rural institutions of credit have derived from the urban sources of finance."

> "The Committee considers that the rates of interest prescribed in the different States should be reviewed and revised wherever necessary. It also recommends that the administrative arrangements for the enforcement of money—lending legislation should be reviewed . . . ."

అందువల్ల ప్రభుత్వము వారికి కావలసిన సౌకర్యాలు చేయమని అంటే, దానికి time కావాలి అంటున్నారు. ఆ కమిటీవారు తయారుచేసిన రిపోర్టులోని సిఫార్సులను implement చేయబోతున్నామని అంటున్నారు. ఈనాడు ఋణభారము మాత్రము దేశములో తీవ్రంగా వున్నది. కాబట్టి, దాన్ని ఎదుర్కొనే పరిస్థితిని రక్షించటానికి విధానము మనము ఆలోచించినట్లయితే, మనకు ఒకటే పద్ధతి వున్నది. దానికి ఒక పథకంవేసి అమలు జరుపవలసివుంది. అందుకు సహాయకారిగా legislation తీసుకొని రావలసిన అవసరమువున్నది. అలాంటి legislation తీసుకొనిరావటానికి time కావలసివుంటుంది. గనుక యిప్పుడు ఉన్నటువంటి భారాన్ని ఆపి, వెంటనే ఆ భారాన్ని "ఆపండి" అని చెప్పి, దానిని పరిష్కరించు మార్గాలు అన్వేషించి, ఆ పథకాలకు ఒక స్వరూపంయిచ్చి, ప్రజలకు సహాయం కలిగించవలసివుంటుంది. గనుక, గవర్నమెంటుకు గూడా ఆ legislation తీసుకొని రావటానికి కాలవ్యవధి అవసరము గనుక ప్రస్తుతానికి మూడు సంవత్సరాలో, లేక రెండు సంవత్సరాలో, లేక ఒక సంవత్సరమో ప్రభుత్వం ఒక పథకంవేసి అమలుకు తెచ్చేవరకు అవసరమైన కాల

Sri Vavilala Gopalakrishnayya] [24th September 1955

పరిమితి నిర్ణయిస్తూ, అప్పులబాధ తప్పించాలి. ఈలోపుగా మారటోరియమ్ బిల్లును రెండువేల రూపాయల ఆదాయము కలవారికి వర్తించేటట్లు, ఆపైవారికి వర్తించనట్లు ఉండేటటువంటి బిల్లును తీసుకొనిరావలసివుంది. అందుకై ఈబిల్లును ప్రతిపాదిస్తున్నాను.

ఇంతే కాకుండా యీ బిల్లు వ్యవసాయదారుడు కానివ్వండి, కాక పోనివ్వండి, మధ్యతరగతి వారికికూడా వర్తించేటట్లు వుండాలి. ఈనాడు ప్రజలు అప్పులబాధవల్ల కృంగి కృశించిపోతున్నారు. ఆస్తివున్నవాడు తాకట్టు పెట్టుకుంటున్నాడు. అప్పుకోసం బజారు వెళ్లితే నూటికి అయిదురూపాయలు ఆరురూపాయలు, అంతకుపైగానో, లేక కనీసము నాలుగురూపాయలలో నెల వారిగా వడ్డిలెక్కకట్టి, వడ్డి తగ్గించుకొని సొమ్ము తెచ్చుకుంటున్నాడు. అది యివ్వ కుండా యీడబ్బును ముందుగా calculate చేసి, దాన్ని పైకం చేతికియిచ్చే టప్పుడు తగ్గించుకొని, నోటులోకలుపుకొని నోటువ్రాసియిస్తున్నాడు. ఆనోటువచ్చే ఆరునెలలకల్లా మరల మొత్తము పెరిగినట్లుగా నోటు వ్రాయించుకుంటున్నారు. ఆతరువాత ఆ కొత్తనోటుతీసుకొనిపోయి కోర్టులోవేసి డిక్రిపొంది మరునాడు వుదయ మునకల్లా యింటిలోవున్న సామాగ్రికోసము వస్తాడు. ఆస్తివున్నవాడు యిల్లు వాకిలి సాకు వున్నప్పుడు యెందుకు యీ తిప్పలువచ్చినవని అనుకుంటాడు. ఆస్తిలేని వాడు అయితే, యింట్లోవున్న తాడుబొంగరము బయటపడవేయటానికివస్తే, యిక్కడి నుంచి నేను ఎక్కడికిపోవాలి, అనేది ఆలోచిస్తాడు. దారి త్రోవతోచక అయోమయవస్థలో, పిల్లలు కుటుంబంమేమయి పోయేటట్లు, ఎక్కడుండేటట్లు, అనేది ఆలోచిస్తాడు. కాబట్టి దేశములోని ప్రజలు అప్పులవల్ల పడేబాధలు చెప్ప టానికి అలవికాకుండా వున్నది. ఈరోజున ప్రతివాడి ఆర్థికస్థితి ఎట్లా వున్నదో ఆలోచించండి. పెద్దవారివిషయము నాకు తెలియదుకానీ సామాన్య మధ్య తరగతివారు, పేదప్రజానీకము, వ్యవసాయకూలీలు, ఆతరువాత చిన్నచిన్న కాలు దార్లు, వీరందరి పరిస్థితి ఎట్లావున్నదంటే ఏపూటభోజనము . ఆపూటకు వెదుకు కుంటూ, వుంటాడు. లేకపోతే యీపూటకు భోజనమువున్నది. సాయంత్రముకు లేదు. ఇందుకే రోజు అలవిమాలిననిరుద్యోగం, పని లభించడంలేదు. నిరుద్యోగం పెరిగిపోతున్నది. నిరుద్యోగసమయంలో ఎవరైనా అప్పుయిస్తే ఉన్న ఆస్తిని చూచే. వానివెంటనే ఆ అప్పులవాడు అప్పుయిచ్చేదికూడా వున్నదేమన్నా వుంటె కాజేయటానికే. దానిని తీర్చుటకు, లేక నిరుద్యోగసమయంలో నిలువదోచుకొను టకు, నిరుద్యోగసమయంలో పాతబాకీలవారి బాధనుండి బయటపడుటకు దారి కనుపించడము లేదు. దానికి credit ఎవరైనాయిస్తారా అని ఆలోచించే పరిస్థి

తులు విషమంగా వున్నవి. Credit దొరకితే, పాతబాకీ ఎట్లా తీరుతుంది అని ఆలోచిస్తాడు. Inflation వచ్చింది, చాలా బాగా వున్నది అనుకున్నాము. అయితే డబ్బువచ్చింది. ఎవరికి వచ్చింది, అని అంతా లెక్కలుకట్టారే కాని, ఆలెక్కల ప్రకారము చూస్తే inflation వల్ల ప్రయోజనము పొందిందల్లా పెద్దరైతుతప్పితే, క్రిందిరైతుమాత్రంకాదు అని నేను ఖచ్చితముగా చెప్పగలను. ఇది అందరికీ తెలుసు. మద్రాసురాష్ట్రంలోని ఋణబాధను వివరించుతూ కేంద్రప్రభుత్వం కోరకపై తయారుచేసిన నివేదికలో బి. వి. నారాయణస్వామి నాయుడుగారు యీ విషయం తేల్చివేశారు.

Mr. SPEAKER : The rules say the hon. Member should give a brief statement or an explanatory note and not make an oration.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—నేను అందుకోసమే యింకొక అయిదు నిమిషాలు కైముకావాలని మీ అనుమతి తీసుకున్నాను.

MR. SPEAKER : Allright.

SRI VAVILALA GOPALAKRISHNAYA :—నాబిల్లు ఉద్దేశాలు ఇవి :—

> "Even during the days of inflation the people belonging to the lower strata of the society have borrowed or added to their previous debts in order to tide over the crisis. Now by the increasing unemployment, decline in agricultural prices and on the top of it lack of credit facilities, the position of those people has become worse. It is in the interest of general public at the present time steps have to be taken to see that they are spared from the harassment and expenditure involved in litigation launched by the creditors. So a temporary relief like the moratorium is felt necessary at least for three years. Hence this Bill."

ఈ రోజున దిన పత్రికలు కాదు, వార పత్రికలు చూస్తే, అందులో వేసిన publications అన్నికూడా attachment of property కి సంబం

Sri Vavilala Gopalakrishnayya] [24th September 1955

అన్నారు. వారు తెస్తే, తీసుకోనిరమ్మని అంటున్నాను. తెస్తే వద్దు అనేదిలేదు. దానికి నేను ఎప్పుడూ అభ్యంతరము చెప్పను. అందువల్ల యిదివరకు తేలేదు అని చెప్పడములేదు. ఈవిషయములో Provincial Congress Committee కూడా ఒక తీర్మానము చేసింది. నాకు బాగా జ్ఞాపకమువున్నది. ఆతరువాత, ఆంధ్ర ప్రదేశకాంగ్రెస్‌సంఘ ప్రెసిడెంటుగారుకూడా యీసంగతినిగురించి ఒక statement యిచ్చారు. ఆసంగతి నేను మరచిపోలేదు. అందువల్ల అందరుకూడా అంగీకరించిందే. కాని ఇంతవరకు ఆబిల్లు కదలలేదు. గనుక అది యిప్పుడు కదలటానికి నేనుతెచ్చిన ఈబిల్లు ఉపయోగపడుతుంది. అది కదలటానికి ప్రయత్నిస్తూంటే నేను succeed అయినానని చెబుతున్నాను. ప్రభుత్వమువారు బిల్లుతెస్తే, నేను నూటికినూరుపాళ్లు succeed అయినవాడిని అవుతాను. ఆబిల్లు రావటానికి యిది ఒక సూత్రం అని అంటున్నాను. అందువల్ల ప్రభుత్వము ప్యాసుచేయవద్దని అంటే గూడా, యీబిల్లును publication కు అనుమతియివ్వండి. Second stage మనకు ఏలాగూవున్నది. Consideration stage వచ్చేటప్పటికల్లా వారు బిల్లును తీసుకొనివస్తే నేను ఆరోజున నాబిల్లు ఆపివేసి, మీబిల్లుపెట్టుదాము. నా బిల్లు ప్యాసుఅయినా కాకపోయినా. మీబిల్లు అయితే, అది యింకా త్వరగా ప్యాసు అవుతుంది. ఆబిల్లుతెస్తే, అందులోవుండే క్లాజులు ఏవో చూడాలి. ఈ రోజున మూడుసంవత్సరాలవరకు మారటోరియం శాసనరూపంగా అప్పులబాధ లేకుండా రక్షణయివ్వండి. గ్రామప్రాంతాలలో యీనాడు ప్రజలు ఎంతబాధ పడుతున్నారో గమనించాలి. ఈరోజున బినామీనోట్లు వ్రాసినవాళ్లను కోర్టులకు లాగుతూవుంటే, అందుమీద వారుపడే బాధలుచూస్తే, చెప్పటానికి వీలులేదు. అసలు డబ్బే లేకపోతే, కోర్టుకుపోయి defend ఏవిధంగా చేసుకోగలడు? అసలు దమ్మి ఎక్కడిది? అందువల్ల అటువంటివారిని అప్పులబాధనుంచి సంరక్షించటానికి కనీసము మూడుఏండ్లవరకైనా రక్షణ ప్రకటించండి. ఈ విధానానికి అందరు ఒప్పుకుంటున్నారు. నేనుమాత్రము దానిమీద అధికముచెప్పనక్కరలేదు. లక్ష్మణదాసు గారు నన్ను interrupt చేసినందువల్ల నాకు కొంత ఉపయోగము అయింది యేమిటంటే "మేముకూడా ఆపాయింటు ఒప్పుకున్నాము" అని అన్నారు కాబట్టి ఇక దానిమీద నేను ఎక్కువచెప్ప నక్కరలేదు.

Sri RAJA V. V. KRISHNAMRAJU BAHADUR:—అధ్యక్షా, నేను యీ సందర్భములో చెప్పదలచుకున్నది యేమిటంటే, లక్ష్మణదాసుగారిపార్టీ అంటే యిదివరకు ప్రదేశకాంగ్రెసుపార్టీవారు గత కాంగ్రెసు కమిటీవారు ఒక బిల్లును ఏర్పాటుచేసి సిద్ధంగా వున్నారు. వారియొక్క ఉద్దేశ్యాన్ని గోపాలకృష్ణయ్య

గారు పనికట్టి ముందుగా ఏదో సాధించటానికోసం చేస్తున్నారని వారు చెప్పు తున్నారుకాని యదార్థముకాదు అని అంటున్నాను.

12-30 p. m.

A. VENKATRAMA RAJU :—అధ్యక్షా, ఇదివరకు ప్రభుత్వమువారు కాంగ్రెసువారుకూడా రు. 10 లు శిస్తును రద్దు చేస్తామని ప్రకటనలు చేశారు. ఆ రకంగా ఈ ప్రకటనకూడా చేసివుంటుందనే అనుమానము కలుగుతున్నది.

SRI PILLALAMARRI VENKATESWARLU :—దాంట్లో దేనిని వ్యతిరేకిస్తున్నారో, ఎందుకు వ్యతిరేకిస్తున్నారో, ఏ క్లాజువల్ల ప్రమాదము వచ్చి మంత్రివర్గము, దేశము తలక్రిందులు అవుతుందో ఏమీ తెలియకుండా అవి ఎటువంటి idea లో కూడా తెలియకుండా పోతోంది. అసలు ఇప్పుడు మేము ఓటుచేయాలో అక్కర లేదోకూడా తెలియకుండా పోతోంది.

ఇప్పుడు సభ్యులంతా ఓటుచేయాలి. ఇప్పుడు మీరుచెప్పిన సూత్రముప్రకారం వారు relief statement ఇస్తారనుకోండి. ఆ క్లాజులో ఏ implications వున్నాయో తెలియదు. మేముకూడా దానిని oppose చేస్తున్నాము. ఈ యేడాది లేకపోతే వచ్చే యేడాదో, ఏ అయిదు సంవత్సరములకు చేస్తారో, ఎప్పుడు చేస్తారో అనే నిర్ధారణ లేకుండా మంత్రిగారు సమాధానము చెప్పారు. ఎవరూ ఎటూ ఓటు చేయలేదు. ఎందువల్ల ఓటు చేయాలి అనేది నిర్ధారణ కాకుండా మనము ఏదైనా ఒక motion మీద ఓటుచేసే టటువంటి పద్ధతి ఎక్కడైనా వున్నదా ? ఇంకొకవిషయముకూడా మీ దృష్టికి తీసుకు వస్తున్నాను. ఇప్పుడు పార్లమెంటరీ ప్రాక్టీసు వున్నది. ఏ parliamentary practice లో అయినా సరే introductory stage లో, oppose చేసినటువంటి పార్లమెంటుగాని అసెంబ్లీగాని, 1946 నుంచికూడా చూస్తూనే వున్నాను. 1946 నుంచే అక్కరలేదు.

THE HON. Sri B. GOPALA REDDI:-Private bills ను ఎప్పుడు అయినా ఒప్పుకున్నామా ?

SRI PILLALAMARRI VENKATESWARLU :—ప్రైవేటు బిల్సు ఒప్పుకోవడము introductory stage లో మద్రాసు అసెంబ్లీలో ఏ మంత్రివర్గము కూడా oppose చేయలేదు. ఇప్పుడు మొదటిపర్యాయము మనము oppose చేస్తున్నాము. ఈ విషయము మీకుకూడా తెలుసు. అందువల్ల దీనిమీద మేముకూడా చర్చించడానికి అవకాశమయితే సంతోషిస్తాము.

MR. SPEAKER: Let the hon. Member make his brief explanatory statement and then the Hon. Minister will reply.

At this stage, Sri Pillalamarri Venkateswarlu again rose to speak.

MR. SPEAKER: The Hon. Member is not yielding.

SRI PILLALAMARRI VENKATESWARLU: He is yielding, Sir

MR. SPEAKER: I am giving my ruling. The Rule is clear:

> "76 (1): If a motion for leave to introduce a Bill is opposed, the Speaker, after permitting, if he thinks fit, a brief explanatory statement from the member who moves and from a member who opposes the motion, may, without further debate, put the question thereon.
>
> (2) If such a motion is agreed, the Bill shall be deemed to have been introduced."

SRI PILLALAMARRI VENKATESWARLU: The word used in the rule is 'may'. It is in the discretion of the Chair.

MR. SPEAKER: 'May' here means 'to permit the Member to speak.' There is no question of debate. I can permit a Member to make a brief statement. The rule does not contemplate any discussion at this stage. That too, '*if I think fit*' I may permit Sri Gopalakrishnayya to make a statement and not otherwise. I cannot permit any other Hon. Member to take part and make it a debate. We cannot have a debate at this stage.

SRI PILLALAMARRI VENKATESWARLU: Sir, the rule is rather vague. The discretion is still in your hands and that is my interpretation of the rule. We do not find this procedure in any Parliament.

MR. SPEAKER : Let Mr. Sundarayya interpret this rule. The wording is ". . . . . . . . the Speaker, after permitting, if he thinks fit, *a brief explanatory statement from the member who moves and from a member who opposes the motion,* ........" I would have allowed the Member if he had opposed the Bill.

SRI PILLALAMARRI VENKATESWARLU : Here, it is said, '........may, without further debate,.........'. So, the Chair can allow the debate in your discretion.

SRI S. RANGANATHA MUDALIAR : The question is whether the word 'may' goes with the words 'without further debate' or with the words 'put the question thereon'.

MR. SPEAKER : The word 'may' goes with 'to put the question thereon.'

SRI S. RANGANATHA MUDALIAR : The Speaker may not put the question also.

MR. SPEAKER :—Yes, exactly.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా! ఎందువల్ల ఏ రూపంలో తీసుకురావటము అనేదివారు చెప్పినదాంట్లో ఇంకా details లో అభిప్రాయభేధాలుము వున్నాయా అంటే మొత్తము అంతలోనూ ఒకటివున్నది. General గా వొప్పుకున్నామని లక్ష్మణ దాసుగారు అంటున్నారు. శ్రీ చంద్రమౌళిగారు మేము అంగీకరించలేదంటున్నారు. వారు ఇద్దరూకలసి ఆ విషయంగురించి తేల్చుకున్న తరువాత ఆలోచించవచ్చు. ఈ బిల్లులో ప్రధాన విషయము మూడు సంవత్సరములవరకు ఇవాళ కోర్టుల్లో వున్న decree లు అన్నిన్ని Court లో sueచేయడానికిగాని లేకపోతే decree చేయడానికిగాని ఇవన్నీ అమలు అపుచేయాలనేది ఒకటి ముఖ్యమాత్రం. సంవత్సరమునకు రెండువేలరూపాయలు మించకుండా ఆదాయం వున్నవాళ్లు ఎవరైతేవున్నారో వాళ్లందరికి మాత్రమే యిది వర్తించాలి. గవర్నమెంటుకు చెల్లించవలసిన అప్పులు, maintenance కు ఇచ్చేటటువంటి అప్పులు, కో-ఆపరేటివ్‌కు సంబంధించినటువంటి అప్పులు వీటికి ఇది అన్వర్తించదు అని ఒక విషయముకూడా వున్నది. ఈ మారటోరియంకు వ్యవధి మూడు

Sri Vavilala Gopalakrishnayya] [24th September 1955

సంవత్సరములు పెట్టడనూ అనే ప్రశ్నకు నేను ఇందాక సమాధానం చెప్పాను. గవర్నమెంటు ఈ రూరల్ క్రెడిట్ సర్వే రిపోర్టును అమలు జరపడానికి కొంతపని ప్రారంభించాము. మేము త్వరలో పూర్తిచేస్తాము అని చెప్పుతున్నారు. సంవత్సరము లోపల పూర్తిచేసి credit facilities యేర్పాటుచేయు ప్రయత్నిస్తున్నామంటు న్నారు. పరపతిసౌకర్యం కలిగించకుండా Debt relief ఇవ్వడము ఇబ్బంది అవు తుందని వారు చెబుతున్నారు. Credit facilities ఇవ్వడానికి ప్రభుత్వము ఏమైనా చర్య తీసుకుంటుందా? Non-Government basis మీదగాని Co-operative basis మీద కాకుండా కాని పరపతి సౌకర్యం కలిగించబడితే అది ప్రయోజనం కాదని ఈ గ్రామ పరపతిసంఘం ఈ విధంగా తేల్చి చెప్పింది.

"In the opinion of the Committee, that initial help, if it is to be of the requisite magnitude and of a type which will enable the co-operative organization to withstand the pressure of opposition of vested interests can only come from the State."

అందువల్ల వారికి సావకాశము ఇవ్వడము అవసరము. ఆ ప్రయోజం పొందే లోగా ఋణస్థులు చేతుల్లోనుండి పొలాలు ఇతర చరస్థిరాస్థులు జారిపోకుండా కొన్నాళ్లపాటు relief ఇవ్వడము అనే ఉద్దేశ్యం దీంట్లో వున్నది. ఈ అవసరం దేశ వ్యాపితంగా అవసరం కనబడుతోంది. కనుక దీనిని కనీసం leave of the House కు allow చేయమని మరొకసారి ప్రభుత్వాన్ని కోరుతున్నాను. లేకపోతే ప్రజలు దానిసంగతి చూస్తారు.

THE HON. Sri B. GOPALA REDDI :—నేను మొదట చెప్పిన దానికంటే ఇంకేమీ చెప్పవలసిన అవసరం కనిపించడము లేదు. ఈ విషయం ప్రభుత్వమువారు ఆలోచిస్తున్నారు. నేను మొదటచెప్పిన నిర్ణయానికి ఏలాంటి మార్పు లేనందుకు విచారిస్తున్నాను.

MR. SPEAKER : The question is :

"That leave be granted for the introduction of the Andhra Moratorium Bill, 1955."

The motion was declared lost.

Sri Vavilala Gopalakrishnaiah demanded a poll and the House divided thus :

*Ayes.*

1. Sri Vavilala Gopalakrishnayya.
2. Sri K. V. S. Padmanabha Raju.
3. Sri B. Adinarayana.
4. Sri G. Suryanarayana.
5. Sri M. Satyanarayana Raju.
6. Sri C. V. Somayajulu.
7. Sri A. Yeruku Naidu.
8. Sri P. Sundarayya.
9. Sri. Pillalamarri Venkateswarlu.
10. Sri B. Rathnasabhapathy Setty.
11. Sri S. Vemayya.
12. Sri A. Venkatrama Raju.
13. Sri B. Sankarayya.
14. Sri V. Visweswara Rao.
15. Sri P. Satyanarayana.
16. Sri G. Bussanna.
17. Sri S. Seetharamayya.
18. Sri Mahammad Tahseel.
19. Sri G. Ramunaidu.

*Noes.*

1. Hon. Sri B. Gopala Reddi.
2. Hon. Sri N. Sanjiva Reddi.
3. Hon. Sri K. Chandramouli.
4. Srimathi Ammanna Raja.
5. Srimathi Rukmini Devi.
6. Sri M. R. Appa Rao.

7. Sri B. Appa Rao.
8. Sri Y. Audinarayana Reddi.
9. Sri G. Bapaiah.
10. Sri P. Bapaiah.
11. Hon. Sri D. Sanjivayya.
12. Hon. Sri A. B. Nageswara Rao.
13. Sri S. Brahmayya.
14. Sri J. Chandramouli.
15. Sri Y. Channaiah.
16. Sri N. Chenchurama Naidu.
17. Sri N. P. Chengalraya Naidu.
18. Sri Chitambara Reddi.
19. Sri Marupilla Chitti *alias* Appalaswamy.
20. Sri M. Doraikannu.
21. Sri T. Gopalakrishnayya Gupta.
22. Sri P. Thimma Reddi.
23. Sri V. Kurmayya.
24. Sri P. Gopalu Reddi.
25. Sri N. Govindarajulu.
26. Sri P. Gunnayya.
27. Sri Hanumantha Reddi.
28. Sri M. Harischandra Prasad.
29. Sri Gadiraju Jagannadharaju.
30. Sri T. Jiyyardas.
31. Sri A. Kaleswara Rao.
32. Sri P. Kodandaramayya.
33. Sri Divi Kondiah Chowdary.
34. Sri M. Koti Reddi.
35. Sri K. V. Krishnavatharam.
36. Sri Raja V. V. Krishnam Raju Bahadur.
37. Sri L. Lakshmana Dass.

38. Sri J. Laxmayya.
39. Sri N. K. Lingam.
40. Sri Mahaboob Ali Khan.
41. Sri Mahammad Rahamatullah Shaik.
42. Sri M. Munuswami.
43. Sri Ch. S.R.V.P. Murthy Raju.
44. Sri P. Pamideswara Rao.
45. Sri D. Perumallu.
46. Sri Kottapalli Punnayya.
47. Sri P. Rajagopala Naidu.
48. Sri N. Ramabhadra Raju.
49. Sri T. Prakasam.
50. Sri B. Rajayya.
51. Sri Rajaram.
52. Sri D. Ramabrahmam.
53. Sri T. Ramachandra Reddi.
54. Sri P. Ramacharlu.
55. Sri Kunda Ramaiah.
56. Sri P. Ramaswami Naidu.
57. Sri G. Ramaswami Reddi.
58. Sri M. Ramayya.
59. Sri N. Ramulu.
60. Sri P. Ranga Reddi.
61. Sri U. Rangababu.
62. Sri M. Rangayya.
63. Sri Rathnam.
64. Sri K. Santhappa.
65. Sri Chowdary Satyanarayana.
66. Sri A. Satyanarayanamurthy.
67. Sri K. Seetharamaswamy.

68. Sri P. Anthoni Reddi.
69. Sri Raja Sagi Suryanarayana Raju.
70. Sri N. C. Seshadri.
71. Sri P. Singarayya.
72. Sri N. Srinivasa Rao.
73. Sri A. C. Subba Reddi.
74. Sri Shaik Moula Saheb.
75. Sri Challa Subbarayudu.
76. Sri K. Shanmugam.
77. Sri C. P. Thimma Reddi.
78. Sri R. Thirupathi Rao.
79. Sri T. Veeraraghavulu.
80. Sri K. V. Vema Reddi.
81. Sri Nagineni Venkaiah.
82. Sri K. Venkatramanayya.
83. Sri D. Venkataramana Reddi.
84. Sri M. Venkataraju.
85. Sri P. Venkataravanappa.
86. Sri G. Venkata Reddi.
87. Sri K. Venkatarathnam.
88. Sri P. Venkatasubbaiah.
89. Sri A. Lakshmunaidu.
90. Sri R. Latchapatrudu.
91. Sri V. Kothandarami Reddi.
92. Sri B. Venkatasivayya.
93. Sri M. Matcharaju.
94. Sri Nachu Venkatramayya.
95. Sri Vijaya Bhaskara Reddi.
96. Sri R. B. Ramakrishna Raju.
97. Sri P. Narasimhappa Rao.

24th September 1955]

98. Sri P. Suryanarayana.

99. Sri Ranganatha Mudaliar.

100. Sri T. Papa Rao.

101. Sri B. Rama Reddi.

102. Sri K. Appa Rao.

Ayes : 19

Noes : 102

The motion was lost.

(iii) The Madras Estates (Abolition and Conversion into Ryotwari) Amendment Bill, 1955.

SRI R. B. RAMAKRISHNA RAJU : Mr. Speaker, Sir, I beg leave of the House to move :

> " That leave be granted to introduce the Madras Estates (Abolition and Conversion into Ryotwari) Amendment Bill, 1955."

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇందులో కూడా చాలా చిక్కులున్నాయి. సరియైన విధంగా లేదు. ప్రభుత్వం ఒక విధంగా ఆలోచిస్తోంది. దానిని రామకృష్ణరాజు గారిని withdraw చేసుకోవాలని కోరుతున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఇది సరిగా లేదని చెబుతున్నారు. ఈ బిల్లు కాపీ తమ ఆఫీసులో ఉన్నదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—సెక్షను 38 amend చేయాలని చెప్పారు. అందులో వుండే చిక్కులను ప్రభుత్వం ఆలోచిస్తోంది. దానిని withdraw చేసుకోవాలని కోరుతున్నాను.

SRI PILLALAMARRI VENKTESWARLU:—బిల్లు మీ ఆఫీసులో వున్నది. అది మీకుతప్ప ఎవరికి తెలియదు. వారు discuss చేసుకుంటే అది private affair. దీనికి explanatory statement అయినా ఇస్తే బాగుంటుంది.

MR. SPEAKER :—వారికి లేనిది మీకు ఎందుకు ?

Sri R. B. RAMAKRISHNA RAJU :—అయ్యా ఆ బిల్లును గవర్నమెంటువారు తీసుకొనిరావలసినది అని నా అభిప్రాయము. నేను ఏదో ఒక బిల్లు తీసుకొనివచ్చాను. మేము యోచిస్తున్నాము. కొన్ని నెలలు తాళండి అంటె నిదానించవచ్చు. నేను తెచ్చినదానిలో కొన్నిపొరపాట్లు ఉండవచ్చును. దానిని rules చేసి amend చెయ్యవచ్చును. తొందరపడి ప్రయోజనము లేదుకూడా. గవర్నమెంటువారు దానిని సక్రమముగా యోచించి, సక్రమమైన బిల్లును తీసుకురావలెను. నా బిల్లులో తప్పులువుంటే పొరబాట్లు దిద్దవలెనని చెపుతూ నేను ఉపసంహరించుకొనడానికి మీ అంగీకారము కోరుచున్నాను. తీర్మాన రూపంగావస్తే చర్చించడానికి బాగుంటుంది.

I beg leave of the House to withdraw the Bill.

**MR. SPEAKER : Sri Ramakrishna Raju wants to withdraw the Bill. I think the House gives him permission.**

**The motion was, by leave of the House, withdrawn.**

THE HON. SRI B. GOPALA REDDI :—బిల్లు తీసుకొనివచ్చి దాని స్వరూపం తెలియకుండా ఎట్లాగ ? గవర్నమెంటుకు చెప్పతలచుకున్నది తీర్మానము రూపముగా చెప్పినతరువాత గవర్నమెంటు చెయ్యకపోతే బిల్లు తీసుకు రావచ్చును పరవాలేదు.

SRI R.B. RAMAKRISHNA RAJU.—పాయింట్లన్ని Resolutionలో తీసుకురావడం కష్టము. ఆ పద్ధతి మార్చవలెనంటే ఏమి కష్టము? మీకు ఎరుకపరచడానికి resolution 29 నాటికి తీసుకువస్తాను. చర్చించుదాము. మా అదృష్టము ఉంటేనే లెండి. బాలటువస్తే గవర్నమెంటువారికి ఎరుకపరచడమే నా అభిప్రాయం కాబట్టి అందులకు ఏమి కావాలన్న చెయ్యడానికి సిద్ధముగా ఉన్నాము.

## (2). RESOLUTIONS.

**SRI S. VEMAYYA : Mr. Speaker, Sir, I move :**

**" This Assembly recommends to the Government that the recommendations of the Central Pay Commission regarding the revision of the scales of pay of the Non-Gazetted Officers be implemented giving retrospective effect from 1st October, 1953."**

**(At this stage, Temporary Chairman Sri M. R. Appa Rao, occupied the Chair.)**

24th September 1955] [Sri S. Vemayya

ఈ తీర్మానాన్ని నేను ప్రతిపాదిస్తున్నాను. ప్రభుత్వం ఈ సిఫార్సును తప్ప కుండా అంగీకరిస్తుందని ఆశిస్తున్నాను. గాని పూర్తిగా అన్ని resolutions అమలుజరుపలేక పోవచ్చును కాని కొన్నింటిని అయినా అమలుపరచడానికి పూను కొంటుందని నేను నమ్ముతూమునవారికి ఇప్పుడు ఈ Non gazetted officersల ఇబ్బందులను, బాధలను ప్రభుత్వదృష్టికి తీసుకొనివస్తే కనీసము వారికి కొన్ని సదుపా యములను కలుగచేస్తుందని ఆశిస్తున్నాను. ముఖ్యముగా మన రాజ్యాంగచట్టములో 38, 39 articles లో చెప్పినట్లు ఆర్థికముగాగాని, సాంఘికముగాని ఈ తారతమ్యములు లేకుండా నివారణచెయ్యడానికి పూనుకొనవలెనని సూచింపబడ్డది. ఆసూచనలు పురస్క రించుకొని ప్రభుత్వం ఈ జీతం పెంపకానికి పూనుకొంటుందని విశ్వసించుచున్నాను. ఇప్పుడున్న service లో ముఖ్యముగా ఈచిన్న జీతగాళ్లవిషయము తీసుకుంటే చిన్న Non-Gazetted officers ల జీతాలు పెంచవలెననేది కొత్తకాదు. ప్రభుత్వమునకు కనీసము 3,4 కోట్లు ఎక్కువ ఖర్చు ప్రభుత్వ ఉద్యోగస్థులమీద అయినప్పటికి నష్టము లేదు. వారి బాధలు నివారణఅయి వారు ప్రభుత్వానికి ఎక్కువ పనిచూపించడానికి గాను వీలు కలుగుతుంది. వారిలోవుండే దురభ్యాసములు లంచగొండితనములు పోగొట్టడానికి వీలుకలుగుతుంది. ప్రభుత్వం వాటన్నింటిని దృష్టిలో పెట్టుకొని 2, 3 కోట్ల డబ్బు ఖర్చు అయినా ఈ సిపార్సులను అంగీకరించుతుందని నేను నమ్ము చున్నాను. ప్రభుత్వ Technical Departments తీసుకుంటే estimates లో గాని సప్లయిలద్వారాగాని ఇంకా అనేకవిధాల ప్రభుత్వానికి డబ్బు దూబారా అగు తుంది. ఇవి అరికట్టవలెనంటే పటిష్ఠమైన న్యాయమైన ఉద్యోగస్థులు వుండాలి. అది ఎట్లావస్తుంది? వారి జీతాలుసరిగా వుంటేనే ఇది సాధించడానికి వీలు ఉంటుంది. కాబట్టి ప్రభుత్వం దీనిని తప్పకుండా ఆలోచించి కేంద్రప్రభుత్వం సూచించిన సూచ నలను అనుసరించేదానికి పూనుకొనవలెనని కోరుచున్నాను. వివరాలలోనికి పోవడానికి వ్యవధి చాలదు. బంట్రోతులకు 18/-రూపాయలు జీతం ఇస్తున్నారు. Chief Secretary కి 3000/-పైగా జీతం ఇస్తున్నారు. Revenue Board మెంబర్లకు అదే scale లుకూ ఇస్తున్నారు. ఎందుకు ఈ తారతమ్యము ఉండాలి. చిన్న ఉద్యో గస్థుల జీతాలు పెంపకానికి ప్రభుత్వం పూనుకొంటుందని నమ్ముతున్నాను. ప్రభు త్వములో ప్రస్తుతము 1954 సంవత్సరంవరకుకూడా S. S. L. C. తప్పినా కొన్ని Technical పరీక్షలలో, Typewriting, Shorthand ప్యాసు అయినవారికి Ministerial Services లో ఉద్యోగాలు ఇవ్వడము జరుగుతూఉండేది. కాని ఏ కారణంవల్లనో నవంబరు 1954 నుండి తీసివేశారు. ఆ ఆర్డరుతిరిగి అమలులోనికి తీసుకు రావలెనని కోరుచున్నాను. ఇంత అధ్వాన్నముగా ఉన్నాయి వారిజీతాలు. ఇంక

Sri S. Vemayya] [24th September 1955

వారి allowances తీసుకొంటే మరీ అన్యాయంగా వుంది. Dearness Allowances, Daily allowance, Malaria allowance, Bad climate allowances, Hill allowance లు ఇస్తున్నారు. Daily రోజుకు బత్తా ఎంత ఇస్తున్నారు. పోలీసు కాంస్టేబులు ఎక్కడైనా కేస్ డ్యూటీమీద వెళితే రోజుకు 0/12/0 ఇవ్వడము జరుగుతుంది. హోటలుకు వెళితే పూటకు 0/10/0 0/14/0 0/12/0 కావలెను. రెండురూపాయలు ఖర్చు పెడితే 0/12/0 ఇస్తారు. ఇది సరిపోతుందా అని ప్రభుత్వం ఆలోచించవలెను. 0/12/0 ఇస్తే అతను ఉద్యోగము చెయ్యలేడు. పనిచెయ్యడానికి ఆసక్తిఉండదు. ఇంకో విధముగా సంపాదించుకొనమని దొంగమార్గాలు చూపించడము అన్నమాట. రోజుకు 2/-రూపాయలు Daily allowance ఉండవలెనని నేను చెప్పుచున్నాను. ప్రభుత్వంవారు ఈ inferior servants బాధలు నివారణచెయ్యవలెనని కోరుచున్నాను.

Budget చర్చలప్పుడుకూడా నేను ఈ peons విషయం చెప్పాను. వాళ్ళకు 20 సంవత్సరాలు సర్వీసున్నప్పటికీ వాళ్ళ ఉద్యోగాలు టెంపోరరీగా వుండిపోతున్నాయి, ఖాయంచేయడంలేదని ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకువచ్చినప్పుడు ఇది చాలా అన్యాయంగానే యున్నది, నేను విచారిస్తానని, వారు హామీ ఇచ్చారు. ఆవిషయమై కొంత విచారణకూడా జరిగినట్టు తెలుస్తోంది. కాని ఇప్పటివరకూకూడా అది క్రియారూపేణా రూపం దాల్చలేదు. తొందరగా వాళ్ళందరినీ permanentగా చెయ్యాలనిచెప్పి ప్రభుత్వాన్ని కోరుతున్నాను. అదేవిధంగా ఈ Highways Department లో ఈ మేస్త్రీలు వగైరాలు permanent కాకుండా ఉంటున్నారు. కొంతమందిని కూలీలక్రిందకూడా ఉంచుకుంటున్నారు. ఆకూలీ ఆ సేవిధానం మానేసి వాళ్ళనుకూడా permanent ఉద్యోగస్థులుగాచేయాలని మనవిచేస్తున్నాను. ఈHighways మేస్త్రీలు, మైలుకూలీలు వీళ్ళందరినీ ఎందరు మన కవసరమో వారిని permanent చెయ్యాలని అక్కడున్న ఉద్యోగస్థుల దయాదాక్షిణ్యాలకు వదలిపెట్టకుండా వాళ్ళ services కి security కల్పిస్తారని నేను ఆశిస్తున్నాను. అదేవిధంగా వ్యవసాయ Department లో కొన్ని వందలూ, వేలమంది మేస్త్రీలు వగైరాలుంటున్నారు. ఆదేవిధంగా లస్కర్లు ఉంటున్నారు. వాళ్ళందరినీ ఖాయపరచాలని నేను మనవి చేస్తున్నాను. ఈ లస్కర్ల విషయంలో ఒక విశేషాన్ని ప్రభుత్వదృష్టికి తీసుకురావలసివస్తోంది. లోగడ బ్రిటిషుప్రభుత్వంవారు ఉన్నప్పుడు పెద్దపెద్ద ఇంజనీర్లు వగైరాలు తెల్లవాళ్లున్నపుడు పడకవంతులని రాత్రిపూట ఈ ఉద్యోగస్థుల ఇళ్ళదగ్గర కాపలాకాయాలి. అనేకచోట్ల నేను విచారించాను. వీళ్లు 15 మైళ్ళదూరంలో యున్నప్పటికీ పడకవంతుకోసంగాని ఈ Superintending

Engineer లూ, Executive Engineer లూ, Sub Divisional Officer లు వీళ్ళ ఇళ్ళదగ్గర వంతులుపడుకోవడం జరుగుతోంది. వాళ్ళకు రానూపోనూ బత్తెఖర్చులుగాని వాళ్ళతిండి సమస్యగాని ప్రభుత్వమేమైనా విచారిస్తుందా అంటే విచారించడంలేదు. వాళ్ళకిచ్చే అల్పవేతనంలో వాళ్లు నడిచో ఎల్లాగోబాధపడి headquarters కివెళ్ళి అక్కడ కాపలాకాసి తెల్లవారేటప్పటికి మళ్లీ తన డ్యూటీకిపోవాలి, Superintending Engineer పడకగదిదగ్గర రాత్రిపూట పడుకునేవాళ్లు ఒకరోజుకి ఏడుగురు.Executive Engineer పడకగదిదగ్గర రాత్రిపూట పండుకునేవాళ్లు ముగ్గురు. Sub Divisional Officer ఇంటిదగ్గర కాపలాకాసే వాళ్లు పడకవంతుకు ముగ్గురు. అల్లాగే section officer ఇంటిదగ్గర కాపలాకాసే వాళ్లు రోజుకిద్దరు వాళ్లు ఈవిధంగా బాధపడి ఎంతోదూరంనుంచి నడచివచ్చి అక్కడ పడకవంతులు పడుకొని మళ్ళీ వాళ్ళయొక్క డ్యూటీకిపోవడం, వాళ్లకిచ్చే చిన్న వేతనముతో ఎల్లా వీలవుతుంతో ప్రభుత్వంవారు గమనించాలనీ,ఎప్పుడో బ్రిటిషు ప్రభుత్వం రోజులలో ఉన్నటువంటి విధానాన్ని ఇంకామనం అమలుపర్చడం సమంజసంగాలేదని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ప్రభుత్వం దీనివిషయమై విచారణ జరిపించి ఇటువంటివి జరగకూండా ఉత్తరవులు జారీచేయవలసినదిగా ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను. చిన్న ఉద్యోగస్థులు పెద్ద ఉద్యోగస్థుల మాటవినకపోయినా, ఇంట్లో పనిచేయకపోయినా లేక బిడ్డను ఎత్తుకోకపోయినా ప్రభుత్వపనులుగాక private పనులకు ఉపయోగపడనందువల్ల ఈచిన్న ఉద్యోగస్థులకు పదేపదే transfer చేసే విధానం ఆపుచేయడానికి ప్రభుత్వం చర్యతీసుకోవాలని మనవిచేస్తున్నాను. Attenders జీతాలుకూడా peons జీతాలలాగే ఉన్నాయి. దుమ్ముఅవీ తుడిచి ఆరోగ్యం చెడిపోయి అనేకవిధాల బాధపడుతూయున్న attenderలున్నారు. వాళ్లకు ఏదైనా sick allowance ఇవ్వాలని మనవిచేస్తున్నాను. ఇతర department లలో daffedar లు పెద్ద peon లు ఉన్నారు. లోగడ శ్రీ గోపాలరెడ్డిగారు Madras లో ఆర్థికమంత్రిగా వున్నప్పుడు రెండురూపాయిలో, మూడురూపాయిలో ఇస్తుండేవారలు. తరువాత ఆర్థిక పరిస్థితివల్ల అది తగ్గించడం జరిగింది అని నాకు తెలుస్తోంది. Head peon గా ఉండేవారికి వాళ్లలో కాస్త గౌరవం వుండాలికొబట్టి ఈ head peons కూ, Duffadar లకూ ఆ తగ్గించిన రెండురూపాయిలూ మరల పునరుద్ధరించాలని నేను మనవిచేస్తున్నాను. ఒక Registration Department తీసుకున్నప్పుడు ఈ temporary ఉద్యోగస్థులు Sub Registrar ఆఫీసులలోగాని, జిల్లా రిజిష్ట్రారు ఆఫీసులలోగాని 10, 15 సంవత్సరాలు service ఐనప్పటికీ temporary గానే వుండిపోతున్నారు. ఎంతమంది అవసరం వుంటారో వాళ్ళందరినీ ఖాయంచేసి మిగతావారిని temporary గా

Sri S. Vemayya] [24th September 1955

పెట్టుకోవాలని నేను మనవిచేస్తున్నాను. ఉద్యోగస్థుల విషయంలో నాకు సరియైన లెక్కలు దొరకలేదు. ఐనా budget లోవున్న లెక్కలనుబట్టి సేకరించాను. ఈ non-gazetted ఉద్యోగులలో చాలామంది ఈరోజువరకూ temporary గానే వుండిపోతున్నారు. ఈవిధానాన్ని ఇకమీదట ప్రభుత్వం మార్చుకోవాలని అవసరమైనవారినందరినీ ఖాయంచేయాలని మనవిచేస్తున్నాను. నాకుతెలిసినంతవఱకూ 1942 సంవత్సరంలో Public Service Commission పరీక్షకు కూర్చుని ఇప్పటికి 10, 12 సంవత్సరాలనుంచి ఉద్యోగంచేస్తున్నా వాళ్లు temporary గానే వున్నారని తెలుస్తోంది. ఇవన్నీ విచారణజరిపి వారందరినీ త్వరగా ఖాయపఱచే విధానాన్ని ప్రభుత్వం తీసుకోవాలని నేను మనవిచేస్తున్నాను. నాకు ప్రభుత్వంనుంచి ఎల్లాంటి అంకెలు దొరకకపోయినా Budget లో ఉన్న కొన్ని వివరాలు నేను ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. అవన్నీకూడా వారు consider చేసి ఈ temporary గా ఉన్న ఉద్యోగస్థులనందరినీ permanent చేయడానికి ప్రభుత్వం పూనుకోవాలని నేను మనవిచేస్తున్నాను. Collector ఆఫీసులు వగైరాలలో permanent వాళ్లు 399 మందివుంటే temporary వాళ్లు 289 మంది. Revenue Divisional offices లో 354గురు permanent వాళ్ళుంటే 258 temporary వాళ్ళున్నారు. Judicial Department లో 341 మంది permanent వాళ్లుంటే 62 గురు temporary వాళ్ళున్నారు. Administration of justice లో 904 గురు permanent వాళ్లయితే temporary వాళ్లు 219. అదేదానిలో ఇంక criminal side of judicial administration లో 799 permanent ఐతే 417 temporary వాళ్లున్నారు. Prohibition staff లో ఎంతమంది పెర్మనెంట్ ఎంతమంది టెంపరరీయో తెలియలేదుగాని మొత్తం 3076 మంది ఉన్నారు. అందరూకూడా temporary అనే నేను భావిస్తున్నాను. దాని విషయమై ప్రభుత్వంవారు తెలియజేస్తే బాగుంటుంది. ఏ పదకొండు, పన్నెండుమందో తప్ప మిగతా 3076 మందికూడా temporary ఉద్యోగస్థులనే తెలుస్తోంది. అట్లాగే Forest Department లో 1400 మంది ఉంటేవారిలో 900 వఱకూకూడా temporary వాళ్లున్నట్లుగా తెలుస్తోంది. Registration department లో 80 మంది, Motor Vehicles Department లో 140 మంది permanent ఐతే 125 temporary, Commercial Tax Department లో ఎంతమంది permanent, ఎంతమంది temporary తెలియలేదు. మొత్తం 1252 మంది ఉన్నారు. Local Administration Department లో 146 మంది permanent ఐతే 342 మంది temporary వాళ్లు. పోలీసు Department లో 15183 మంది ఉంటే 2284 మంది temporary వాళ్లున్నారు. అందులో constables 1835 మంది

temporary వాళ్లున్నారు. Armed police లో permanent గా ఉన్నటువంటి ఉద్యోగస్థులు పదకొండుమంది ఉన్నారు. వాళ్లు Gazetted officers. మిగతా 3109 మంది temporary అని ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలుస్తోంది. Teachers colleges లో 41 మంది permanent ఐతే 51 మంది temporary. Government secondary schools లో 42 మంది permanent ఐతే 152 టెంపరరీ. అదే girls secondary schools లో 75 గురు permanent ఐతే 87 మంది టెంపొరరీ. Medical Department లో Nurses వగైరా 1709 మంది, 1000 పైచిలుకు temporary వాళ్లున్నారు. ప్రభుత్వం ఈ సంవత్సరం కొంచెం మంచి విధానాన్ని అవలంబించివెయ్యిమందినిpermanent చేసినందుకు నేనుసంతోషిస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :— ఒక Department లో ఏ ఉద్యోగి ఐనా 5 సంవత్సరాలున్నప్పుడూ లేకుంటే ఒకఉద్యోగం 5 సంవత్సరాలుంటే అప్పుడు దాన్ని permanent చెయ్యడంజరుగుతుంది. తాత్కాలికంగా temporary expansion జరగవచ్చుగాని అవన్నీ permanent చెయ్యడానికి వీలులేదు. స్థూలంగా చూస్తే 5 సంవత్సరాలనే yard stick తో ఇవన్నీ కూడా పరిశీలన చేస్తున్నారు.

SRI S. VEMAYYA :—ముఖ్యమంత్రిగారు ఇచ్చినటువంటి హామీకి సంతోషం. Medical Department లోనే అన్నిటిలోనూ confirm చేస్తారని ఆశిస్తున్నాను.

1 p. m.

అదేవిధంగా అన్ని Department లలో కూడ 1942లో చేరిన వాండ్లు ఇప్పటివరకు ఖాయపరచకుండానే ఉన్నారు. ముఖ్యమంత్రిగారు దర్యాప్తుచేస్తారని మనవిచేస్తున్నాను. Jail department లోకూడ 124 Permanent అయితే 52 Temporary. అదేవిధంగా Agriculture department తీసుకొన్నప్పుడు 1900. ముఖ్యంగా Revenue department లోనే, ముఖ్యమంత్రిగారు విచారించవలసినదిగా ప్రార్థిస్తూఉన్నాను. Agricultural Department లో మరి ఎక్కువగ కొన్నివేల సంఖ్యలోఉన్నారు. 790 మంది, 366 మే స్త్రీలు. Demonstrator, Fieldmen అందరు Temporary గ ఉంటూ ఉన్నారు. దానిని పరిశీలన చేయవలెనని మనవిచేస్తున్నాను. Agricultural Engineering department లో permanent ఒకడులేడు. Permanent ఉద్యోగస్తులు అవసరం లేదని అట్లాగే temporary గ వుంచి ఖాయంచేసేందుకు ముందు వస్తుందా అని చెప్పి permanent వాండ్లు కనబడడంలేదు. 189 మంది temporary ఉద్యో

పెట్టుకోవాలని నేను మనవిచేస్తున్నాను. ఉద్యోగస్థుల విషయంలో నాకు సరియైన లెక్కలు దొరకలేదు. ఐతా budget లోవున్న లెక్కలనుబట్టి సేకరించాను. ఈ non-gazetted ఉద్యోగులలో చాలామంది ఈరోజువరకూ temporary గానే వుండిపోతున్నారు. ఈవిధానాన్ని ఇకమీదట ప్రభుత్వం మార్చుకోవాలని అవసర మైనవారినందరినీ ఖాయంచేయాలని మనవిచేస్తున్నాను. నాకు తెలిసినంతవఱకూ 1942 సంవత్సరంలో Public Service Commission పరీక్షకు కూర్చుని ఇప్పటికి 10, 12 సంవత్సరాలనుంచి ఉద్యోగంచేస్తున్నా వాళ్లు temporary గానే వున్నారని తెలుస్తోంది. ఇవన్నీ విచారణజరిపి వారందరినీ త్వరగా ఖాయపఱచే విధా నాన్ని ప్రభుత్వం తీసుకోవాలని నేను మనవిచేస్తున్నాను. నాకు ప్రభుత్వంనుంచి ఎల్లాంటి అంకెలు దొరకకపోయినా Budget లో ఉన్న కొన్ని వివరాలు నేను ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. అవన్నీకూడా వారు consider చేసి ఈ temporary గా ఉన్న ఉద్యోగస్థులనందరినీ permanent చేయడానికి ప్రభుత్వం పూనుకోవాలని నేను మనవిచేస్తున్నాను. Collector ఆఫీసులు వగైరాలలో permanent వాళ్లు 399 మందివుంటే temporary వాళ్లు 28J మంది. Revenue Divisional offices లో 354గురు permanent వాళ్ళుంటే 258 temporary వాళ్ళున్నారు. Judicial Department లో 341 మంది permanent వాళ్లుంటే 62 గురు temporary వాళ్ళున్నారు. Administration of justice లో 904 గురు permanent వాళ్లయితే temporary వాళ్లు 219. అదేదానిలో ఇంక criminal side of judicial administration లో 799 permanent ఐతే 417 temporary వాళ్లున్నారు. Prohibition staff లో ఎంతమంది పెర్మనెంట్ ఎంతమంది టెంపరరీయో తెలియలేదుగాని మొత్తం 3076 మంది ఉన్నారు. అందరూ కూడా temporary అనే నేను భావిస్తున్నాను. దాని విషయమై ప్రభుత్వంవారు తెలియజేస్తే బాగుంటుంది. ఏ పదకొండు, పన్నెండుమందో తప్ప మిగతా 3076 మందీకూడా temporary ఉద్యోగస్థులనే తెలుస్తోంది. అట్లాగే Forest Department లో 1400 మంది ఉంటేవారిలో 900 వఱకూకూడా temporary వాళ్లున్నట్లుగా తెలుస్తోంది. Registration department లో 80 మంది, Motor Vehicles Department లో 140 మంది permanent ఐతే 125 temporary, Commercial Tax Departmentలో ఎంతమంది permanent, ఎంతమంది temporary తెలియలేదు. మొత్తం 1252 మంది ఉన్నారు. Local Administration Department లో 146 మంది permanent ఐతే 342 మంది temporary వాళ్లు. పోలీసు Department లో 15183 మంది ఉంటే 2284 మంది temporary వాళ్లున్నారు. అందులో constables 1835 మంది

temporary వాళ్లున్నారు. Armed police లో permanent గా ఉన్నటువంటి ఉద్యోగస్థులు పదకొండువుంది ఉన్నారు. వాళ్లు Gazetted officers. మిగతా 3109 మంది temporary అని ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలుస్తోంది. Teachers colleges లో 41 మంది permanent ఐతే 51 మంది temporary. Government secondary schools లో 42 మంది permanent ఐతే 152 టెంపరరీ. అదే girls secondary schools లో 75 గురు permanent ఐతే 87 మంది టెంపొరరీ. Medical Department లో Nurses వగైరా 1709 మంది, 1000 పైచిలుకు temporary వాళ్లున్నారు. ప్రభుత్వం ఈ సంవత్సరం కొంచెం మంచి విధానాన్ని అవలంబించివెయ్యిమందినిpermanent చేసినందుకు నేనుసంతోషిస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :— ఒక Department లో ఏ ఉద్యోగి ఐనా 5 సంవత్సరాలున్నప్పుడూ లేకుంటే ఒకఉద్యోగం 5 సంవత్సరాలుంటే అప్పుడు దాన్ని permanent చెయ్యడంజరుగుతుంది. తాత్కాలికంగా temporary expansion జరగవచ్చుకాని అవన్నీ permanent చెయ్య. డానికి వీలులేదు. స్థూలంగా చూస్తే 5 సంవత్సరాలనే yard stick తో ఇవన్నీ కూడా పరిశీలన చేస్తున్నారు.

SRI S. VEMAYYA :—ముఖ్యమంత్రిగారు ఇచ్చినటువంటి హామీకి సంతోషం. Medical Department లోనే అన్నిటిలోనూ confirm చేస్తారని ఆశిస్తున్నాను.

1 p. m.

అదేవిధంగా అన్ని Department లలో కూడ 1942లో చేరిన వాండ్లు ఇప్పటివరకు ఖాయపరచకుండా నే ఉన్నారు. ముఖ్యమంత్రిగారు దర్యాప్తుచేస్తారని మనవిచేస్తున్నాను. Jail department లోకూడ 124 Permanent అయితే 52 Temporary. అదేవిధంగా Agriculture department తీసుకొన్నప్పుడు 1900. ముఖ్యంగా Revenue department లోనే, ముఖ్యమంత్రిగారు విచారించవలసినదిగా ప్రార్థిస్తూఉన్నాను. Agricultural Department లో మరి ఎక్కువగ కొన్నివేల సంఖ్యలోఉన్నారు. 790 మంది, 366 మే స్త్రీలు. Demonstrator, Fieldman అందరు Temporary గ ఉంటూ ఉన్నారు. దానిని పరిశీలన చేయవలెనని మనవిచేస్తున్నాను. Agricultural Engineering department లో permanent ఒకడులేడు. Permanent ఉద్యోగస్థులు అవసరం లేదని అట్లానే temporary గ వుంచి ఖాయంచేసేందుకు ముందు వస్తుందా అని చెప్పి permanent వాండ్లు కనబడడంలేదు. 189 మంది temporary ఉద్యో

గస్తులుగా ఉన్నారు. Tractors విషయం తీసుకొన్నపుడు Tractors drivers వగైరా వాటిని నడిపించేవాడు ఒకడైనా permanent వాడులేడు. 253 మంది ఉంటే అందరు temporary గానే ఉన్నారు. ఏరోజుఅయినా వాండ్లను తీసి వేయడం, మళ్ళీ ఉంచుకోవడంకూడా జరుగుతుంది. Veterinary Department లో చిన్నచిన్న ఉద్యోగులలోకూడ 99 మంది temporary గా ఉంటూ ఉన్నారు. permanent వాండ్లు నాకు ఎక్కడకూడ కనబడడంలేదు. Tungabhadra Project తీసుకొన్నప్పుడు అక్కడ అనేకమంది మన వాండ్లు ఈ Co-operative society లో 1177 మంది ఉంటే temporary, permanent అనేవిధానం కనబడడంలేదు. అనేకమంది వందలలోనే temporary గా ఉంటూఉన్నారు. ఇవి అన్నికూడ దృష్టిలో వుంచుకొని వాండ్లందరినికూడ ఎంత వరకు అవసరమో, వాండ్లందరిని ఖాయపరచేటట్లయితే వాండ్లకు security of service ఉంటుంది. ముఖ్యంగా పనిచేయడానికి వాండ్లకు ఆదుర్దావుండి సర్వీసుకు ఎంతో ఉపయోగపడుతారనిచెప్పి నేను మనవిచేస్తున్నాను. నావద్ద ప్రభుత్వానికి సంబంధించినటువంటి ఏలాంటి లెక్కలు ఉండకపోవచ్చును. నేనుచెప్పిన ఈ లెక్కలు అన్నికూడ బడ్జెటును ఆధారంచేసుకొని తీసుకొనివచ్చారు. ముఖ్యమంత్రి గారు ఇపుడు 5 సంవత్సరముల సర్వీసు ఉన్నట్లయితే అవి అన్నికూడ consider చేసి వాండ్లకు ఖాయంచేస్తామని హామీ ఇచ్చారు. అది సంతోషదాయకం. తప్పకుండా అన్నిశాఖలలోకూడ overhaul చేసి వెంటనే వాండ్లను permanent చేయడానికి పూనుకొంటారని మనవిచేస్తున్నాను. ఇంకొకవిషయం ఏమంటే, N. G.Os. కొంతమంది గురించి ఎక్కడలేని విషయాలు ప్రభుత్వదృష్టిలోకి తీసుకొనివచ్చాము. Second language ప్యాసుఅయితేగాని, Government ఉద్యోగంగాని మరొక promotion గాని లేకుండాపోవడం జరుగుతుంది. మనము Madras రాష్ట్రములో ఉన్నపుడు Tamil 2nd language గా అనేకమంది ప్యాసు అయ్యేవాండ్లు. ఇపుడుకూడ 2nd Language ప్యాసుకాని వాండ్లకు ప్రమోషను లేదన్న సమస్య అన్నిశాఖలలోఉన్నది. నేను గవర్నమెంటుకు రెండు మూడు సంవత్సరాలుగా ఉత్తరాలు వ్రాస్తున్నాను. తీర్మానాలుచేసి పంపిస్తున్నాను. Tamil కావలెనా, వద్దా, ఏ పద్ధతికివచ్చారో తెలుపలేదు. దరిమిలా ఎప్పుడైనా హిందీ వగైరాలు ప్యాసు అవవచ్చును. ఈ 2nd language pass కానందువల్ల ప్రమోషనుకు అడ్డుతగులకూడదని ప్రభుత్వం ఏదైనా ఉత్తరువులు చేసినట్లయితే బాగుంటుంది. ఇప్పుడైనాకూడ మనకు అవసరమైనభాషనే తీసుకొని పనిచేసినట్లయితే ప్రభుత్వాన్ని నడుపుకోడానికి వీలుఅవుతుంది. కాబట్టి 2nd language మానుకోవాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. Non-gazetted ఆఫీసరు పిల్లలకు

free education ఇస్తున్నామని చెప్తున్నారు. కాని practical గా చూస్తే ఏ III Form వరకే free education ఉంటుందన్నప్పుడు అక్కడ Higher Elementary School చూచుకొన్నప్పుడు అచట స్కూలు fees ఉండదు. అది పెద్ద లాభదాయకంగా కనబడడంలేదు. High school కు వెళ్లినప్పుడు fees కట్టడం అనేది వాండ్లకు తప్పని సరిగావస్తుంది కాబట్టి వాండ్లకు కనీసం School Final pass అయ్యేవరకు free education ఇప్పిస్తారని ప్రభుత్వాన్ని ఆశిస్తున్నాను. అదే విధంగా ఎక్కువ బిడ్డలున్నవారికి, ఈ రిపోర్టులలోకూడ సూచించారు Pay Commission దానిలో వాండ్లకు కొత్తఅదనంగా allowances ఇవ్వవలెనని చెప్పిఉంది. దానిని ప్రభుత్వం ఆలోచన చేయవలెనని కోరుతున్నాను. తరువాత Insurance provident fund ఈ వగైరాలన్నికూడ వారిసర్వీసు conditionలు అంతా బాగా ఉండేదానికి ప్రభుత్వం పూనుకోవాలని చెప్పి కోరుతూఉన్నాను. నాకు రోజు ఒక pensioner తటస్థించుతాడు. Retire అయ్యే సమయానికి pension రాదు. G. P. F. రాదు. A. G. కి వ్రాస్తే return అయింది అంటాడు. District ఆఫీసుకు వెళ్లితే వాడు అక్కడికిపోయింది అంటాడు. ఈ విధంగా ఈ pension ఉద్యోగి పరిస్థితులు అధ్వాన్నస్థితికి వస్తున్నాయి. అన్ని Department లలోకూడ pensioners ఈ విధంగా చాలఅవస్థలు పడుతూన్నారు. ఈ విషయాన్ని అతిశ్రద్ధతో ప్రభుత్వం పరిశీలనచేసి, తగుచర్య తీసుకొంటారు అని నేను కోరుతున్నాను. తరువాత ఈ N.G.O లు దురదృష్టవశాత్తు sudden గా చనిపోవడం జరుగుతుంది. అప్పుడు బిడ్డలు భార్య వగైరాలు ఉన్నప్పుడు, వారికి ఆసాకారం లేనపుడు వాండ్లబిడ్డలకు ఏదైనా సదుపాయం కలిగేదానికి ఏదైనా కొత్త allowance ఇవ్వడానికి పూనుకొంటే ఇది కొంత బాగాఉంటుంది. ప్రమోషన్ విషయంలో ముఖ్యంగా merit అనిచెప్పి ఒకటి తీసుకొంటూ వున్నారు. కేంద్రప్రభుత్వంలో రిపోర్టులు చూచినట్లయితే ముఖ్యంగా ఎన్నివిధములు అయిన merit ఉన్నాకూడ merit చూడమన్నారు. కాని soniority మాత్రం, ముఖ్యంగా సర్వీసు ఎంతవరకు ఉందిఅనే ప్రధానంగా దృష్టిలోపెట్టుకొని ప్రమోషన్ చేయవలెనని సూచనలు ఉన్నాయి. అనేకచోట్ల అందుకని, ముఖ్యంగా merit అనేది కాకుండా seniority ని తీసుకొని వాండ్లకు ప్రమోషన్ ఇవ్వడం ఎంతైనా సమంజసం. అదికాకుండా ప్రస్తుతం జరుగుతూఉండే ప్రమోషనులు ఏవిధంగా జరుగుతున్నాయి, అని తీసుకొన్నప్పుడు, బ్రిటిషువాండ్లు confidential files పెట్టిపోయ్యారు. భారత దేశీయులంతా వాండ్లను మోసము చేస్తారని చెప్పేసి, వాండ్లు మనలను పదేపదే, మనకు తెలియకుండా మనలను watch చేసు

కోసేదానికోసం ఈ confidential files దాచిపెట్టడం జరిగింది. ఎప్పుడో వాండ్లుపెట్టిన confidential files ను ఆధారం చేసుకొని ప్రమోషనులు చేయడం సమంజసం కాదు. కొన్నిచోట్ల, విదేశాలలో, confidential files తీసివేసి open files పెట్టడం ఉంది. తప్పుచేస్తే దాంట్లో వ్రాస్తారు. తప్పులుచేస్తే incerment ఆపివేయండి, punishment ఇవ్వండి. తనకు ఇష్టంలేని ఉద్యోగి సప్లయిచేయలేదని తనకు యిష్టమువచ్చినట్లు, whims and fancies తో ఏదో ఒకటి వ్రాసేస్తే దానిని ఆధారం చేసుకొంటే, అనేకమంది పాడైపోతున్నారు. అందువల్ల confidential files మీద ఆధారపడి ప్రమోషనులు ఇచ్చే విధానము ప్రభుత్వం పూనుకొంటే చాలమంచిది. దానిని వెంటనే ప్రభుత్వం ఆలోచించవలెనని కోరుతున్నాను. Dancing చేసేవాండ్లు camp లకు పోయినపుడు కావలసిన సప్లయిలు చేయడం, ముందుగా taxi తీసుకొని, రయిలుస్టేషన్‌కు వెళ్లి ఆఫీసరును దించుకొని రావడం, ఈ విధంగా సప్లయిలుచేయడం జరుగుతున్నవి. కాని వాడు తనపని సరిగా చూస్తున్నాడా అది చూడకుండా, వాడు బాగా సప్లయిచేస్తాడు, (excellent) he deserves promotion అని వ్రాయడం, సుక్కునూటిగా పోయినవానికి he is unfit for promotion అని వ్రాయడం జరుగుతోంది. ఇది వారుచేసే విధానం. Confidential files పోలీసువాండ్లకు arrest చేయడానికి ఎలా సెక్షనుఉందో అలాగు gazetted ఆఫీసర్లకు, పెద్దపెద్ద ఉద్యోగస్థులకు ఇది ఒకఆయుధంగా తయారైంది. దీనినిమార్చి మంచిపద్ధతి తీసుకొనిరావలెనని మనవి చేస్తున్నాను.

తరువాత ఈ ఉద్యోగస్థులకు మనం జీతం తక్కువగా ఇస్తున్నాము. వారు ఈ తక్కువగా జీతాలతో, పటిష్టంగా ఆరోగ్యంగా మంచి ఆహారముతిని సరిగా పనిచేయలేకుండా పోతున్నారు. పోని ఏదైనా జబ్బుపడినప్పుడు వారు మందులు తీసుకొనడానికి ప్రభుత్వం ఏదైనా సదుపాయాలు చేస్తుందా అంటే Non-Gazetted officers కు medical relief అని ఒక ఉత్తరువేదో pass చేసినారు. అందుకు సంతోషమే కాని practical గా ఏమి జరుగడంలేదు. ఎక్కడైనా hospital కు పోతే, ఆ hospital లో ఈ మందు లేదంటారు. పోనీ చీటి వ్రాసిస్తే బజారులో కొంటామంటే, డాక్టరు అది ఇవ్వడు. కనుక, డాక్టర్లకు ఈ విషయంలో ఏదైనా confidential instructions ఏమైనా పంపారా అని ప్రభుత్వంవారిని అడుగుతున్నాను. ఇప్పుడు M.B.B.S. పాస్ అయినవారికి ఎంతమందికో పట్టాలు ఇస్తున్నారు. కాని అటువంటి డాక్టర్లకు ఎవరిదగ్గరనైనా పోయి మందు తీసుకొని certificate తీసుకోడానికి వీలులేకుండా ఉంది. ప్రభుత్వ డాక్టర్లదగ్గరకే

పోవాలి, గవర్నమెంట్ ఆస్పత్రిలోనే ఉండాలి. ఆ ఆస్పత్రిలో ఇచ్చినమందులే తీసుకోవాలి అంటె అది ఎంతమాత్రము సాధ్యపడడం లేదని మనవిచేస్తున్నాను. Hospital లో వాళ్ళకు కావలసినమందులు ఇవ్వడంలేదు. Typhoid జ్వరం వచ్చిందనుకోండి. దానికి ఇప్పుడు ప్రత్యేకంగా క్లోరోమైజిటిన్ అనేమందు వచ్చింది. అది ప్రభుత్వంవాళ్లు చెప్పరు, లేదా చీటివ్రాసివ్వండి అంటెకూడ అది ఇవ్వరు. దాన్ని వాళ్లు స్వంతంగా తెచ్చుకోవలసియుంటుంది కాని కేంద్రప్రభుత్వపు ఉద్యోగస్థుల విషయం చూడండి. వారికి బిల్లులు వస్తాయి అన్నివస్తాయి. వారు మందులు ఎన్నికొనినప్పటికి, కేంద్ర ప్రభుత్వము డబ్బు ఇస్తుంది. కాని రాష్ట్ర ప్రభుత్వం విషయంలో non-Gazetted officers కు ఇస్తున్నామని చెప్పేటటువంటి ఈ medical relief నామమాత్రంగానే ఉన్నది గాని ఎంతమాత్రం అది లాభదాయకంగా లేదు. అతడుగాని, అతని భార్యగాని, అతనిబంధువులుగాని ఎవరైనాసరే జబ్బుపడినప్పుడు, వారికి సరియైన medical relief లేకుండావున్నది. నాకు తెలిసిన ఒక విషయం చెప్పుతాను. ఒక N.G.O, భార్యకు T.B. వచ్చింది. ఆమెను T.B. Hospital admit చేయాలంటే ఒక serial order పెట్టారు. Application ముందు రావాలి అంటే ఈ application పెట్టి turn వచ్చేలోపల, ఆ T.B. patient చచ్చిపోవడం జరుగుతుంది. కనుక ఇటువంటి అవసరమైన కేసులలోకూడా N.G.O. లను ఏలాంటి preference ఇవ్వడమనేది practical గా కన్పడడంలేదు. ప్రభుత్వము ఏదో N.G.O. లకు ఏదో medical relief కలుగజేశామని అంటున్నారేగాని అవివాళ్లకు practical గా ఎంతమాత్రం లాభదాయకంగా లేదు అందువల్ల ఈ N.G.O. లు ఏ Regd. Medical practitioner దగ్గరనుండి అయినాసరే Medical Bill దాఖలుచేసినట్లయితే, ఆ డబ్బు ప్రభుత్వము ఇచ్చేందుకు ప్రయత్నంచేయాలి, లేదా గవర్నమెంటు డాక్టరే ఈ non-Gazetted ఉద్యోగస్థులకు ఏది refuse చేయకుండా ఉండాలి, లేదా మందులు కొనేందుకు, బిల్లులు, certificates అయినా ఇవ్వాలి. ప్రభుత్వము ఆ విధంగా వాళ్లను ఆదేశించాలని కోరుతున్నాను. అటువంటి ఆదేశము ప్రభుత్వము ఎప్పుడైతే పంపుతుందో, అప్పుడు, ప్రభుత్వ డాక్టర్లు వీళ్లకు మందులుసరిగా ఇస్తారని నమ్ముచున్నాను.

తరువాత leave rules విషయం తీసుకొందాము. నేను 1952 సంవత్సరం నుంచీకూడ పదేపదే ఈ విషయాన్ని ప్రభుత్వదృష్టికి తీసుకొనివస్తున్నాను. 1931 లో Fundamental leave rules వగైరా చేశాము. ఇప్పుడు 1931 సంవత్సరము లోపల Government service లో చేరినవారికి ఒక rules, 1931 కి తరువాత

సర్వీసులో చేరినవారికి మరొక rules ఉంటున్నవి. ఇప్పటి rules ప్రకారం ఒక సంవత్సరానికి ఒక నెల సెలవు earn చేస్తూ ఆ విధంగా మూడు మాసాలకంటె ఎక్కువ accumulation ఉండడానికి వీలులేదు.

THE HON. SRI B. GOPALA REDDI:—ఇప్పుడు దాన్ని నాలుగు మాసాలు చేసినాము.

SRI S. VEMAYYA :—ఈ మధ్యనే 4 మాసాలవరకు accumulate చేసుకోవచ్చు అని ఉత్తరవు చేశామని చెప్పుతున్నారు. అంతకుముందు మూడు మాసాలవరకే ఉండినది. మూడు మాసాలకుపైన accumulate అయ్యే లీవు అంతా కుళ్లిపోతుండడం జరిగేది. ఇప్పుడు దాన్ని 4 మాసాలు చేసినందుకు సంతోషమే. కాని 1931 సంవత్సరమునుంచి ఉన్న ఉద్యోగులకు ఒకవిధమైన rules, దరిమిలా చేరినవారికి ఇంకో rules అనుసరించడం సమంజసంగా కనబడదు. కనుక, వాళ్లకు అన్వయింపచేసేరూల్సు ఈకొత్తవాళ్లకుకూడ అన్వయింపచేస్తే బాగుంటుంది. ఇప్పుడు ఈ 4 మాసాలు చాలాతక్కువ. బాగా జాగ్రత్తగా పనిచేసేవారికి, కాస్త leave ఉంచుకోడానికి సదుపాయము ఉండాలి. ఈ 4 మాసాలను, 6 మాసాలు చేసినా ఇంక కొంచెము సహాయంగా ఉంటుంది. ఈ కాస్త ఆదరణ అయినా ప్రభుత్వం వారు చూపితే బాగుంటుంది. కాని వీలైతే 1931 సంవత్సరపు Fundamental Leave Rules, తరువాత చేరిన Non-Gazetted officersకు కూడ apply చేస్తే, వాళ్లు ఎంతో ఆసక్తి చూపించి ప్రభుత్వంలో మన administration బాగు పడడానికి ఉత్సాహంతో పనిచేయటానికి వీలవుతుందని నమ్ముతున్నాను. కనుక ముఖ్యమంత్రిగారు దీన్ని ఆలోచించి ఇది ఎంతవరకు ప్రభుత్వానికి నష్టదాయకము, ఏ ఇబ్బంది ఉన్నదో చూచి, వీలైనంతమటుకు ఈ సహాయంవారికి చేయవలెనని కోరుతున్నాను. మనము వారికి జీతాలు పెంచలేక పోయినా, కనీసంవాళ్లకు ఈ లీవు కూడ బెట్టుకొనే టటువంటి సహాయంచేసి, వాళ్లు జబ్బుపడినప్పుడుగాని మరేదైనా అవసరంవచ్చినప్పుడుగాని, లీవు తీసుకోనేందుకు అనుకూలంగా ఉండేటట్లు చేయవలెనని కోరుతున్నాను. ఇవన్నీ ప్రభుత్వం ఆలోచించి, Fundamental Rules ను ముందు ఉన్నటువంటి ఉద్యోగస్థులకువలెనే, ప్రస్తుతం ఉన్నటువంటి ఉద్యోగస్థులకుకూడా అమలుపరచడానికి ప్రయత్నం చేయవలసిందని మనవి చేస్తున్నాను.

ఇంక, ఆఫీసుల విషయం తీసుకొన్నపుడు, అక్కడ పని సరిగా జరగడంలేదు. నేను కనీసం 4 వందలు, 5 వందలు ఉత్తరాలైన వ్రాసివుంటాను. నేను M. L. A. గా ఏదైనా public interest లో, Government level లో

వ్రాసేటప్పుడు, అటువంటివాటికి service stamps ఇవ్వాలని నేను పదేపదే amendments పెట్టాను. ఆ service stamps అయినా ఇవ్వడానికి ప్రభుత్వం ఒప్పుకోలేదు. కాని మాచేతినుండి పెట్టుకొని వ్రాసినామంటె దానికి acknowledgment కూడ రాదు, జవాబురాదు. Acknowledgments అయినా వస్తే, తరువాత జవాబువచ్చేదానికైనా వీలుంటుంది, కాని acknowledgments కూడ రావడంలేదు. అయితే, మన మంత్రులు ఒక విధానాన్ని అవలంబిస్తున్నారు. మీరు వ్రాసిన అర్జీ ముట్టినది అని ఒక కార్డు పంపుతారు. కాని దానికి ఒక ఆఫీసు నంబరుతప్ప మరేమి ఉండదు దానివిషయమై మరల మేము వ్రాస్తే మొదట వ్రాసింది పత్తాదొరకదు. ఏమైందని అడిగితే ఇక్కడ అగపడలేదే అంటారు. ఏదైనా L Dis లో, N Dis లోనో, X N Dis లోనో వేసుంటారు. ఎక్కడా దొరకదు. బహుశా తాలూకా ఆఫీసులో వుండే ఉంటుంది. కలెక్టరు ఆఫీసు అది తిరిగి అక్కడికి ఏ ఆరుమాసాలకో వస్తుంది. అప్పుడు అదృష్టవశాత్తు ఆ గుమాస్తా గనుక దానిని బయటికిపెడితే వస్తుంది లేకుంటే లేదు. అది అట్లే ఉండిపోతుంది. ఇదంతా staff చాలకపోవడంవల్లనే అనేది ప్రభుత్వదృష్టికి తీసుకొనివస్తున్నాను. పూర్వముకన్నా ఇప్పుడు పని ఎక్కువ అవుతూంది. ఉదాహరణకు ఒకతాలూకాఫీసు తీసుకొనిచూడండి, ముందు ఎన్ని references వస్తూ వుండినాయో, ఇప్పుడు ఎన్ని వస్తున్నాయో, ఇప్పుడు ఆఫీసులలో గుమాస్తాలు చేసేపని ఎంత అదనంగా ఉన్నదోని మనవి చేస్తున్నాను. ప్రభుత్వము వారివల్ల ఎక్కువ పని చేయిస్తున్నదని చెప్పవలసివస్తుంది. వాళ్లు ఎక్కువగా పనిచేసినందువల్ల వారికి ప్రభుత్వము ఏవిధంగాను compensation ఇవ్వడంలేదు. కాని అదే private concerns లో Industries మొదలగువాటిలో చూడండి, ఏ కంపెనిలో కూడ overwork చేయకూడదు అంటారు. ఆదివారము కంపెనీ work చేస్తే మీకు జుల్మానావేస్తామని అంటారు. గవర్నమెంటు ఆఫీసులకుమటుకు అది apply చేయకుండా ఉన్నారు. ఆఫీసుకు 11 గంటలకు రావాలని 5 గంటలకు పోవాలని District Office Manual లో ఉన్నది. కాని practical గా తెల్లవారిజామున లేచి ఏ 7 గంటలకోవచ్చి ఆఫీసులు తలుపులు తెరచి పనిచేస్తూ ఉంటారు. తరువాత రాత్రులు 9, 10 గంటలకుగాని ఇంటికిపోకుండా ఉంటారు. ఇది నా అనుభవములోనే చూచాను. గజపతి నాయుడు అనే తాశీల్దారు ఉండేవాడు. ఆయన రాత్రి 12 గంటలకుగాని ఆఫీసువదలడు. అట్లా అనేకమంది ఉన్నారు. ఈరోజుకూ ఉన్నారు. Gazetted officers 5, 5½ గంటలకు వచ్చిఆఫీసులలో కూర్చొంటారు. పని extract చేయవలెనని. ఆవిధంగా ఆఫీసరువచ్చి కూర్చుంటే వీళ్లు

ఎట్లాపోతారు? నేను ఆఫీసులో ఉంటే నీవు బయటికిపోతున్నావా అని కోపబడతారని ఆ విధంగానే రాత్రి 10, 11 గంటలవరకు ఉండి, బాధపడవలసియుంటుంది. ఒక్కొక్కసారి ఉదయం 7 గంటలకు ఆఫీసుకువస్తే దురదృష్టవశాత్తు ఆఫీసరు 11 గంటలకే ఆఫీసుకువచ్చి కూర్చున్నాడంటే, ఆ మధ్యాహ్నం భోజనానికి ఇంటికిపోయేదానికి వీలులేకుండా కాఫీనో, టీనో తాగి, రాత్రి 9 గంటలకు ఆఫీసరు పోయిన తరువాత, ఇంటికిపోయి భోజనం చేస్తాడు. అది నేను practical గా నా అనుభవములో చూచినటువంటిది. ఆవిధంగా నేనుకూడ అనుభవించాను కొంతకాలము. కాబట్టి staff చాలా తక్కువగా ఉన్నందువల్ల, ఉన్నవారికి పని ఎంతో అదనంగా ఉంటున్నది. మనకమిటీకూడ రిపోర్టు ఇచ్చింది. అందులో, ప్రభుత్వం ఎక్కువగా పనిచేయించుకొని తక్కువ జీతాలు ఇవ్వడం న్యాయంకాదు అని చెప్పారు. కనుక మీరు తక్కువ జీతాలు ఇస్తూన్నప్పుడు ఎక్కువపని చేయించుకొంటున్నారు. కాబట్టి, జీతాలు పెంచమని నేను కోరుతున్నాను. పోనీ ఆఫీసులు 11 గంటలకు తెరిపించి, 5 గంటలకు సరిగ్గా మూయించండి. అదీచేయరు. ఎప్పుడైనా అవసరమైనప్పుడు overwork చేయవచ్చుగాని అన్నిరోజులు ఆవిధంగా చేయాలంటే చాలా బాధపడుతారు. కనుక ఈ over work ను తొలగించడానికి, ఏయే ఆఫీసులలో ఎంత అదనంగా పనిచేస్తున్నారు, ఎంత ఎక్కువ staff కావలసియుంటుంది. ఈ statistics అంతా తీసుకొని, దానికితగినట్లు additional staff ను వేసి limited work ఉండేటట్లు ప్రభుత్వం చేయవలెనని మనవి చేస్తున్నాను.

తరువాత gazetted officers N. G. O. లంటే చాలా నిర్లక్ష్యభావం చూపుతున్నారు. ఆయన గుమాస్తాను తన బంగాళాకు రమ్మంటే ఆ గుమాస్తా file తీసుకొని ఉదయం 6 గంటలకే పోయి బంగాళాబయట కాచుకొని కూర్చుని వుంటాడు. 12 గంటలకైనా అక్కడే కాచుకొని ఉండవలసి వస్తుంది. ఒకప్రక్క ఆఫీసుకు రాలేదంటాడేమోనని భయపడుతూ ఉంటాడు. ఇక్కడ ఎంతసేపైనా పిలవడు. ఈ విధంగా వారిమీద అంత నిర్లక్ష్యభావన చూపుతూ ఉంటారు.

కాబట్టి యీ N. G. Os. లు, బంట్రోతులు ఆ ఆఫీసరుగారి బంగళావద్ద వుదయంనుంచి సాయంత్రమువరకు, ఆయన పిలచేవరకు తిప్పలు పడుతూ కాచుకుని వుండవలసిన దురవస్థపడటము జరుగుచున్నది.

SRI L. LAKSHMANA DAS :—ఈ తీర్మానములో N. G. O. ల యొక్క జీతాలు పెంచటము వారికి యిళ్లవసతులు గురించివున్నది. సభ్యులు ఆ విష

యాలనుగురించి చెప్పకుండా యింకా ఏదో వారికి యితర సౌకర్యాలు అసౌకర్యాలను గురించి చెబుతున్నారు. ఆ విధంగా కాకుండా యీ తీర్మానములోని subject కు confine అయి చెప్పితే బాగుంటుందని నా అభిప్రాయము.

SRI S. VEMAYYA :—లక్ష్మణదాసుగారు పాతమెంబరు. వారు ఈ ఎసెంబ్లీకి కొత్తమెంబరు కాదు. నేను N. G. Oల జీతాలకు సంబంధించే మాట్లాడు తున్నాను. వారికి అవసరంగా పనియిచ్చినప్పుడు జీతాలుకూడా అవసరంగా యివ్వ వలెనని నా అభిప్రాయము. ఎక్కువపని చేయించుకుని తక్కువ జీతాలు యివ్వడ మనేది ఎంతటి న్యాయమో మంత్రిగారు గుర్తించాలి. వారికి జీతాలు పెంచే విషయము దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంత త్వరలో పెంచుతారని ఆశిస్తున్నాను.

తరువాత వారికి యిళ్లవసతులను గురించి చూడండి. చిన్న చిన్న పంచాయితీ గ్రామాలలోను, మేజరు, మైనరు పంచాయితీ గ్రామాలలోనూ, యిళ్లవసతి దొరకక యిబ్బందిపడుచున్నారు. ఇప్పుడు రెంటుకంట్రోలు యాక్టు వున్నప్పటికిని వీరికి యిళ్లవసతి దొరకని పరిస్థితులుకూడావున్నవి. ఈనాడు హైస్కూల్సుగూడా ఏర్పడ్డాయి. అక్కడవుండే teachers కు సరియైన యిళ్లవసతి లేక ప్రక్క గ్రామాలనుంచికూడా వస్తున్నారు. ఇళ్లుఖాళీగా వుంచుకున్నప్పటికినీగూడా యిళ్లు యివ్వరు. ఇట్లావుంటే, వారు duty ఏ విధంగా చేస్తారు ? పట్టణములలోవుండే N. G. Oలకు H. R. A. యిస్తున్నారు. ఈ మేజరు పంచాయితీ గ్రామాలలో వున్నవారికి యిస్తున్నారు. కాని District Board వగైరా టీచర్లకు యివ్వడము లేదు. ఇవ్వకపోవడము సమంజసముగాలేదు. అందువల్ల, కొందరికియిచ్చి, కొందరికి యివ్వక, యీ విధంగా వ్యత్యాసాలు వుండకుండా, టీచర్లుకూడా N. G. Oలే కాబట్టి మేజరని, మైనరని, పంచాయితీగ్రామాలలో వుండేవారికిగూడ విచక్షణ అనేదిలేకుండా అందరికి వచ్చేటట్టుగా చూడాల్సివున్నది. ఈ జీతాలుయిచ్చే విషయములో, యిప్పుడు యీ teachers మూడు categories లో వుంటున్నారు. teachers అని, professors అని, lecturers అని, వివిధ categories లో వుంటున్నారు, వీరు ఏ M. A. నో, M. A. L. T. గానూ చదివి ప్యాసు అయి వస్తూన్నప్పుడు, వారు ఎంతకష్టపడిచదివి ఉత్తీర్ణులైనారో, గ్రహించాలి. చదువు చూస్తే పెద్దది. చివరకు జీతముచూస్తే కొద్దిది. జీతాలు తృప్తికరంగా యిస్తేనే వారి పిల్లలకు తృప్తికరంగా చదువు చెబుతారు. ఒకవైపున యింట్లో జీతము ఖర్చులకు చాలకుండా మలమల మాడుతూవుంటే, విద్యతృప్తికరంగా చెప్పమని అంటే, యిది సాధ్యపడుతుందా ? వారికి జీతాలు తృప్తికరంగాయిచ్చి, తరవాత విద్యచెప్పే విషయములో ప్రశ్నవేస్తే, సమంజసముగా వుంటుంది.

వారికి జీతాలు చాలనందువల్లగదా, వారు యితర రాష్ట్రాలలో ఎక్కువ జీతాలు లభించుచుంటే అక్కడికి వెళ్లుచున్నారు? Professors గా వుండికూడా తక్కువజీతాలు తీసుకుంటున్నారు. గవర్నమెంటు కాలేజికానివ్వండి, ప్రైవేటు కాలేజీ కానివ్వండి, Professor అనే వుద్యోగికి, అంతటాగూడా ఒకేరకమైన జీతము యివ్వాలి అంటాను.

ఇక డాక్టర్ల విషయము చూడండి. వారికియిచ్చే జీతాలు ఎంతయిస్తున్నారు? అయిదు సంవత్సరాలు కష్టపడి M. B. B. S. వరకు చదువుకొని ప్యాసయినప్తే చివరకు జీతముచూస్తే చాలా కొద్ది. గవర్నమెంటువారు యిచ్చే యీ కొద్ది జీతమువారికి చాలకపోవుటముచేత, వారు అనేకచోట్ల private dispensaries పెట్టుకొని నెలకు ఏ నాలుగునందలో, యింకొచూస్తే, వెయ్యిరూపాయలవరకూ సంపాదించుకుంటున్నారు. వేలకొద్ది సంపాదించుకునే డాక్టర్లు ఎంతోమంది ఉంటున్నారు. అందుకనే మనకు రాష్ట్రములో కావలసినంతమంది సమర్థులైన డాక్టర్లు వుండడములేదు. గవర్నమెంటు సర్వీసుకు వెళ్లితే జీతాలు తక్కువఅనే వుద్దేశ్యముతోనే, వారు యితరరాష్ట్రాలకు పోతున్నారు. ఆ విధంగా వెళ్లినవారు ఎంతమంది వుంటున్నారో లెక్కతీయించండి. వారికి మన రాష్ట్రములో తృప్తికరంగా జీతముయిస్తే, యిల్లు వాకిలి విడిచిపెట్టుకొని దూరదేశాలకు వెళ్ళరని నాగట్టినమ్మకము. జీతాలు చాలనందువల్లనే యిప్పుడు హాస్పిటల్సులో పనిచేసే డాక్టర్లుకూడా చాటున మాటున అక్కడ హాస్పిటల్సులోవుండే మందులు యింటికి తెచ్చుకుని ప్రైవేటు parctice లో ఉపయోగించుకుంటున్నారు. వారు ఆ విధంగా చేయడమువల్ల హాస్పిటల్‌లో మందులులేక patients కు యిబ్బంది కలుగుతున్నది. వీటన్నిటికి కారణము వారికి తగుమైన జీతాలు లేకపోవడమేనని గుర్తించాలి. తృప్తికరంగా జీతాలుయిస్తే, యిక్కడ మనకు డాక్టర్లకు కొదువ వుండదని నా గట్టినమ్మకము. కాబట్టి వీరికి జీతాలు పెంచితీరాలని మంత్రిగారిని కోరుతున్నాను. జీతాలు పెంపువిషయములో తగు శ్రద్ధవహిస్తారని ఆశిస్తున్నాను. అదేవిధంగా Magesterial side తీసుకుండి. Judicial department గాని, excutive department గాని తీసుకోండి. వీరికియిచ్చే జీతాలు ఎంత? వీరు చేసే పనియేమిటి? ఇదంతా ప్రభుత్వమువారు గుర్తించారా? వీరు corruption కు tempt కానంత జీతముయిస్తేగదా, న్యాయముగా వీరు వీరి విధులను నెరవేర్చగలరు న్యాయము పాలించేవారు న్యాయముగా తీర్పుచెప్పాలి. అంటే, they must be above temptation అని ప్రభుత్వము గుర్తించాలి. వారికి యిచ్చిన responsibility కు proportionate గా జీతముగూడా పెంచాలంటాను.

జీతాలు తృప్తికరంగా యివ్వక పోవడమువల్ల, న్యాయము జరగకుండా వుత్తరువులు వేస్తారని ప్రజలకు భయాందోళనగా వుంటున్నది. ప్రభుత్వము ఈ విషయము ముఖ్యంగా గుర్తించి వీరి జీతములు పెంచాలని కోరుతున్నాను. ఆ విధంగా చేయక పోతే యీ Magistrate వుద్యోగాలకు రారు. అరుదు అవుతారు. వారు ప్లీడరుగా వుంటేనే independence, unlimited income సంపాదించుకో గలము అనేది వారికి తెలియకపోలేదు. ప్రభుత్వానికికూడా తెలుసును. ప్రతి చోటను, ప్రతి డిపార్టుమెంటులోను, ఎక్కడ చూచినా corruption వుందని అంటే, దీనికి కారణము జీతాలు చాలకపోవడమే. ముఖ్యంగా Magistrates ను మాత్రం above temptationగా వుంచాలి. లేకపోతే corruption కు లోబడటానికి ఆస్కారము ప్రభుత్వమువారే యిచ్చినట్లవుతుంది. లోపాయకారిగా విచారించండి. ఇదివరకు Magistrates గా వున్న వారు corruption కు లోబడ్డారో లేదో information తెప్పించండి. వసంతులు ఏ విధంగా వున్నవో చూడండి. ముఖ్యంగా మంత్రిగారు యీ department విషయము శ్రద్ధ తీసుకుంటారని, వారి జీతాలు above temptation గా పెంచుతారని ఆశిస్తున్నాను. ముఖ్యంగా judicial శాఖలో వారి ఉద్యోగాలకు తగినట్లుగా వారికి జీతాలులేవు. న్యాయము బొత్తుగా జరుగుతున్నట్లు కనబడదు. ప్రజలు కూడా అపోహాలు పడటానికి ఆస్కారము యివ్వకూడదు. ముఖ్యంగా Judicial Magistrates జీతాలు వెంటనే పెంచాలని మంత్రిగారు యీ విషయములో తను శ్రద్ధ వహిస్తారని ఆశిస్తున్నాను.

తరువాత డిపార్టుమెంట్సులో, అన్నిశాఖలలోనూ N. G. O. లకు promotion యిచ్చే విధానములో వారు special tests ప్యాసుకావాలని ప్రభుత్వం ఉద్దేశించింది. ఈ lepartmental tests, special testsకు పుస్తకాలు వుండాలి. ఇదివరకు యివి ఎప్పుడో prescribe అయి, ప్రింటు అయివున్నవి. పుస్తకాలు కావాలంటే ప్రభుత్వమువారు supply చేయరు. ఎవరివద్ద వున్నవి అంటే, వాళ్లు యివ్వరు. ఇతరులు యివ్వక, ప్రభుత్వము supply చేయకపోతే ఇక వీరు tests ప్యాసుచేసేది ఎట్లా? Market లో పుస్తకాలు దొరకటములేదని చెబుతున్నారు. ఫలానా ఫలానా పుస్తకాలు prescribe చేయబడ్డవి అని మన ముఖ్యమంత్రిగారు సెలవిస్తున్నారు. అసలు ఆ పుస్తకాలు దొరికితేగదా, చదివి ప్యాసుఅయి, ప్రమోషను సంపాదించుకునేది? పుస్తకాలు దొరకటమే చాలా కష్టముగావుంది.

Sri P. SUNDARAYYA :—వేమయ్యగారు చెప్పేది, తీర్మానానికి మాట్లాడేదానికి సంబంధములేదని point of order raise చేశారు. కేంద్ర

ప్రభుత్వము Central Pay Commission అని ఒక కమిటీవేసి యిప్పటికి పది సంవత్సరాలు అయింది. వారు రిపోర్టును పంపారు. అందులోవుండే సిఫారుస్సులు ఏమిటో చదువుకుంటే తెలుస్తుంది. N. G. O. ల జీతాలేకాదు, వారి conditions of service, యిళ్ళవసతి, బిడ్డలకు చదువు, service అంటె టెంపొరరీ, పర్మనెంటు, వగైరాలు అనేక విషయాలు వ్రాశారు. అంతేగానివారి జీతాల విషయములో యివిగూడా ఒకభాగము. ఈ విషయాలు గౌరవసభ్యులకు తెలియక పోతే ఆ రిపోర్టులో ఏఏ సంగతులను గురించి వ్రాశారో చదువుకుంటే తెలుస్తుంది. అంతేకాని గౌరవసభ్యుడు మాట్లాడుతూంటే, మధ్య మధ్యలేచి point of order Sir, అని అభ్యంతరాలు కలుగజేయడము మంచిదికాదు. అటువంటి అభ్యంతరాలు పెట్టకుండా చెయ్యాలని కోరుతున్నాను.

SRI S. VEMAYYA :—డిపార్టుమెంటల్ టెస్టులు ప్యాసుకావటానికి B. S. O. లు కావాలి. ఇవి print అయి ఎన్నో సంవత్సరాలు అయినది. Correction slips చూస్తే పుస్తకము నిండా అవే. B. S. O. ఎక్కడైనా ఒకటి దొరికితే, అది uptodate గా వుండదు. ఈ slips అన్నీ శ్రద్ధతీసుకొని ఎవరు అంటిస్తారు ? శ్రద్ధవున్నవారు ఎవరో ఒకరు వుంటారు. ఆయన ఆ బుక్కు యివ్వరు. ఈ correction slips అన్నీకట్టలు కట్టలుగావుంటే, యిందులో ఏ ఆర్డరుకు ఏ slip వుండాలో పరిశీలించవలసివుంది. ఇదంతా చేయడము చాలాకష్టము. ముందు యీ B.S.O. ను uptodate గా print చేయించాలి అని అంటున్నాను.

An hon. MEMBER :-On a point of order, Sir. Central Pay Commission చేసిన తీర్మానాలు pay scales కు సంబంధించి మాట్లాడుతారని యీ తీర్మానము కనబడుతున్నది కాని, ఇప్పుడు సభ్యులు మాట్లాడేది, తీర్మానానికి సంబంధించినట్లు ధ్వనించడము లేదు. కాబట్టి వారు మాట్లాడేది irrelevant అని అంటున్నాను. ఈ విషయములో మీరు తీర్పుయివ్వాలని కోరుతున్నాను.

MR. CHAIRMAN :—It is not a point of order. It is not irrelevant.

SRI S. VEMAYYA :— N.G.O. లు ఎక్కువ జీతాలు, ప్రమోషను సంపాదించుకోవాలంటే tests pass కావాలి. Tests pass కావాలంటే పుస్తకాలు వుండాలి. పుస్తకాలుచూస్తే, అవి దొరకవు. ఇట్టి స్థితిలో యిక వీరు ప్యాసు అయ్యేది ఎప్పుడు ? వారికి ప్రమోషను దొరికి పెద్దజీతము అయ్యేది ఎప్పుడు ? ఇవి అన్నీ జరిగేటప్పటికి వీరికి సర్వీసుకూడా అయిపోయే stage వస్తుంది. దీన్నిబట్టి

చూస్తే, వీరు సర్వీసులోవున్నంతకాలము promotion లేక అవస్థలు పడి అవతలకు వెళ్లవలసినట్లే కనబడుతున్నది. B.S.O.కు reference slip వుంటే, దానికి సంబంధించిన ఆర్డరు ఎక్కడో, వెదకటము కష్టము. ఎందుకంటే ఆ ఆర్డరుకు యిదివరకే ఎన్నో slips అదికించి వుంటాయి. ఏ slip ఏ correction కు సంబంధించిందో తెలియటానికి వీలుండదు. ఇలాంటి సందర్భాలలో ప్యాసు అయ్యే వారు ఎట్లా ప్యాసు అవుతారు? అసలు యీ tests pass అయినవారు చాలా కొద్దిమంది వుంటారు. సాధారణముగా examination కు పోయినవారందరు ప్యాసుకావడమే లేదు. కొందరికి తెలియక, కొందరికి బుక్కులు లేక, కొందరికి సరియైన instructions, tution లేక యీ విధంగా వుండడమువల్ల, ప్యాసు అయ్యేవారు చాలా అరుదుగా వుంటున్నారు. B.S.O. లు ఎప్పుడో ఓ. సి. కాలమునుంచి print అయివున్న ఆర్డర్లు దరిమిలావచ్చిన ఆర్డర్లు అన్నిగూడా correction slips రూపములో వున్నవి. Reference చూడాలంటే, అంతా confusion గా వుంటుంది. B. S. O. up to date గా print చేయించాలని అంటున్నాను. Print చేయించి N.G.O. లకు సప్లయి చేయించాలి. N.G.Os.కు యిటువంటి సదుపాయాలు ప్రభుత్వమే కలుగజేయాల్సి వుంది.

నిన్ననే మనము District Municipalities Act ను amend చేస్తూ pass చేశాము. అందులో కమిషనర్ల వుద్యోగాలు provincialise చేశాము. ఈ విధానము అంతా చూస్తే ద్వంద్వప్రభుత్వము మాదిరిగా వుంది. అటువంటిది లేకుండా మనము చూచుకోవాలి. అందులో "He must be a subordinate of the Municipal Council" అని వున్నది. Provincialise చేస్తే, కమీషనరు గవర్నమెంటు వుద్యోగి అయినాడు. అప్పుడు మునిసిపాలిటీవారికి subordinate ఎట్లా అవుతాడు? ఈ విధంగా ద్వంద్వముగా subordination వుంటే చిక్కులు వుంటాయి. District Boards లో కూడా అలాగేవుంది. Municipal workers అందరు municipality క్రింద పని చేస్తూవున్నారు. కాని Commissioner మాత్రము గవర్నమెంటు సర్వెంటు అయినాడు. మునిసిపల్ వర్కర్సులో తోటీలు, midwives, వగైరాలు, District Medical Officer స్వాధీనములో వున్నారు. వీరు ముగ్గురు subordinates అని అనిపించు కుంటున్నారు. D. M. O., Municipality, Government, ఈ విధంగా మూడు రకాలుగా subordinate గా వుంటున్నాడు. ముగ్గురుకు సమాధానము చెప్పాల్సివుంటుంది. దీనివల్ల వీరుచాలా యిబ్బంది పడుచున్నారు. వీరిని ఎవరో ఒకరిక్రింద subordinate గా వుంచాలి, అదేవిధంగా Health

Sri S. Vemayya] [24th Sep. 1955

officer విషయము తీసుకోండి. మీరు గవర్నమెంటు సర్వెంటు. ఆయన క్రిందవున్న గుమస్తాలు, అధికార్లు అందరూకూడా Non-Government servants. అదే మాదిరి Doctors Government servants కారు. Hospital చూస్తే L. F. Dispensary, Health Inspector, వారందరు provincial servants. Vaccinators వగైరాలు non-provincial, ఈ విధంగా రకరకాల status లోనూ వుంటున్నారు. ఈ విధానం ఏమీ సరిగా లేదు. అందరిని Government servants ను చేయండి. చిన్న చిన్న Gezetted Non-Gazetted state-wide గా transfer చేస్తున్నారు. వారికి యిచ్చే జీతాలు చూస్తే కొద్ది. Transfers చూస్తే మారు మూలలు. ఆవిధంగా లేకుండా ఒక జిల్లాకు అయినా పరిమితిచేయాలి. లేక ప్రక్క జిల్లావరకైనా పరిమితిచేయాలి. లేక పోతే general system మీద transfer చేయండి. Health Inspectors, Co-operative Inspectors ను, transfer చేసేటప్పుడు, జిల్లాలకే పరిమితి చేస్తే బాగావుంటుంది. కనీసము ప్రక్క జిల్లావరకైనా పరిమితిచేయండి. ఈ transfer చేసేది, వారు కొద్ది జీతాలుగలవారు కాబట్టి రాష్ట్రవ్యాప్తముగా చేస్తే చాలా యిబ్బందులు పడుతారు. పిల్లమేక వేసుకొని దూరముపోలేక రెండు కాపురాలు పెట్టుకుంటారు. ఇచ్చేజీతము చాలదు. ఇక వారు యిబ్బందిపడక ఏమవుతారు? ఏదైనా యిబ్బందివస్తే, వీళ్లు యిక్కడ, వారు అక్కడ, వుంటారు. పోనీయండి. Transfer T.A. అయినా చూద్దామంటే, తక్కువజీతాలవారికి తక్కువేయిస్తారు. వీరి జీతాలు ఒకసారిపోయి రావటానికే సరిపోతుంది. కాబట్టి నేను ముఖ్యమంత్రి గారిని కోరేది యేమిటంటే Central Pay Commission సిఫార్సుల ననుసరించి retrospective effect తో N.G.O.ల జీతాలు పెంచాలని కోరుతున్నాను. అందువల్లనే నేను యీనాడు యీ తీర్మానము తెచ్చాను. నేను యీనాడు చెప్పిన విషయాలు అన్నిదృష్టిలో పెట్టుకొని ముఖ్యమంత్రిగారు N.G.O.ల జీతాలు retrospective effect తో పెంచుతారని ఆశిస్తున్నాను.

MR. SPEAKER :—The House will now rise for lunch and meet again at 2-30 p.m. to day. After lunch (2-30 p. m.)

SRI S. VEMAYYA :—అధ్యక్షా, నేను తమ అనుమతితోటి ఎక్కువ కాలము తీసుకున్నాను. ఇతరులుకూడా దీనిమీద కొన్నిసూచనలు ఇస్తారు. ఈ తీర్మానమును అమలుపరిస్తే ఎక్కువడబ్బు ఖర్చు అవుతుంది కాబట్టి "మావద్ద డబ్బు వున్నట్లయితే మేమే చేసేవాళ్ళము. ఇప్పుడు మావద్ద డబ్బులేదు, ఆవిషయమును మీరు ఆలోచించకుండా మీరు జీతాలు పెంచమంటే ఎట్లాగు" అని ముఖ్యమంత్రి

గారు అనవచ్చును. అందుకు నేను పెద్దజీతగాళ్ల యొక్క జీతముతగ్గించి, చిన్నజీత గాళ్లయొక్క జీతాలు పెంచమని చెబుతున్నాను. ఇంకా Intermediate departmen'లుకొన్ని వున్నాయి. అవి R. D. O, D. S. O. ఆఫీసులు ఆరకమైనవి. ఈమధ్య కొన్ని పోస్టుఆఫీసులు ఈ రకంగానే పనిచేస్తున్నాయి. అవి అన్నీ తగ్గించవచ్చునని మద్రాసులో వున్నప్పుడు ప్రభుత్వానికి కొన్ని రిపోర్టులు కూడా వచ్చినాయి. అటువంటివి కొన్ని department లు తగ్గించితే ప్రభుత్వానికి కొంతడబ్బు మిగలడానికికూడా వీలవుతుంది. ఇంకా పెద్దవ్యాపారస్థులమీద, జమీందార్లమీద ఎక్కువపన్నులు వేసి వసూలుచేస్తే ఎక్కువడబ్బు వచ్చేదానికి కూడా వీలవుతుంది. మనది క్రొత్తగా ఏర్పడ్డ రాష్ట్రముకాబట్టి కేంద్రప్రభుత్వాన్ని కొంత అప్పుకోవాలని అడిగాము. మనరాష్ట్రమునుంచి వడ్లుపండించి ఇతర రాష్ట్రాలకు పంపిస్తున్నాము. ఇంకా మైకా ఇక్కడనుంచి ఎగుమతి చేస్తున్నాము. అందులో మనకు రావలసిన వాటా కేంద్రప్రభుత్వము కొద్దిగా ఇస్తున్నది. మనము ఎక్కువగా మైకాను export చేస్తున్నాము. దానివల్ల కేంద్రప్రభుత్వానికి ఎంతోలాభం వస్తున్నది. దాంట్లో కొంత తీసుకురావడం అవసరము. హాగాకు వ్యాపారులవల్ల కేంద్రప్రభుత్వమునకు ఎక్కువగా లాభమువస్తున్నది. అందులో వాటా కూడా మనము కేంద్రప్రభుత్వముతో దెబ్బలాడి తీసుకువచ్చినట్లయితే మన ఉద్యోగస్థులకు జీతాలు పెంచడానికి వీలవుతుంది. తరువాత జమాబందీలు, రెవెన్యూబోర్డులు ఇటువంటివన్నీ ఉండడమువల్ల చాలాడబ్బు దుబారా అవుతుందికాబట్టి అవి తీసివేయాలని పదేపదే చెబుతున్నాము. ఈవిషయాలన్నీ ముఖ్యమంత్రిగారికికూడా తెలుసు. మనకు డబ్బు అధికంగా రావడానికి కొన్నిమార్గాలు వున్నాయి. ఆ మార్గాలను అవలంబించి ఈ non-gazetted officer లయొక్క జీతాలు పెంచేదానికి ప్రభుత్వము పూనుకుంటుందని ఆశిస్తూ ఇంతటితో సెలవుతీసుకుంటున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU:—I second the resoluiion.

Sri L. LAKSHMANA DAS :—అధ్యక్షా, ఈనాడు వేమయ్యగారు తీసుకువచ్చిన తీర్మానముచూస్తే నాకు చాలా ఆశ్చర్యము కలిగించింది. 1953 ఆగస్టు 15 వతేదీనుంచి Pay Commission వారి recommendations ప్రకారము చిన్న ఉద్యోగులందరికీ ఎక్కువజీతాలు ఇవ్వాలని చెప్పినారు. రాష్ట్ర ప్రభుత్వము ఇప్పుడు ఏ పరిస్థితిలో ఉన్నదో, వారు ఇప్పుడు ఇవ్వగలరా, ఇవ్వలేరా అనే విషయాలు వేమయ్యగారు గమనించకుండా వారికి జీతాలు పెంచమని చెప్పడము నాకు ఆశ్చర్యము కలిగిస్తూ ఉన్నది. ఈనాడు ఉన్నపరిస్థితులను వేమయ్యగారుగాని,

Sri L. Lakshmana Das] [24th September 1955

వారుపార్టీవారుగాని గమనించలేదేమో అనే భావం కలుగుతున్నది. ఈనాడు దేశంలో ఎంతోమంది తిండిలేకుండా బాధపడుతున్నారు. వారికి ప్రభుత్వం ఈ నాడు సదుపాయాలు కలుగచేయాలిగాని, నెలకు రు. 50 లో, రు. 60 లో, రు, 70 లో జీతాలు తీసుకుంటున్నవారికి పెంచడం సబబుకాదు. ఈ తీర్మానం ఉద్యోగస్థులవద్ద పొగడ్తలు పొందడానికి ప్రయత్నము చేస్తున్నట్లుగా కనబడుతోంది కాని యథార్థపరిస్థితులను గమనించి తీసుకువచ్చినట్లు ఏమీలేదని నేను ఇందుమూలంగా తెలియజేస్తున్నాను. రమారమి Pay Commission Report ప్రకారము 4 కోట్లరూపాయలవరకు ఉద్యోగస్థులజీతాలు పెంచాలంటే ఈనాడు ఆంధ్రరాష్ట్రానికి వచ్చే రాబడి ఎంత, ఇందులో మనం 4 కోట్లరూపాయిదాకా అదనంగా పన్నులు వేసి తీసుకురాగలరా అనేదికూడా గమనించవలసిఉంది. ఇది ఆచరణయోగ్యము కాదు అనేది గమనించకుండా కేవలం ఒక ప్రచారముకోసం ఉద్యోగుల అభిమానంకోసం పేరుప్రతిష్టలు సంపాదించడముకోసం ఈతీర్మానాన్ని తీసుకురావడమేగాని యదార్థపరిస్థితులకుమాత్రం ఇది వ్యతిరేకమనిమనవిచేస్తున్నాను. దేశంలో ఇంకా ఈనాడు చిన్న వ్యవసాయదారులు, వ్యవసాయకూలీలు అనేకమంది బాధలుపడుతున్నవారు ఉన్నారు. వారందరి సంగతిఏమిటి? వారందరిని అభివృద్ధిలోకి తీసుకురావాలనే దృక్పథముతో మొదటి పంచవర్ష ప్రణాళిక రెండవ పంచవర్ష ప్రణాళిక మనము పెడుతున్నాము. వాటికి ప్రభుత్వమునకు ఎక్కువడబ్బు కావలసిన పరిస్థితులు ఏర్పడినవి. అటువంటి పరిస్థితిలో ఇంకా 4 కోట్లు రూపాయిలవరకు ఉద్యోగస్థుల జీతాలు పెంచాలనే ప్రతిపాదన తీసుకురావడం ఆచరణయోగ్యముకాదు. ఉద్యోగులకు మేము జీతాలు పెంచమంటే ప్రభుత్వము ఒప్పుకోవడములేదనే ప్రచారము చేయడముకోసం పెట్టింది తప్ప ఇంకా వేరే ఆలోచనతో పెట్టినదికాదు. ప్రభుత్వానికి ఈ ఉద్యోగస్థుల జీతాలను పెంచాలని ఉద్దేశ్యము లేకపోలేదు. ఉద్యోగస్థులకు మంచి వేతాలుఇవ్వాలని, వారుకూడా సౌఖ్యంగా ఉండాలనే ఉద్దేశం ప్రభుత్వానికికూడా ఉన్నది.

ప్రభుత్వంకూడా తన ఉద్యోగస్థులయెడల ముఖ్యంగా చిన్న ఉద్యోగస్థుల పట్ల శ్రద్ధతీసుకుంటూనేఉన్నది. మనకుఉన్న రాబడి ఎంత ? ఆంధ్రరాష్ట్ర బడ్జెటును ఇదివరకు చూశారు. వేమయ్యగారుకూడా ఇదివరకు అసెంబ్లీలో ఉన్నారు. ఇపుడు ఉన్నపరిస్థితులలో రాష్ట్రఆదాయంలోనుంచి నాలుగుకోట్లు రూపాయిలు ఖర్చుచేసే పరిస్థితిలో ప్రభుత్వంఉన్నదా ? ఈ విషయాన్ని గమనించకుండా ఈ తీర్మానాన్ని తీసుకురావడం సమంజసముకాదు. ఈ తీర్మానానికి ఇది సరిఅయిన

సమయం కాదు. ప్రభుత్వానికి కావలిసిన ధనం ఉన్నప్పుడు, తప్పకుండా Pay-Commission వారు సూచించిన జీతాలనే కాక, ఇంకా హెచ్చు సౌకర్యాలు కలిగించడానికి ప్రభుత్వం పూనుకుంటుంది. ప్రభుత్వం వెనుకకు తగ్గదు. ప్రభుత్వం తన ఉద్యోగుల బాగోగులను గురించి జాగ్రత్తగానే ఉంటుంది. కాని దేశంలో ఉన్న పరిస్థితులను చూడాలి. పంచవర్ష ప్రణాలిక క్రింద వందలకోట్ల రూపాయిలు అవసరం. ఆంధ్రరాష్ట్రం క్రొత్తగా ఏర్పడడంవల్ల ఆదాయం తక్కువ అవడంవల్ల ఇతర రాష్ట్రాల వలె ముందుకు పోవడానికి వీలులేని పరిస్థితులు ఏర్పడిన సంగతి ప్రతిపక్షానికి తెలుసును. ఈ సంగతి తెలిసికూడా ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెడతామని ప్రభుత్వానికి ప్రజలకు ఉద్యోగస్థులకు మధ్య విభేదాలు కల్పించాలని ఉద్దేశంతో తెచ్చిన ఈ తీర్మానాన్ని మేము సహించము. ప్రభుత్వ ఉద్యోగస్థులుకూడా ఈ తీర్మానాన్ని సహిస్తారని నేను అనుకోను. వారికి తెలుసును ఈనాటి పరిస్థితులు. ఎంతరాబడి వస్తోందో వారికి తెలుసును. ప్రభుత్వ ఉద్యోగస్థులుకూడా వారిక్షేమంకోసము ఈ తీర్మానం తీసుకు వచ్చారని అనుకుంటారని నేను అనుకోను. ఈ శాసనసభలో మనం గడిపే ప్రతిగంటా కొంత వ్యయంతో కూడుకున్న సందర్భంలో మనంచేసే సూచనలు అమలు చేయడానికి వీలుగాను ఆచరణయోగ్యంగాను ఉండేటట్టు చూడవలసియున్నది. ప్రభుత్వ సభ్యులమీదనే కాకుండా ప్రతిపక్షంపైకూడా బాధ్యత ఉన్నది. దీనిని అమలు చేయడానికి కావలసినడబ్బు ఎంత, ఏఏపన్నును వేయడం ద్వారా డబ్బురాబట్టాలి, అనే విషయాలేవీ వేమయ్యగారు చెప్పలేదు. ఉద్యోగులగురించి, రకరకాల చిన్న జీతగాళ్లను గురించిమాత్రం చెప్పకుపోయినారు. ఈ తీర్మానాన్ని సక్రమంగా తయారుచేసి ఆచరణయోగ్యంగా చేద్దామని వారు ప్రయత్నించలేదు. వారు ఏ సూచనలు చేయలేదు. కేవలం వ్యవసాయకమైన మన రాష్ట్రంలో క్రొత్తపన్నులు వేయాలంటే ఇప్పటికే క్రుంగి కృశించిన వ్యవసాయదారునిపైననే వేయాలి. అవకాశంలేని కారణంగా రేపు రెండవప్లానులోకూడా తక్కువమొత్తాలు ఖర్చుచేయడానికి సిద్ధమవుతున్నాము. ఎక్కడనుంచి నాలుగుకోట్ల రూపాయిలు తీసుకు రాగలము? ఈ విషయం వేమయ్యగారు కాని వారిపార్టీవారు కాని గమనించి ఉంటే ఈ తీర్మానాన్ని తీసుకువచ్చి ఉండేవారుకాదు. ఈ విషయంలో వెంకటేశ్వర్లుగారుకూడా నాతో ఏకీభవిస్తారని ఆశిస్తున్నాను. మనం ఎటువంటి తీర్మానాలుచేసినా ఒక విషయంమాత్రం గుర్తుంచుకోవాలి. ఈనాడు మనం చేసేఖర్చువల్ల ఆంధ్రరాష్ట్రం అభివృద్ధిచెందాలి. దేశంలో కేవలం ఉద్యోగస్థులేలేరు. 10 ఎకరాలు భూమి ఉన్నవానికంటె రు 70 లు తెచ్చుకొనే ఉద్యోగస్థుని పరిస్థితియే చాలా మెరుగుగా ఉన్నది. 10 ఎకరాలు భూమిఉన్న

Sri L. Lakshman Das] [24th September 1955

వారుకూడా ఈ తీర్మానానికి హర్షించరని నమ్ముతున్నాను. ఎవరూకూడా హర్షించ కూడదు. ఆంధ్రరాష్ట్రం రాబడి, ఖర్చు వారికి తెలుసు. ఈ తీర్మానంవారి యోగక్షేమాలకోసమని వారు అనుకోరు. Non-official Days లో తీసుకు రావలసిన తీర్మానాలు సక్రమంగావుండి, ఏకగ్రీవంగా ఆమోదింపబడేట్లా ఉండాలి కాని ఈ రకంగా కాదు. ఆ విధమైన తీర్మానాలను ప్రతిపక్ష సభ్యులు తీసుకు రావాలని కోరుతూ దీనిని ఉపసంహరించుకోవాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

SRI S. BRAHMAYYA :—మాననీయ అధ్యక్షా, సోదరుడు వేమయ్యగారు తీసుకొనివచ్చిన ఈ తీర్మానాన్ని నేను ప్రతిఘటిస్తున్నాను. వేమయ్యగారు ఈ తీర్మానాన్ని ప్రతిపాదించేముందు ఇది ఆచరణయోగ్యమా కాదా అనే విషయము ఆలోచించలేదు. తనపార్టీ ప్రతిష్ఠకో లేక తన ప్రతిష్ఠకో తీర్మానము తీసుకువచ్చినారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మీకు భయం అల్లా అదేనా ?

SRI S. BRAHMAYYA :—అదే. ఈ తీర్మానములో Central Pay Commission సిఫార్సులు అమలు చెయ్యాలనడమే కాకుండా 1953 October నుండి retrospective effect తో అమలులోనికి రావలెను అని చెప్పి కోరారు. అది ఎంతవరకు సమంజసము అయినదో, అందరు సుదీర్ఘముగా ఆలోచించవలెనని ఇతర పార్టీ నాయకులకు పార్టీ సభ్యులకు మనవి చేస్తున్నాను. యికలాపు లక్ష్మణదాసుగారు తమ ఉపన్యాసములో మనకువున్న బడ్జెటు లోటునుగురించి పూర్తిగా వివరించారు. ఇదికూడా వారు గమనించినట్లు లేదు. దేశములో నిరుద్యోగ సమస్య ప్రబలముగా ఉంది. ఈ నిరుద్యోగ సమస్యను ఎట్లా నివారించడము అని మన నాయకులు, భారత నాయకులు అహర్నిశము ఆలోచిస్తున్నారు. దేశం అంతా శుభిక్షముగా ఉండాలని, దేశములో నిరుద్యోగము నివారణ అయ్యేవరకు నిద్రపోనని నెహ్రూ పండితుడు కంకణం కట్టారు. కాని అటువంటివి వారు పెడచెవిని పెట్టి cheap popularity కోసము ఈ తీర్మానము తీసుకొనిరావడము జరిగింది. N.G.O.ల విషయమే వారు తీసుకున్నారు. దేశములో ఎంతమంది నిరుద్యోగులున్నారు ? ఎంతమంది ఆకలిమంటలతో కృంగికృశించి అల్లల్లాడేవారు, ఎందరున్నారో ఆలోచించారా? వీరందరికి తిండి గుడ్డ కలుగ చెయ్యడానికి ఆలోచించారా? N.G.O.లకు జీతాలు పెంచాలంటున్నారు. వారే వారికి బంధువులా? అవును. బడిపంతుళ్లు, ఇంకా ఇతర చిన్న ఉద్యోగస్థు లందరూ వారికి బంధువులు చుట్టాలు. రు.2,000 రు.3000వరకు తీసుకొన్నవారు కాంగ్రెసువారికి బంధువులైనట్లు భావించు చున్నారు.

Sri S. Brahmayya] [24th September 1955

అంతేగాని N. G. O. లకు రాష్ట్రప్రభుత్వం కలుగచేస్తున్న సౌకర్యాలను వారు తెలుసుకోనుటలేదు. వాటినిగురించే వారు చెప్పుకొనలేదు. విద్యా వైద్య సౌకర్యములు కలుగచేస్తున్నది వారు గమనించలేదు. వారి దృష్టిలోనే లేదు. సౌకర్యములుఅన్ని క్రమక్రమముగా కలుగచెయ్యవలెను. కాని ఒక్క పర్యాయము Central Pay Commission సిఫార్సులు అమలుచెయ్యమని చెప్పడము ధర్మముకాదు. మన రాష్ట్రము ఎంతో లోటుబడ్జటుతో ఉంది. ఆలోటు పూడ్చడానికి ఎంతో ప్రయ ప్రయత్నము చెయ్యవలెను. పన్నులు వేస్తున్నామని ప్రజలలో భీతావహం ఆందోళన బయలుదేరిందని మీకు తెలియదు. ఈనాడు గ్యాలరీలో వున్నవారు ప్రేక్షకులు కారు. కొత్తపన్నులు వెయ్యబోతున్నామని మొరపెట్టుకుంటానికి విజ్ఞప్తి చెయ్యడానికి ప్రభుత్వంవద్దకు వచ్చారు. ఇవి ప్రతిపక్షమువారు గమనించాలి. డబ్బు కలవారివద్దనుండి వసూలు ఎందుకు చెయ్యకూడదు అని చెబుతారు. దోపిడి ఎందుకు చెయ్యకూడదని అంటున్నారు. అది భారత సాంప్రదాయానికి విరుద్ధమైన విషయము. ఏ విధముగా వారిని నిలువునా దోపిడీ చెయ్యడము? వారిలో మార్పు తీసుకొని వచ్చి చైతన్యం కలిగించే ప్రయత్నం జరగాలి. సామ్యవాద సిద్ధాంతాలమీద యిది సాధించాలి అనే అభిప్రాయం ఈ పార్టీవారికి ఏనాడుకూడా వుండదు. ఈ విధముగా N. G. O. ల మీద ఎందుకు ఈవట్టి అభిమానము? ఇందువల్ల ఏమీ జరగదని N. G. O. లకు తెలుసును. కాబట్టే గతఎన్నికలలో వారికి సరిఅయిన పాఠము చెప్పారు. N. G. O. ల జీతాలు పెంచాలి అని డబ్బాకొట్టడంవల్ల popularity రాదు. రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వం యిచ్చిన తాఖీదులను అనుసరించి, దేశంలోవున్న పరిస్థితులను తెలుసుకొని అన్ని సదుపాయములు కలుగచేసేందులకు కంకణం కట్టుకుంది. వారియెడల సానుభూతి ప్రభుత్వానికి ఉన్నదో లేదో సభ్యులు ఆలోచించుకొనవలెనని మనవిచేస్తున్నాను.

మనదేశంలో నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి భారీపరిశ్రమలను ప్రవేశపెట్టవలెననే సమస్య ఈనాడు ఉన్నది. దానితో నిరుద్యోగముపోయి చాలా మందికి జీవనోపాధి ఏర్పడుతుంది. దేశం సుభిక్షంగా వుండాలి. ప్రభుత్వం దానికి పూనుకుంటున్నది.

[At this stage, temporary chirman Sri M. R. Apparao occupied in chair.]

Second five year plai లో ఏఏపరిశ్రమలు ఆంధ్రరాష్ట్రములో పెట్టబోతున్నారో వానికొరకు ఎంతఖర్చు పెట్టాలో గౌ॥ గోపాలరెడ్డిగారు క్రిందటి బడ్జెట్టులో చెప్పారు. ఈ విధముగా ఒక్కొక్క రంగములో, మన జీవిత అవసరాలను

Sri S. Brahmayya] [24th September 1955

ఏ విధముగా ఏర్పాటు చెయ్యవలెనో, వాటికి పునాదులు వేసుకొంటూ ఉంటే ప్రభుత్వాన్ని విమర్శించడం, ఇటువంటి తీర్మానములను తీసుకొని రావడములో అర్థము ఏమిటి?

విద్యారంగములో మనము ముందుకు పోతున్నాము. దేశములో ఇదివరకు నూటికి 8 మంది చదువుకున్నవారు ఉంటే ఈనాడు 100 కి 30 మంది, పట్టణాలలో 40 మంది వరకు కూడా ఉన్నారు. ఇది ఎవరి కృషిఫలితము? ఇది ప్రభుత్వం చేసినది కాదా? ప్రతి కుగ్రామములో కూడా పాఠశాలలు పెట్టి నిరక్షరాస్యత నిర్మూలనకు ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నప్పుడు ఎందుకు ప్రభుత్వాన్ని విమర్శించాలి? ఈవిధమైన తీర్మానాలు తీసుకురావడంలో అర్థంలేదు. Popularity వస్తుందనే ఉద్దేశ్యమువుంటే ఉండవచ్చును. రాష్ట్రిలోటు బడ్జటును దృష్టిలో పెట్టుకొని ఈ తీర్మానాన్ని ఉపసంహరించుకొనడములో న్యాయము, శ్రేయస్సు ఉన్నదని వేమయ్యగారికి మనవిచేస్తున్నాను.

3-00 p. m.

ఈ Non-gazetted officer లు వారికే స్నేహితులు కారనీ, వారు అందరకూ సంబంధీకులే అని అదేవిధంగా నిరుద్యోగులు అన్నాహారాలు లేకుండా ఎట్టి వృత్తి లేకుండా బాధపడుతూ ఉన్నటువంటి వారుకూడా ప్రజలే అనీ, సిరి సంపదలతో తులతూగే పెద్దవారుకూడా భారతీయులే అనీ, కాంగ్రెస్‌పార్టీ ప్రజాస్వామిక సిద్ధాంతాలమీద ప్రభుత్వాన్ని నడిపిస్తూ అందరినీ సమానంగాచూస్తూ శ్రేయోరాజ్య స్థాపన జరిగించాలనే పంథాలో నడుపుతోంది. ఇది క్రమంగా ఆచరణయోగ్యమవుతుందిగాని ఒక్క పర్యాయమే ఆచరణ సాధ్యంకాదని సోదరుడికి నేను మనవి చేస్తున్నాను. వారు తెచ్చిన తీర్మానం సమంజసం ఐనటువంటిది కాదని వెంటనే ఉపసంహరించుకోవడం మంచిదని మనవిచేస్తున్నాను.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, శ్రీ వేమయ్యగారు ఈరోజున తీసుకువచ్చిన తీర్మానాన్ని నేను బలపరచలేకుండా ఉన్నాను. ఎందుకంటే ప్రస్తుతపరిస్థితులలో ఆ తీర్మానం అప్రస్తుతమని నేను భావిస్తూయున్నాను. ఎందుకనగా ఈ Pay Commission యొక్క సిఫార్సులను మనం implement చేయడంవల్ల 3, 4 కోట్లవఱకూ మనకు ఖర్చవుతుందని తెలుస్తోంది. అసలు లోటుతో రాష్ట్రిం ప్రారంభించాం. ఈ సంవత్సరం మనకు బడ్జటులో రు. 366 లక్షలదాకా మనకు లోటువచ్చింది. దాన్ని ఏవిధంగా పూడ్చుకోవాలి అనే ప్రయత్నంలో మనంవుంటే, Non-gazetted ఉద్యోగస్థులజీతాలు హెచ్చించాలని తీసుకొని

24th September 1955] [Sri N. C. Seshadri

వచ్చిన తీర్మానం బహుశ ఇప్పటిపరిస్థితులలో సాధ్యంకాదేమోనని నేను భావిస్తున్నాను. మనం ఈరోజు అనేక ముఖ్యసమస్యలను పరిష్కరించుకోవలసియున్నది. ఈరోజు మన ఆంధ్రరాష్ట్రంలో ఒక్క non-gazetted ఉద్యోగస్థులే కాకుండా వారికంటె అతిహీనమైనస్థితిలో ఉన్న చిన్నచిన్న ఉద్యోగస్థులు చాలామందున్నారు. మొన్న బడ్జటు session లో ఈ ఉద్యోగస్థుల విషయమై చాలా చర్చలుజరిగాయి. అందులో ముఖ్యంగా గ్రామోద్యోగస్థులు: 20 వేలమందికిపైగా ఉన్నారు. వారిస్థితి ఆవిధంగానే ఉండిపోయింది. ఇంకా వ్యవసాయకూలీలున్నారు. మనకు నిరుద్యోగసమస్య, అనారోగ్యం, చిన్నచిన్న గ్రామాలలో ప్రాథమిక పాఠశాలలు తక్కువగా ఉండడం ఇటువంటివి అనేక చిక్కుసమస్యలు మనకున్నాయి. అందుకుగాను మనం ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రచించుకున్నాం. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ప్రతి మానవుని జీవితపరిమాణాన్ని హెచ్చించాలని మనం చిన్నచిన్న పథకాలు తీసుకున్నాం. పరిశ్రమలకు ప్రాధాన్యం ఇవ్వాలని పరిశ్రమలు స్థాపించడానికి మనం కొన్ని ఏర్పాట్లు చేసుకున్నాం. ఇటువంటి పరిస్థితులలో మనం రాష్ట్రంయొక్క మొత్తం planning అంతాకూడా ఏ ఆరునూరుకోట్లో కావాలనుకుంటూ వుంటే, లేదా కేంద్రప్రభుత్వం దగ్గరకు పోయేసరికి మనకు 125 కోట్లు మాత్రమే వచ్చింది. కాబట్టి మన కనీసపుకోర్కెలు తీర్చడానికికూడా వీలులేనటువంటి పరిస్థితులలో నాన్ గెజెటెడ్ ఉద్యోగస్థులజీతాలను పెంచాలని కోరడం భావ్యంకాదని నే ననుకుంటున్నాను. దీనికి నాలుగుకోట్లరూపాయిలు ఖర్చవుతుంది. దీన్ని ఏవిధంగా మనం సంపాదించాలి? నాన్ గెజెటెడ్ ఉద్యోగస్థుల పరిస్థితిచాలా కష్టంగానే ఉంది. దానివిషయంలో ప్రతిపక్ష సభ్యులకు ఉన్నంత సానుభూతి ప్రభుత్వపక్ష సభ్యులకు తప్పకుండా ఉంది. కాని రాష్ట్రబడ్జటులో ఎంతో లోటు ఉన్నది. దీనికి కావలసిన ఆదాయం ఎట్లా రాబట్టుకోవాలనే విషయంలో వారు కొన్నిసూచనలు చేశారు. Deputy Collector ఆఫీసులు వగైరాలు కొన్ని Post Office లు మాదిరిగా ఉన్న office లున్నాయి. అవి తీసెయ్యాలని చెప్పారు. నిజమే. అవి సాధారణపరిస్థితులలో యోచించవలసిన విషయాలేకాని, ఇప్పుడు దేశాభ్యుదయాన్ని కోరుతూ వేరేవేరే department లు పెంచుకుంటూయున్న ఈ సమయంలో ఇది సరియైన మార్గంకాదని అభిప్రాయపడుతున్నాను. Planning Department అనేది 4, 5 సంవత్సరాలక్రిందట మనకులేదు. దాన్ని క్రొత్తగా పెట్టుకున్నాం. ఇంకా హరిజన సంక్షేమశాఖ అనీ, social welfare అనీ క్రొత్తగా పెట్టుకుంటున్నాం ? ఇదివఱలో దేశంలో అన్నివర్గాలవారికీ న్యాయం జరగలేదనే ఉద్దేశ్యంతో, అన్నివర్గాలవారినీ ఒక సమానమైనస్థాయికి తీసుకురావా

లనే ఉద్దేశ్యంతో ఈ క్రొత్త departments లు పెట్టుకునేటటువంటి ఈ కాలంలో ఉండే department లు తగ్గించాలని చెప్పుకోవడం అంత బాగాలేదని నేను భావిస్తున్నాను. మనం mica export చేస్తున్నాం. మనకు వరిపంట జాస్తీగా పండి వస్తే export చేస్తున్నాం. కేంద్రప్రభుత్వంతో దెబ్బలాడి మనం ఎక్కువగా డబ్బు తెచ్చుకోడానికి అవకాశాలున్నాయి. ఎందుకు తెచ్చుకుని ఖర్చు పెట్టరాదని వారు సూచించారు. మనం ద్వితీయపంచవర్ష ప్రణాళికకు 250 కోట్లు అడిగాం. దానిలో సగంమాత్రమే మనకు లభించింది. Non-gazetted officer లకు జీతాలు పెంచుతాం, మీరు కొంత డబ్బివ్వండని కేంద్రప్రభుత్వాన్ని అడిగితే, వారు ఇచ్చేస్థితిలో ఉన్నారా అని మనం ఆలోచించవలసియుంది. కేంద్రప్రభుత్వానికి అన్నిరాష్ట్రాలనుంచికూడా ఒత్తిడివస్తూ ఉంటుంది. ఒక్కొక్క రాష్ట్ర ఆర్థిక స్తోమతునుబట్టి వారు డబ్బు కేటాయిస్తోంటారేగాని మన non-gazetted ఆఫీసర్ల జీతాలు పెంచడానికి డబ్బు ఇవ్వవలసిందని వారి నడగడం అంత న్యాయంకాదు. ఈరోజు ప్రతిపక్షసభ్యులు ఈచర్చ తీసుకువచ్చి non-Gazetted officer ల అభిమానాన్ని సంపాదించాలని అనుకోవచ్చునుగాని అటు ఆఫీసర్లుగాక ఇటు సామాన్యప్రజలూగాక గబ్బిలాలవలె ఉండేటటువంటి village officers గతి ఏమిటి ? Budget విషయంలో village officers విషయంకూడా వారు మాట్లాడారు. ఏ సమయానికి ఏవిధంగా మాట్లాడాలో అల్లా మాట్లాడుతూంటారు. అన్నివర్గాలవారికీ లాభకరంగా ఉండేటటువంటి సూచనలు మనం చేయవలసియుంటుందికాని దేశంమొత్తం అభివృద్ధికి పాటుపడవలసినదిగా సోదరసభ్యుణ్ణి కోరుతూ తీర్మానాన్ని ఉపసంహరించవలసినదిగా కోరుతున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, నేను వేమయ్యగారి తీర్మానంమీద చర్చకు సంబంధించిన విషయాలమీద కాకుండా మొన్న జరిగిన general elections మొదలుకొని రాబోయే General Elections వరకూ ఉన్నటువంటి పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వ పక్షంలో యున్నటువంటి మిత్రులు మాట్లాడారు. అసలు వేమయ్యగారి తీర్మానం ఏమిటి, సబబైనదా కాదా, ఎంతవరకూ దాన్ని అమలు జరపగలం అనే విషయాన్ని దీర్ఘంగా చర్చించారా అంటే అదికూడా చెయ్యడం మానుకున్నారు. ఇప్పుడు మాట్లాడినటువంటి మిత్రుడు ఒక్క Non-Gazetted ఉద్యోగుల విషయమే తీసుకువస్తున్నారు.

శంకరయ్యగారిపేర మరో తీర్మానంవుంది. దీన్ని ఒప్పుకోకపోతే పోయారు, పోనీ అదైనా ఒప్పుకుంటారేమో చూస్తాను. కాలువార్లకు రక్షణ ఇవ్వాలనే తీర్మానం

కూడా ఉన్నది. ఏ ఒక్క తీర్మానం ఒప్పుకొన్నా సంతోషించడానికి సిద్ధంగానే యున్నాం. అయినా చేస్తారేమో మేముకూడా చూస్తాం ఎవరో చెప్పారు Village Officers విషయంవస్తే దాన్నిగురించి మాట్లాడతానని చేనేతవారి విషయం వస్తే ప్రగడ కోటయ్యగారు ఘాటుగా మాట్లాడతారని అంటున్నాను. ఎవరి విషయం గురించి వారు మాట్లాడడం సహజం. దేశంలోయున్న పరిస్థితులను గురించి మాట్లాడతాం కాని లేని పరిస్థితులను గురించి ఎవరూకూడా మాట్లాడలేరు. అది కొద్దిమందే చేయగలరు Elections లో మీకు బుద్ధిచెప్పారు మీకు ఓ టివ్వలేదు అని బ్రహ్మయ్యగారన్నారు నిజమే. ఒకప్పుడు మాకు చెబుతారు. మరొకప్పుడు మీకు చెబుతారు. ఇవన్నీ కాలాన్ని బట్టిచూస్తూ ఉండవలసిందే. సంజీవరెడ్డిగారికీ, మాకూ, మీకూ, అందరికీకూడా వాటినిగురించి అనుభవం ఉండనేవుంది. అందువల్ల తొందరపడి మాట్లాడినందువల్ల లాభం లేదు. Pay Commission లో కమ్యూనిస్టులు ఎవరూలేరు అని మీకందరకూ తెలిసినవిషయమే. ఆనాడు ఉద్యోగస్థుల జీతాలు చాలా అధ్వాన్నంగా ఉన్నాయని, ఆనాడు దేశవ్యాప్తంగా వచ్చిన సమ్మెలు ఇతర ప్రజా ఉద్యమాలను దృష్టిలో పెట్టుకొని ఈ Central Pay Commission ను వేయడంవల్ల కొన్ని నియమాలతో, కొన్ని సూత్రాలతో వారు report ఇచ్చారు. వాటిని కొన్ని రాష్ట్రప్రభుత్వాలుకూడా అమలుజరిపాయి.

అయినప్పటికీకూడ కొన్ని రాష్ట్రప్రభుత్వాలు అంగీకరించినవి. మన రాష్ట్రప్రభుత్వానికంటే ఇతర రాష్ట్రప్రభుత్వాలు ఇంతకంటె ఎక్కువజీతములు ఇస్తున్నవి. మన ప్రక్కనవుండే Hyderabad వారు జీతాలు ఇంతకంటె ఎక్కువగా ఇస్తున్నారు. కేంద్రప్రభుత్వం ప్రకటించిన Central Pay commission రిపోర్టును అమలు జరుపమని కోరుతున్నాము. 1953నుంచి అమలు జరుపమన్నాము. ఏదో ఆంధ్రరాష్ట్రం వచ్చింది గనుక ఆ నాటినుంచి అమలుజరిపితే బాగా ఉంటుందని పెట్టాము. అప్పటి నుంచి అమలుజరుప మనేదికాదు. బేరానికివచ్చి across the table చర్చించి మీకు అభిప్రాయంభేదంవుంటే దానిని చర్చించి చేసేదానికి ఎవరికి ఎట్టి అభ్యంతరంలేదు. అలాంటప్పుడు దీనిని తీసుకొచ్చి 1953 నుంచి ఇమ్మంటే ఎన్నికోట్లు అవుతుంది? నాలుగుకోట్లు అవుతుందన్నారు. ఇప్పుడే గోపాలరెడ్డిగారు చెప్పారు. ఉమ్మడి రాష్ట్రములో ఉన్నపుడే కేంద్రప్రభుత్వంయొక్క సిఫార్సులను అమలు జరిపివుంటే సుమారు 6 కోట్ల రూపాయలుమాత్రమే అయివుండేది అని. కాని ఇపుడు మనకు అయ్యే మొత్తం చూచుకుంటే రెండుకోట్ల రూపాయలకంటె ఎక్కువరాదు. ఈ రెండుకోట్ల రూపాయలను సంపాదించడం ఎట్లా అనేది దీక్షతో మనం ఆలోచించి

వుంటే సభ్యులు అంతాకూడా వేరే రకమైన ఉపన్యాసాలు ఇచ్చివుండేవారని వారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఈ నాడు ఈ కేంద్ర ప్రభుత్వ శిఫార్సులను అమలు జరపడం ఎట్లా అనే పట్టుదలతో మాట్లాడుతామా ? లేకపోయ్యేటట్లయితే— Lakshmana Das గారు చెప్పినట్లు కుంటివాండ్లు, గుడ్డివాండ్లు తిండిలేనివాండ్లు గుడిశెలలో ఉండేవాండ్లు అనేకమంది ఉన్నారు, పది ఎకరాలువుండే రైతుకూడా చదువు చెప్పించుకోలేని హీనస్థితిలో ఉన్నాడు. అలాంటప్పుడు N.G.O.ల, జీతాలు మాత్రము ఎందుకు హెచ్చుచేయవలెనని అంటూ ఉన్నారు. వాండ్లందరి పరిస్థితికూడ బాగుచేయవాలసిందే. కాదంటున్నామా ? వారిని బాగుచేయడానికి మీరు ఏదైన శాసనం తీసుకొనివస్తే communist లో మరి ప్రతిపక్షులో ఎవరైనా అడ్డు తగులుతున్నారా ? లేదే. ఆ శాసనములు తీసుకొని రాకుండా, వారి పరిస్థితులను అదే విధంగా పెట్టడానికి భాధ్యత వహించవలసివుంటే, పాపము కాంగ్రెసు పార్టీ వహించాలిగాని ఆ భాధ్యత మా నెత్తిమీదనెట్టి మీరు ఏదో మంచిమంచి పనులుచేస్తూ, చెడ్డపనులు మా నెత్తిమీదికి పెట్టుతామంటే అది సరియైనపద్ధతి కాదు. అందువల్ల వాటి అన్నిటిని తీసుకొని రావాలసివున్నది. అందుకనే అంతాకూడా చెప్పాము. భూ సంస్కరణలు కావాలనిచెప్పాము. దాంట్లోకి పోయ్యేటట్లయితే subject కు దూరంగా పోతామేమో అని మాట్లాడడం లేదు. దానికైనా ఆలోచించి, Brahmayya గారు Lakshmana Das గారు వారి పార్టీలో ఒత్తిడి తీసుకొనివచ్చి భూ సంస్కరణలు పెట్టండి. జమీందారులు, కోటీశ్వరులు లక్షాధికారులు అంతాకూడా, ఈనాడు కాంగ్రెస్ పార్టీలో ఉన్నారు. మీ పార్టీవాండ్ల గుప్పెట్లోనే ఉండవలెను. లేక వారు మీ గుప్పెట్లో వుండవలెను. ఏది నిజమో, అబద్ధమో అదితేల్చి ప్రజానీకానికి బహిరంగంగా చెప్పవలసిన రోజు సమీపించింది. ఈ విషయాలు అన్నీకప్పి పుచ్చుకొని మీరు చేసిన తప్పిదాలకు పొరపాట్లకు, ప్రతిపక్షులమీద నిందలువేసి తేలికగా పనులను చేయడం మానివేసి ఏదైనా ప్రభుత్వ ఉద్యోగులకు జీతం కొంచెం ఎక్కువ చేయండయ్యా అంటే డబ్బు ఎక్కడనుంచి వస్తుంది అంటున్నారు. పన్నులు ఎక్కువ వేయమంటున్నారు. మేము ప్రతి ఘటిస్తున్నాము, మీరుకూడ ప్రతి ఘటిస్తున్నారు, డబ్బు ఎక్కడనుంచి వస్తుంది, అని తిరిగి ప్రశ్నవేస్తున్నారు. ఆంధ్రదేశం ఎక్కువ పన్నులభారముమోసే స్థితిలో లేదని మాకు, మీకుకూడ తెలుసును. దానిని ఎవరుకూడ కాదనము. పన్నుల భారం మోయగలిగినటువంటివారు కొద్దిమందిని ఉన్నారు. ఈ రోజున జమీందారులు, పెద్ద పెద్ద కోటీశ్వరులు ఉన్నారు.

వాండ్లమీద తగినంతభారం మోపడంలేదనే గోపాలరెడ్డిగారిమీద మావిమర్శమోపి చూడమనండి. ఎంతడబ్బు వస్తుందో ఆనాడు తేలుతుంది. అంతేకాదు కేంద్ర ప్రభుత్వానికికూడ, డబ్బు ఎక్కడనుంచి వస్తుందని మరొక విషయంతెచ్చారు. 20 కోట్లరూపాయలు tobacco మీద excise dutyవల్ల మనరాష్ట్రమునుంచి పోతుంది. వేరుసెనగనుంచి ఎంతపోతున్నదో తెలియదు. మొత్తం మనరాష్ట్రంనుంచి 30 కోట్లరూపాయలు కేంద్రప్రభుత్వానికి పోతూవుంది. అలా పోతూవున్నపుడు కేంద్ర ప్రభుత్వంపెట్టిన scales వుద్యోగులకు అమలుజరుపుకోవలెనంటే మాకు చేత కాకుండావుంది. మీరు మాకువచ్చే ఆదాయాన్ని అంతాతీసుకొని, ఉద్యోగులకు మాకు కావలసినడబ్బు ఇవ్వండి అని చెప్పడమైనా మంచిదే. లేకపోయి నట్లయితే మాకు న్యాయంగా రావలసినభాగాన్ని మాకు పెట్టమని చెప్పండి. 30 కోట్లరూపాయలు తీసుకొనిపోతూ మనకు ఇస్తున్నది ఎంత? పంచవర్ష ప్రణాళికకు ఇస్తున్నాము అంటే అందరికి ఇస్తున్నారు. అది వేరేవిషయం. కాని మొన్న మొన్నటివరకుకూడ ఇచ్చింది ఎంత? Excise duty లోనుంచి మనకు వచ్చింది ఎంత? ఈరోజు మనకు అది సరిపోదు. మా ఉద్యోగులకు మేము సరిపోయే జీతాలు ఇచ్చుకోలేకుండా వున్నాము 24 గంటలు మాముందు నిలబడే ఉద్యోగులకు రూపాయ పెంచాలన్నా మాదగ్గర డబ్బులేకుండా వున్నది అని చెప్పి కేంద్రప్రభుత్వాన్ని గట్టిగా ఒత్తిడిచేయడానికి పూనుకొన్నారా? ప్రయత్నం అయినా చేశారా అని నేను అడుగుతూవున్నాను. ఇట్లా డబ్బులేదు, డబ్బులేదు అంటే ఉన్న డబ్బు అంతా ఈరూపములో పోతుంది. మనకు అదనంగా పన్ను వేసుకోలేనిస్థితి వచ్చింది. పన్నులువేయగలస్థితి ఉన్నటువంటి అవకాశాలు కేంద్ర ప్రభుత్వానికి పోతున్నది. గుడ్డలమీద అమ్మకపుపన్నుకూడ కేంద్రప్రభుత్వానికి పొయ్యేటట్లువుంది అని మంత్రిగారు చెప్పబోతున్నారు. అలాంటప్పుడు వచ్చే sources అన్ని కేంద్రప్రభుత్వం చేతిలోపెట్టి, జుట్టు వారిచేతిలోపెట్టి, తోకజాడించినట్లు అయింది మన పని ఇక్కడ. అలాంటి పరిస్థితులు మనకు ఎందుకురావాలి? అలాంటప్పుడు కేంద్రప్రభుత్వం ప్రక్కన ఉంటేటటువంటి, కేంద్రప్రభుత్వ ఉద్యోగి ఒక postman 90 రూపాయల జీతం తీసుకొంటున్నప్పుడు graduate అయిన అతనికి 80 రూపాయలుకూడా ఇవ్వకుండా ఇబ్బంది పెట్టుతున్నారంటే, అది సబబా అని నేను ప్రశ్నిస్తున్నాను. అసలు చిక్కుగలిగించింది ఎవరు? కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలతో సంప్రదించే pay commission రిపోర్టు publish చేసింది. Karant గారు ఆనాడు మద్రాసుప్రభుత్వంతరపున దాంట్లోవెళ్లి పాల్గొని తన యొక్క అభిప్రాయం చెప్పారు. దానిని ఆధారంగాచేసుకొని మీ ఉద్యోగుల

వాండ్లమీద తగినంత భారం మోపడంలేదనే గోపాలరెడ్డిగారిమీద మావిమర్శన. మోపి చూడమనండి. ఎంతడబ్బు వస్తుందో ఆనాడు తేలుతుంది. అంతేకాదు కేంద్ర ప్రభుత్వానికిగూడా డబ్బు ఎక్కడనుంచి వస్తుందని మరొక విషయంతెచ్చారు. 20 కోట్లరూపాయలు tobacco tax, దానిమీద excise duty మన రాష్ట్రంనుంచి పోతుంది. వేరుసెనగనుంచి ఎంతపోతున్నదో తెలియదు. మొత్తం మనరాష్ట్రంనుంచి 30 కోట్లరూపాయలు కేంద్రప్రభుత్వానికి పోతూవున్నది. ఆలా పోతూవున్నపుడు కేంద్ర ప్రభుత్వంపెట్టిన scales వుద్యోగులకు అమలుజరుపుకోవలెనంటే మీకుచేత కాకుండా వుంది. పోనీ మాకువచ్చే ఆదాయాన్ని అంతా మీరే తీసుకొని, ఆ ఉద్యోగాల scales కు, మాకు కావలసినడబ్బు మాకు ఇచ్చి మాజీవితం నడిపించండి అని చెప్పడ మైనా మంచిది. లేకపోయినట్లయితే మాకు న్యాయంగా రావలసిన భాగాన్ని మనకు పెట్టమని చెప్పండి. 30 కోట్లరూపాయలు తీసుకొనిపోతూ మనకు ఇస్తున్నది ఎంత? పంచవర్ష ప్రణాళికకు ఇస్తున్నాముఅంటే, అందరికి ఇస్తున్నారు. అది వేరేవిషయం, కాని మొన్న మొన్నటివరకుకూడ ఇచ్చింది ఎంత ? Excise duty లో నుంచి మనకు వచ్చింది ఎంత ? ఈరోజు మనకు అది అంతా సరిపోదు. మా ఉద్యోగులకు మేము సరిపోయే జీతాలు ఇచ్చుకోకుండా వున్నాము. 24 గంటలు మాముందు నిలబడే ఉద్యోగులకు రూపాయ పెంచాలన్నా మాదగ్గర డబ్బులేకుండా వున్నది అని చెప్పి కేంద్రప్రభుత్వాన్ని గట్టిగా ఒత్తిడిచేయడానికి పూనుకొన్నారా ? ప్రయత్నం అయినా చేశామా అని నేను అడుగుతూవున్నాను. ఇట్లా డబ్బులేదు, డబ్బులేదు అంటే ఉన్న డబ్బు అంతా ఈరూపములో పోపోతుంది. మనకు అదనంగా పన్ను వేసుకోలేనిస్థితి వచ్చింది. పన్నులు వేయగలస్థితి ఉన్నటువంటి అవకాశాలు కేంద్ర ప్రభుత్వానికి పోతున్నది. గడ్డలమీద అమ్మకపు పన్నుకూడ కేంద్రప్రభుత్వానికి పొయ్యేటట్లువుంది, అని మంత్రిగారు చెప్పబోతున్నారు. ఆలాంటప్పుడు వచ్చే sources అన్ని కేంద్రప్రభుత్వం చేతిలోపెట్టి, జుట్టు వారిచేతిలోపెట్టి,తోకజాడించి నట్లు అయింది మన పని యిక్కడ. ఆలాంటి పరిస్థితులు మనకు ఎందుకు రావాలి ? ప్రక్కన ఉండేటటువంటి, కేంద్రప్రభుత్వ ఉద్యోగి ఒక postman 90 రూపాయల జీతం తీసుకొంటున్నప్పుడు graduate అయిన అత నికి 80 రూపాయలుకూడా ఇవ్వకుండా ఇబ్బంది పెట్టుతున్నారంటే, అది సబబా అని నేను ప్రశ్నిస్తున్నాను. అసలు చిక్కుగలిగించింది ఎవరు ? కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలతో సంప్రదించే Pay Commission రిపోర్టు publish చేసింది. Karant గారు ఆనాడు మద్రాసు ప్రభుత్వంతరఫున దాంట్లోవెళ్లి పాల్గొని తన యొక్క అభిప్రాయం చెప్పారు. దానిని ఆధారంగా చేసుకొని మీ ఉద్యోగుల

salaries revise చేయమని ఈరిపోర్టులో వ్రాసివుంది. అందువల్ల Central Pay Commission కేంద్రప్రభుత్వంతో సంప్రతించి వాండ్ల అభిప్రాయాలు పూర్తిగా మన్నించక పోవచ్చును. వాకీప్రకారంగా నడుచుకోవచ్చును అని ఆనాడు ప్రకటించింది. పైన కూర్చొన్న మా కాంగ్రెసుప్రభుత్వమే. అది అమలు జరిపినందుకు మీరు అభినందించకపోయినా మేము అభినందిస్తున్నాము, ఆ కేంద్ర ప్రభుత్వాన్ని. మిమ్ములను కాదు. మీరు ఇక్కడ నిరాకరిస్తున్నారు. దానిని విమర్శిస్తున్నారూకూడా మీరు. ఇది మీరు మరచిపోతూవున్నారు. ఈనాడు అక్కడ కేంద్రప్రభుత్వం అమలు జరిపివేసింది. ఈరోజు మనప్రక్కనవున్న ఉద్యోగుల్లు అడుగుతూ ఉన్నారు. అదే పని చేస్తూవుండే నాకు ఇంత తక్కువజీతం వస్తున్నది, నేను బ్రతుకలేకపోతున్నాను, ఎక్కువచేయమని అడుగుతూఉన్నాడు. దాంట్లో వచ్చే ఇబ్బంది ఏమిటి ? ఎందువల్ల చేయలేకపోతున్నాము ? 2 కోట్లరూపాయలు ఎట్లాగో మనము సంపాదించాలి. అంతేకాదు. మరొకవిషయం గోపాలరెడ్డిగారి దృష్టికి తీసుకొనిరానున్నాను. 47 వ సంవత్సరంలో మద్రాసురాష్ట్రస్థితి అంత అధ్వాన్నముగాలేదు. దాదాపు 40, 50 కోట్లరూపాయలు నిలువధనం ఉండింది. మనయొక్క పరిస్థితి ఇంతకంటె చాల బాగావుంది. ఆనాడైనా మనము ప్రయత్నం చేశామా ? పోలీసువాండ్లకు జీతం ఆనాడు 13 రూపాయలుమాత్రమే ఉండేది. కాశీశ్వరరావుగారికి గుర్తువుందో లేదో ? 48 వ సంవత్సరం వచ్చేసరికి 30 రూపాయలవరకు ఏలా పెరిగింది ? జీతాలు తీసుకోమని సమ్మెచేయడానికి సిద్ధం అయ్యేటప్పటికి, ప్రభుత్వం వణికి, వారికోరిక అంగీకరించాల్సి వచ్చింది. తెలుసునా? అదే పరిస్థితివస్తే తప్పకుండా మీరంతా మార్షించిచేస్తారు. అంతేకాని అక్కడవుండే ఉద్యోగస్తులు N. G. O. లు అంతా మావాండ్లని పైనకూర్చొన్న secretary లు అంతా మీవాండ్లని అనేటటువంటిదృష్టిలో కాదు. అక్కడకూర్చొన్నటువంటి బ్రహ్మయ్యగారి బిడ్డ N. G. O. ఉద్యోగం చేస్తూవుండేటట్లయితే అతనుకూడా నావాడే. అందులో ఏవిధమైన అనుమానం అక్కరలేదు. అదికాదు వుండేటటువంటివిషయం. అసలుప్రభుత్వం తనంతటతాను, ఎక్కడైనాసరే, కేంద్రప్రభుత్వం scales అమలుజరిపిందా ? పోలీసువారు సమ్మెచేసి వారిజీతాలను ఎక్కువచేయించుకోగలిగారు, అదేపరిస్థితి రావాలా ? మనంతట మనం చేసేదానికి ముందుకు రాలేమా ? ఈరోజున కేంద్రప్రభుత్వానికి ఉన్నటువంటి scales కీ, వీటికీవచ్చే వ్యత్యాసాన్ని మీరు ఆలోచించండి. వేమయ్యగారు వివరంగా ఏఏ డిపార్టుమెంటులో ఏలాంటి అన్యాయాలు జరుగుతున్నాయో, అన్ని తీసుకొచ్చి చెప్పారు. కనీసం వారికైనా

అన్యాయాలు జరుగకుండా చేయలేమా? Leave rules అయినా సరిగా అమలు జరిగేటట్లు చేయలేమా? ఈరోజు చూస్తున్నాం. ఏడుగంటలనుంచి 9 గంటల వరకుకూడా కూర్చొని పనిచేస్తున్నారే? Central Pay Commission reportలో 6½ గంటలకన్నా ఎక్కువ పనిచేయించడానికి వీలులేదని చెప్పారు. అయితే వాండ్లచేత ఎన్నిగంటలు పనిచేయిస్తున్నారు? వాండ్లకు remuneration ఏమైనా ఇస్తున్నామా? ఏమికూడా యివ్వకుండా పనిచేయించుకోగలుగుతున్నాం. ఈలాంటి అన్యాయాలు అన్నికూడా ఉన్నాయి. ఈలాంటి అన్యాయాలు పోవాలని తీర్మానాలు తీసుకొనివస్తే, అయ్యయ్యో ఇంత గందరగోళపరిచే తీర్మానమా, ఉపసంహరించుకోండి, బాబూ, అని చెప్పడంలో నాకు అర్థం అగుపడడంలేదు. నిన్న మీపార్టీ మీటింగులో, గోపాలకృష్ణయ్యగారి తీర్మానాన్ని వ్యతిరేకించాలనే నిర్ణయానికి వచ్చారే, ఆదేవిధంగా దీనిని ప్రభుత్వం ఏమైనా ఖచ్చితంగా అమలుజరబడానికి మార్గాలు అన్వేషించవలసిందనే తీర్మానానికి వచ్చినట్లయితే, కాంగ్రెసు శాసనసభ్యులు తమయొక్క కర్తవ్యాన్ని నెరవేర్చినారని అభినందించేవాణ్ణి. కాని అలా జరుగలేదు. మీరు ఆలోచించలేదు. ఆలోచించవలసిన విషయంగా అగుపడనందుకు చాలా విచారిస్తున్నాను. అందువల్ల ఈ సమస్యను, దానియొక్క ప్రాధాన్యతను మాత్రమే మీరు గుర్తించాలని మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఎట్లా అమలుజరపడంఅనేది అందరుకూడా ఆలోచిస్తాం. ఏవిధంగా డబ్బు రాబట్టడం అంతాకూడా ఆలోచిద్దాం. అంతేగాని, వారుచెప్పారు. చల్లపల్లి రాజాగారిమీదనో, హరిశ్చంద్ర ప్రసాదుగారిమీదనో మరి ఎవరిమీదనో ఎక్కువపన్ను వేయవయ్యా అంటే దోపిడిచేస్తున్నారని అంటాడు బ్రహ్మయ్యగారు. నాకేమి అర్థంకావటంలేదు. ఏమైనా దోపిడిచేస్తే గోపాలరెడ్డిగారు అక్కడవుండి తమచట్టాలద్వారా దోపిడీ చేయడానికి అవకాశం ఉన్నదే కాని నేను ఎట్లా ఇక్కడ కూర్చొని దోపిడీచేస్తానో నాకుమాత్రం బోధపడడంలేదు. ఎందుకు ఈరకమైన వ్యాఖ్యానం? అని నేను అడుగుతున్నాను. ఈ విధంగాచెప్పి ప్రజలను ఎంతకాలం మోసంచేయగలరు? కొంతకాలం Electionలో మోసంచేశారు, మీరుకాదు, మీ పత్రికలు. అంతేకాదు. ఎప్పుడూ మీరు మోసంచేయడానికి ప్రయత్నిస్తారు. అలాంటివాటికి దిగబోకండి. ఈరోజు ఏమి చెయ్యాలో తరువాత మార్గాలు ఆలోచిద్దాం. ఒకటి చూడండి. ఈరోజు peon జీతం ఆలోచించండి, 13 మొదలుకొని 24 వరకు మనం ఇస్తున్నాం. కరువుభత్యం 18 రూ. ఇంటిఅద్దె 5 రూ. మొత్తం 41 రూపాయలు వస్తుంది. కేంద్రప్రభుత్వంలో ఇచ్చేది 24 మొదలు 35 రూపాయలవరకు ఉంది. కరువుభత్యం 55 రూ. మొత్తం 79 రూపాయలు వాండ్లు ఇస్తున్నారు.

ఈ విధమైనటువంటి వ్యత్యాసాలు ఇంకా ఉన్నాయి. Lower division clerks విషయం చూడండి. ఇక్కడ కర్నూలులోని Secretariat లోను, అసెంబ్లీ లోను ఉంటున్నవారికి 51-100 రూపాయలు స్కేలు ఇస్తూఉంటే, అదే Lower Division Clerk కు mofussil లో, అంటే విజయవాడలోను, ఏలూరులోను, గుంటూరులోను 45-90 స్కేలు ఇస్తున్నారు. ఈ వ్యత్యాసం చూపించడం ఇలాంటి discrepancies ఉండడం న్యాయమేమో మీరే ఆలోచించండి. ఇవి తొలగించే సంకల్పం ప్రభుత్వానికి లేదు. మన Lower Division Clerk కేంద్రప్రభుత్వ ఉద్యోగస్థులకు పోల్చి చూస్తే, ఇంటి అద్దెతో సహా ఇక్కడ వారికి 80 రూపాయలు వస్తుంది. కేంద్రప్రభుత్వ ఉద్యోగస్థునికి 125 రు. అంటే దాదాపు 50 శాతము ఎక్కువ వస్తుందన్నమాట. తరువాత మన ప్రభుత్వంలోనే upper division clerks విషయం చూడకోండి, ఇక్కడ Secretariat లో 90 రూపాయలు మొదలుకొని 175 వరకు ఇస్తూవుంటే moffusil లో 80 నుంచి 110 వరకు మాత్రమే ఇస్తున్నారు. ఇది చాలా దారుణంగా ఉన్నది. దీన్ని తిరిగి మార్చవలసిన అవసరమున్నదని మంత్రిగారికి మనవి చేస్తున్నాను. మద్రాసు సాంప్రదాయాన్ని ఇక్కడకూడా తెచ్చిపెట్టుకున్నాము. అక్కడ మద్రాసులో Chief Secretary వాళ్లు వారి జీతాలంతా ఎక్కువగా అట్టిపెట్టుకొనేందుకు ఆవిధంగా నిర్ణయించారు. అక్కడ Retrenchment and Re-organization Committee వేసినప్పుడు, peons యొక్క జీతాలు తగ్గించండి, peons సంఖ్య తగ్గించండిగాని మా జీతాలు ముట్టుకోడానికి వీలులేదని చెప్పినటువంటి Chief Secretary మొదలగు వారే mofusil లో ఉండే upper division clerk కు, lower division clerks కు తక్కువ జీతాలు చేసి, మద్రాసులో ఉన్నటువంటివాళ్లకు ఎక్కువ జీతాలు చేసుకొన్నారు. అటువంటి వాటినే మనంకూడ అమలుపరుస్తున్నాము. కనీసం అటువంటివాటిని ఈ నాటికైనా ఎందుకు మార్చడానికి ప్రయత్నించకూడదని ప్రశ్నిస్తున్నాను. నేను చెప్పినదంతా సావధానంగా ఆలోచించమని విజ్ఞప్తి చేస్తున్నాను.

మరొకవిషయం చెప్పుచున్నాను. ఈ ప్రభుత్వ ఉద్యోగస్థులమీద మొత్తం పది కోట్లు పదునొండు లక్షలరూపాయలు మనకు ఖర్చు అవుతున్నది. అందులో ఆఫీసర్లకే 89 లక్షలు ఖర్చుపెడుతున్నాము. Establishment అంటే గుమాస్తాలు మొదలగు వారికోసం అయిదుకోట్లు చిల్లర ఖర్చు అవుతోంది. Allowances and Honoraria క్రింద నాలుగుకోట్లు పండ్రెండు లక్షలు ఖర్చు అవుతోంది. ఇంత

Sri Pillalamarri Venkateswarlu] [24th September 1955

ఏ విధంగా అవుతుంది ? కలెక్టరు రోజూ ప్రయాణంచేస్తూనే ఉంటాడు. ఎప్పుడైనా సరే రెండురోజులు headquarters లో ఉన్నటువంటి కలెక్టరు ఉన్నాడా ? ఏదో ఒక ఊరికి ప్రయాణము చేసుకొంటూ ఉంటారు. కనుక వీరి Travelling Allowances ఇదంతా కలిసి మొత్తం ఒక ముద్దగా తీసుకువచ్చి 4 కోట్లు, 12 లక్షలు Allowances and honoraria క్రింద చూపిస్తున్నారు. దీంట్లో 2 కోట్ల పై చిల్లర పెద్ద ఉద్యోగస్థులకే ఖర్చు అవుతున్నట్లు తెలుస్తున్నది. ఈ మిగిలిందికూడ N.G.O. లకే ఖర్చు అవుతుందనుకోడానికి వీలులేదు. దీంట్లోనే village establishment కు కోటిరూపాయలు ఖర్చు అవుతుంది. ఈ విధంగా లెక్కలు తీసుకున్నప్పుడు, ఒక విషయం స్పష్టంగా బోధపడుతుంది. అది వీరికి చాలా తక్కువగా వస్తుందని అటువంటప్పుడు వీరికి జీతాలుగాని allowances గాని ఎక్కువ చేయడానికి వీలున్నదా లేదా అని ఆలోచిస్తే నిజంగా, మనస్ఫూర్తిగా చేయడానికి పూనుకొన్నట్లయితే చేయవచ్చు అని చెప్పుచున్నాను. 1946 లోనే మద్రాసు అసెంబ్లీలో Retrenchment and Reorganization Committee ఒకటి ఏర్పాటు చేశారు. వాళ్లు చిన్న చిన్న ఉద్యోగస్థులకు నష్టదాయకంగా సూచనలు చేశారు. అందువల్ల అప్పుడు ఆ సూచనలను ఆమోదించ కూడదనే అభిప్రాయానికి వచ్చాము. వాళ్లు చిన్న చిన్న ఉద్యోగస్థులకు జీతాలు తగ్గించడానికి సూచించారు, కాని Chief Secretary యొక్క జీతము తగ్గించడానికి, departments యొక్క సంఖ్య తగ్గించడానికి అంగీకరించేటటువంటి సాహసం పోలేదు. కాని దాంట్లో వారు కొన్నికొన్ని సూచనలుచేశారు. వాటిని మీ దృష్టికి తెస్తున్నాను. వాటివల్ల administration లో కొంత ఖర్చు తగ్గుతుంది. Board of Revenue గురించి, ఇది అనవసరమని ప్రతివాళ్లు చెప్పుతూనే ఉన్నారు. ఈ Board of Revenue ఎప్పుడో 1917 లోనో 1918 లోనో వచ్చింది. ఆనాడు ఇన్ని డిపార్టుమెంట్సు లేవు. ఇంతమంది మంత్రులు లేరు. ఇవన్ని ముగ్గురు నల్గురు చేతులలో కేంద్రీకరింపబడినటువంటి రోజులవి. ఈ నాడేమిటి? Departmental Heads ను ఇంతమందిని కర్నూలులో చూస్తున్నాము. మద్రాసులో ఇద్దరు బోర్డు సభ్యులు ఉన్నారు. వీళ్లుకాక ఒక్కొక్క డిపార్టుమెంటుకు ఒక మంత్రి ఉంటున్నాడు. తరువాత జిల్లాలలో కలెక్టర్లు, జిల్లా అధికార్లు ఉన్నారు. అసలు ఆ రోజులలోనే ఈ Board of Revenue చాలా అనవసరంగా ఉన్నదని ఆందోళన చేశారు. అప్పటినుంచికూడ ఆందోళన చేస్తున్నప్పటికి, Board of Revenue ను ఎత్తివేయలేకపోయినారు. అసలు revenue set-up నే మార్చవలసిన అవసరం ఉన్నది. దాన్ని మార్చినట్లయితే తప్పకుండా మనకు ఆదాయం

మిగులుతుంది. ఆ రిపోర్టులో చెప్పినవిషయాన్ని మంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తున్నాను.

" To have a more efficient village establishment, it may be necessary to do away with the present system of making appointment on hereditary basis, but a more efficient staff will naturally have to be paid higher scale and if the total will exceed the present scale and the expenditure on the Village Administration the number of posts have to be drastically cut down."

అంటే ఇప్పుడున్నటువంటి village administration వెంటనే effici-ent గా వుండేటట్లుమార్చాలని ఉన్నది. మేముకూడ బడ్జెటులో చెప్పాము, ఈ hereditary system కూడ తీసివేయండని దీనివల్ల వచ్చేలాభంకంటే కష్టము ఎక్కువ వస్తుంది. ఈ report లోనే ఇంకొకచోట ఈవిధంగా చెప్పడం జరిగింది.

" The Board urges that with the present administrative machinery, there is nothing to be gained but a good deal to be lost.

ఆపద్ధతి అట్లే ఉండడమువల్ల, దానినుంచి ఎక్కువనష్టమే వస్తుందిగాని ఏమాత్రం లాభములేదు. అని దాంట్లో చెప్పబడింది అందువల్ల ఏమాత్రం లాభంలేనటువంటి, కేవలం నిరుపయోగంగా ఉన్నటువంటి ఆ Board of Revenue ఎందుకు ఉండాలి అని అడుగుతున్నాను. అసలు ఈ administrative set-up ను ఎందువల్ల మార్చకూడదు? మనము ఇప్పుడు అధికారములోకి వచ్చాముకదా! ఎందుకు ఆవిధంగా చేయకూడదు? మనకు స్వయంగా ఆలోచించేటటువంటిశక్తి సామర్థ్యములు లేవా? లేవు అంటే నేను ఒప్పుకోను, కాని చేయడానికి నిరాకరిస్తున్నాము. పాతపద్ధతులను మార్చడానికి మనం నిరాకరిస్తున్నాము. అంతకంటే వేరుకారణంలేదని చెప్పుతున్నాను. అందువల్ల ఈ administrative set-upను మార్చినట్లయితే, కొంతఆదాయంకూడ మిగులుతుంది. ఆరిపోర్టులో ఆలెక్కలుకూడ ఇవ్వబడినాయి. అవికూడ చూడండి. Sales tax విషయం చూసుకోండి. పట్టాభిరామరావుగారు మంత్రిగా ఉన్నప్పుడే

చెప్పారు. Sales tax నుంచి మనకు రావలసిన మొత్తంలో 2 కోట్లురూపాయలు రావడంలేదని Revenue Board కు అధికారమున్నదికదా, అటువంటప్పుడు, పోయే టటువంటి ఈ రెండుకోట్ల రూపాయలను రాబట్టుకోడానికి ఏమైనా చేయగలుగు తున్నదా ? ఈ Revenue Board, ఈ కలెక్టర్లు ఈవిధంగా వున్నంతకాలము, వాళ్లు చేయగలిగింది ఏమీలేదని స్పష్టంగా అర్థంచేసుకోవలసి వస్తుంది. ఈరెండుకోట్ల రూపాయలను రాబట్టమనండి. ఈవేళ వారిజీతాలు పెంచేమార్గం చూపిస్తాము. వ్యాపా రస్థులు మన చేతిలోనుంచి, ప్రజలదగ్గరనుంచి గోళ్లూడగొట్టి వసూలుచేస్తూంటే sales tax ను కాజేస్తూవుంటే, దాన్నిపట్టుకోడానికి చేతగాక, ఏదైనా చేయమంటే, అయ్యయ్యో డబ్బు ఎక్కడఉంది, మాకు డబ్బు ఎక్కడనుంచి వస్తుందని ప్రశ్నలు వేస్తారా ! ఎందువల్ల మనకు రావలసినటువంటి ఈ sales tax పోకుండా అరికట్ట డానికి ప్రయత్నంచేయరు ? పట్టాభిరామరావుగారిని explanation అడగండి. మంత్రిగావుండి ఏవిధంగా, ఎందువల్ల ఇట్లుచెప్పారో అయనచెప్పడమేకాదు, మాకు తెలుసు. ఏకోమటి దుకాణములోకిపోయినా, ఏ shop కు పోయినా ఖచ్చి తంగా sales tax తీసుకొంటారు. ఈవిధంగా మనకు రాకుండా పోతున్నటు వంటి రెండుకోట్ల రూపాయలను పట్టుకోవడానికి సాధ్యంకాకపోదు అనేది మీ దృష్టికి తీసుకొనివస్తున్నాను. కనుక ఇటువంటి లోపాలు మనము చూస్తున్నప్పుడు, అసలు ఈ administrative set-up ను మారిస్తేగాని ఏది అమలుపరచడం కష్టమనేటటువంటి విషయాన్ని మంత్రిగారిదృష్టికి తీసుకువస్తున్నాను.

తరువాత, minimum వేతనము విషయములో, ఒకసంగతి చెప్పదలచాను. ఆసలు జీతాలు ఎందుకు పెంచాలి ? చాలామంది తిండితిప్పలు లేకుండా మాడుతు న్నారే ! పూరిగుడిసెలలో వుంటున్నారే ! వీరిజీతాలే ఎందువల్ల పెంచవలసిన అవ సరము వున్నది? అనేటటువంటి ప్రశ్నవున్నది. ఇది నేనుచెప్పింది కాదుసుమా! లక్ష్మణదాసుగారిని, మిమ్ములనందరిని, యీరిపోర్టును శ్రద్ధగా చదువమని నేను కోరు తున్నాను. ఈ కమిటీకి అధ్యక్షత వహించినవారు, గాడ్గిల్ గారు. పెద్దపెద్ద ఆర్థిక వేత్తలు వీరందరుకూడా చెప్పినమాటలు అన్నీ దృష్టిలోపెట్టుకోమని అన్నాను. “ There should be a model employer ” అని చెప్పారు. చుట్టుప్రక్కల అనేకచోట్లలో minimum wages fix చేయాలి, minimum wages fixa- tion అమలు జరపాలని కోరుతున్నారు. పరిశ్రమలలో ఎక్కువజీతాలు యిప్పించా లని దెబ్బలాడుతున్నాము. జీతాలు పెంచటానికి వారి అందరితరఫున Trade Union లాంటిది ఒకటి ఏర్పాటుచేసి, దానిద్వారా ఆందోళన చేస్తున్నారు. కాని

ఆచరణలో పెట్టాలని అన్నప్పుడు ప్రభుత్వ ఉద్యోగస్థులకు మీరు సరియైన జీతాలు యివ్వటానికి నిరాకరించినట్లయితే, మిగిలినవారికి ఎక్కువ యివ్వమనిచెప్పబోయే టప్పుడు మీరు యేదృష్టితో చెప్పగలరు ? ప్రక్కనవున్న వుయ్యూరు సుగరు ఫాక్టరీ మేనేజరువున్నారు. జీతాలు ఎక్కువ యివ్వమని మీరు ఏ ధైర్యముతో వారివద్దకు పోయిచెప్పగలుగుతున్నారు ? మీ peons కు కనీసజీతము 18 రూపాయలుయిస్తూ, 30 రూపాయలు యివ్వాలని చెప్పటానికి మీకు దమ్ము ఎట్లా వుంటుంది ? దీని అడుగుతున్నాను. కేంద్రప్రభుత్వమువారు చేసిన సిఫార్సులు అమలుజరపటానికి మీరు నిరాకరిస్తూ, మీప్రభుత్వములో పనిచేసే peons కు కనీసజీతము 30 రూపాయలు యివ్వటానికి నిరాకరించి, private individuals వద్దకుపోయి యింతయివ్వండి అనిచెప్పి యిప్పించటానికి సాధ్యమవుతుందా? ధైర్యమువుంటుందా? మీకు సాహసం వుంటుందా? ఇది, ఏదీకూడా వుండదు. ఎప్పుడైతే మీప్రభుత్వోద్యోగులకు కనీస జీతము (minimum wages) యిస్తారో, దాన్నిబట్టి వారుకూడా యివ్వటానికి వీలు అవుతుంది. ఈనాడు Central Pay Commission వారు నిర్ణయించిన ప్రకారము యివ్వకుండా, వారిసిఫార్సులను మీరు గాలికితోలినట్లు కనబడుతున్నది. ఒక మనిషి బ్రతకటానికి కనీసము ఎంతజీతము అవసరమో మీరు ఆలోచించిచెప్పండి. ఈనాటి పరిస్థితులనుబట్టి ఒకమనిషి నిలబడి పనిచేయటానికి ఎంత కనీసవేతనము అవసరము అనేదాన్ని లెక్కకట్టి, అంచనాలువేసుకొని యిచ్చిన రిపోర్టు అది. ఏమనిషికి అయినాసరే కనీసము 30 రూపాయలకు తక్కువలేకుండా జీతమువుండాలి. మన యొక్క cost of living నూటికి 280 వున్నప్పుడు, కనీసము ముగ్గురుగలిగిన కుటుంబానికి, 55 రూపాయలు అయినావుండాలని లెక్కలుకట్టి, నిర్ణయించి చెప్పారు. 30 రూపాయలు జీతముఅని, 25 రూపాయలు కరువుభత్యము అని, ఆపైన పెరిగినదానికంతాకూడా ప్రతి 20 పాయింట్లకుకూడా పదిరూపాయలు చొప్పున కరువుభత్యము పెంచాలనీ, ఎందువల్ల వారి రిపోర్టులో సిఫార్సుచేశారు? ఎందువల్ల మీరు యీ సిఫార్సులు అమలుజరపటానికి నిరాకరిస్తున్నారు ? ఆచరణయోగ్యము కాదనిఅంటే, మిగతా రాష్ట్రములలో వాటిని ఏవిధంగా ఆచరణలో పెట్టారు ? కనీసము మనప్రక్కన వున్న హైదరాబాదులో యిచ్చే wages కన్నాకూడా మనము ఎక్కువ యివ్వలేకపోతున్నామే ? నేను ప్రభుత్వాన్ని ఒకేఒక ప్రశ్న అడుగుతున్నాను. 1946 లోగాని, 1947 లోగాని వుపాధ్యాయులకు జీతములో ఒక్క రూపాయి ఎక్కువచేయండి అని ప్రకాశంపంతులుగారిని అడిగితే, నాయనో! ఒక్క రూపాయి ఎక్కువచేస్తే యిన్ని లక్షలరూపాయలు అవుతుందే, అని సాధ్యము కాదు అని అన్నారు. కాని పోలీసువారికిమాత్రం, వారు సమ్మెచేసికూర్చుని,

యిస్తావా, యివ్వవా అని మెడమీద కూర్చుంటే, అప్పుడు తప్పనిసరిగా హెచ్చు చేశారు యీ గోపాలరెడ్డిగారు. ఎందువల్ల ? జీతము పెంచమని ఎప్పుడు అడిగినా సరే, డబ్బు ఏది అని లోటుబడ్జటు చూపిస్తారు. ఇది అంతాకూడా మన దేశముయొక్క అభివృద్ధిలో ఒకభాగమేనని మరచిపోగూడదు. పంచవర్ష ప్రణాళికలో ఏమిచెబుతున్నాము? ఇప్పటికి మన ఆదాయము 20 వంతులు పెరిగిందని లెక్కలు వేస్తున్నాము. ఏది ? ఆ ఇరవై వంతులు పెరిగినట్లు వారిజీతములో చూపించమనండి. వారి జీతాల్లోమాత్రము పెరగవలసిన అవసరములేదా ? ఈనాడు దేశముయొక్క ఆదాయము పెరిగిందంటే వ్యవసాయకూలీలకు యిచ్చేకూలి పెరిగితేకూడా ఆ వ్యవసాయ కూలీలు సంతోషిస్తారా? లేకపోతే యిప్పుడుకూర్చునివున్న కొద్దిమంది జమీందార్లకు పెద్ద పెద్ద భూస్వాములకు, పెద్దపెద్ద కోటీశ్వరులకు ఆదాయము పెరిగింది అన్నంత మాత్రాన, వ్యవసాయకూలీగూడా ఆహా! హా! నా ఆదాయముకూడా పెరిగింది అని సంతోషిస్తాడా? ఏది సాధ్యము ? ఏది అసాధ్యము ? అందువల్ల మనము ఈరోజున ఆవిషయము ఆలోచించుకున్నప్పుడు, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, వచ్చే అయిదు సంవత్సరాలలోనూ నూటికి 25 వంతులు మనదేశముయొక్క ఆదాయము పెరగబోతున్నది అని చెబుతున్నాము. దేశముయొక్క ఆదాయము పెరిగింది అని అన్నప్పుడు కేవలం యేకొద్దిమంది కోటీశ్వరులో, జమీందారులో, వ్యాపారస్థులో, పెట్టుబడిదారులో దేశముయొక్క ఆదాయము పెరిగిందని సంతోషించమని అంటే, ప్రతివాడూ సంతోషించగలుగుతారా ? నూటికి 25 వంతులు ఆదాయయ పెరిగిందని అన్నప్పుడు, ప్రభుత్వోద్యోగి ఏమని ఆలోచించుకుంటాడు. అంటే, నా ఆదాయము కూడా పెరిగిందా ? లేదా ? నాకుగూడా నూటికి 25 వంతులు రాబోయే అయిదు సంవత్సరాలు అయినతరువాత నా ఆదాయములో ఏమైనా మిగులుతుందా, లేదా ? అని ఆయన ఆలోచించుకోవడము తప్పా అని నేను ప్రశ్నిస్తున్నాను. అందువల్ల యివన్నీకూడా ఆలోచించినప్పుడు, వేమయ్యగారు తెచ్చిన తీర్మానము ఖచితముగా చాలా సబబైన తీర్మానమని అంటున్నాను. ఆసిఫార్సులు "ఆచరణ యోగ్యముకాదు." అని చెప్పడము పొరబాటు. ఒక్కవిషయము ప్రభుత్వముదృష్టికి తెస్తున్నాను. ఈ Central Pay Commission report లో పెద్ద పెద్ద ఉద్యోగస్థుల జీతము ఎంతవుండాలి అనేదికూడా నిర్ణయించడము జరిగింది. యూనివర్సిటీలలో పనిచేసే professor కు ఎంతజీతము యిస్తున్నాము? మన రెవిన్యూబోర్డుమెంబర్లకు ఎంతయిస్తున్నాము! Professors కు lecturers కు readers కు 8 వందలు మొదలు 12 వందలవఱకూ యిస్తున్నాము. ఇక్కడ వీరికో

3,200 లు వరకు యిస్తున్నాము. రెవిన్యూబోర్డుమెంబర్లకు జీతము ఎందువల్ల తగ్గించకూడదు ? అదేవిధంగా I. A. S. ఆఫీసర్లకు 1800 లు మొదలు 2,200 రూపాయిల వరకూ కూడా యిస్తున్నాము. వారు మాత్రము ఏదో వున్నతవిద్య అభ్యసించిన వారు. ప్రపంచములో ఎంతోమందియొక్క మన్ననలను పొందినవారు. వారు 1200 రూపాయలకు పనిచేయటానికి సిద్ధంగావున్నారు. మన ప్రభుత్వోద్యోగస్థులకు మనము అంతమాత్రము నచ్చచెప్పుకోలేమా ? గోపాలరెడ్డిగారు అనేకసార్లు చెప్పారు. ఏమిటంటే కలెక్టర్లు మనస్టేటులో చాలా బాధపడుచున్నారు. వారికి యే కొద్దిపాటి సౌకర్యాలుఅయినా చేయాలి. అని వారికి వెయ్యిరూపాయలో ఎంతో శాంక్షనుచేశారు. గోపాలరెడ్డిగారిదృష్టి ఎంతసేపటికి ఎటువైపునవున్నదో మీకు చెప్పటానికే యిప్పుడు ఆ విషయము మీ కందరికి దృష్టికి తీసుకుని వస్తున్నాను. పెద్ద పెద్ద ఉద్యోగస్థులజీతాలు ఎంతతగ్గిస్తే మంచిదో వారిని అడిగించండి? Allowance కూడా ఎంతతగ్గిస్తే మంచిదో అడిగించండి. ఈనాడు వారి ప్రయాణపు ఖర్చులుకూడా తగ్గించండి. ఆ విధంగా తగ్గిస్తే, కనీసము ప్రభుత్వానికి ఒకకోటి రూపాయలవరకు మిగులుతుందిగదా. వారి ఎలవెన్సులక్రింద కనీసము మూడుకోట్ల రూపాయలు అయినాపోతున్నదిగదా. వారి జీతాలలో కొంతభాగముతగ్గిస్తే ఎంత మిగులుతుందో లెక్కకట్టండి. ఆ లెక్కలు సేకరించడము మన Chief Secretary గారికి ఒప్పచెప్పితే, వారు చెప్పరు. ఎందుకంటే వారి జీతాలు తగ్గిపోతాయని వారు సరీగా లెక్కలు చెప్పరు. వారికి యిష్టమువుండదు గనుక, మనకు సరియైన లెక్కలురావు. ఈ సంగతివారికి అప్పచెప్పితే యీ లెక్కల సేకరణ సరిగా జరుగుతుందనుకోవడము పొరపాటు. జీతాలు, ఎలవెన్సులు, ప్రయాణపుఖర్చులు తగ్గించటానికి వారు ఎన్నడూ ఒప్పుకోరు. మంత్రుల జీతాలు 500 వందలు తీసుకోమని యీ శాసనసభ తీర్మానించితే, అయ్యయో, అని గోలపెట్టి ఆమరునాడే ఆ తీర్మానము మార్పించుకున్నారే మరల యథాప్రకారము వెయ్యిరూపాయలు ప్రకారము జీతాలు తీసుకుంటూన్నారే ఈ సంగతి మనకందరికి తెలిసినదేనే. అలాంటప్పుడు సెక్రటరీలు వారి జీతాలు ఎలవన్సులు తగ్గించుకోటానికి వారంతట వారు అంగీకరిస్తారా ? అలాంటివి జరుగవు. ఇదంతా settle చేయటానికి ప్రత్యేకంగా ఒక non-official committee ని వేయాలి. Policies settle చేయాలి. ఆ policy ప్రకారము అమలులోకితెస్తే అప్పుడు యిది సాధ్యపడుతుంది. అందువల్ల ముఖ్యంగా యీ పెద్ద పెద్ద ఉద్యోగస్థుల జీతాలు తగ్గించటానికి ప్రయత్నిస్తే యిది సాధ్యపడుతుందన్నే సంగతి మరచిపోగూడదు. ఈ విషయము మీ దృష్టికితెస్తున్నాను..

వేమయ్యగారు మరొకవిషయము తీసుకొనివచ్చి చెప్పారు. ఆ details లోకి మనము యిప్పుడు మరల పోనక్కరలేదు. Seniority, promotion, merit లు అనేవిషయము చాలా ముఖ్యమైన విషయములు. ఇప్పటివరకూకూడా ప్రభుత్వోద్యోగస్థులలో, యీ seniority, merit అనే సాకుతో చాలామంది seniors ను discourage చేసి, Juniors కు ప్రమోషన్లు యిస్తున్నారు. ఈ policy వల్ల చాలామంది ఉద్యోగస్థులు చాలా బాధపడుచున్నారు. చాలా అన్యాయము, అక్రమము జరుగుచున్నది. ఈ విషయము ఎవరూ కాదనలేరు. అనేక విషయాలలో యీ విధంగా అక్రమాలు జరుగుచున్నవని ప్రశ్నల సందర్భములో వచ్చింది. మంత్రిగారు యీ విషయము బహిరంగముగా అంగీకరించకపోయినా యీ విధంగా అనేకచోట్ల అన్యాయము జరుగుచున్నదని తేలింది. సాధారణముగా seniority అనేదాన్ని ప్రధానంగా తీసుకొని ఉద్యోగస్థులకు న్యాయముగా ప్రమోషన్సు యివ్వడములేదు. ఈ అన్యాయాలవల్ల చాలామంది హరిజనులకు ప్రమోషన్సు దొరకటంలేదు. ఒక senior ఉద్యోగికి ప్రమోషను న్యాయముగా రావలసివుంటే, junior గా వున్నవాడికి merit అనే సాకుతో ప్రమోషను కట్టబెట్టాలనివుంటే, ఉద్యోగస్థులలో నిరసనయెందుకు ఏర్పడదు ? ఈవిషయము మంత్రిగారి దృష్టికితెచ్చి, ఆ తరువాతనే, అది సర్దుబాటుచేయాలి. నిజంగా senior ఉద్యోగి అయినప్పుడు, ఆయనలో ఏదైనా బ్రహ్మాండమైన లోటుఉంటే, ఆ విషయము ఆయనకు తెలియజేయాలికాని, సాధారణ పరిస్థితులలో senior గా వున్న ఆయననుక్రిందికినెట్టి క్రిందివారిని పైకివెయ్యడము అన్యాయముచేసినట్లుకాదా ? ఇటువంటివి చేయడమువల్ల ఉద్యోగస్థులులో అపోహాలు ఏర్పడినవి. అందువల్ల యీ విషయములో seniority ని ముఖ్యంగా గమనించి ప్రమోషను యివ్వాలి అని అంటున్నాను.

తరువాత confidential files విషయము తీసుకోండి. ఈ Confidential files వల్ల చాలామంది ఉద్యోగస్థులు అక్రమాలు, అన్యాయాలకు లోనగుచున్నారు. గోపాలరెడ్డిగారిని, యీ ఫైల్సుతో అవసరములేదు, వీటిని తీసివేయండి అని కోరితే, అదిమాచియా ! దానివల్ల భయపడడము ఎందుకు ? అది వుండడము మంచిదేనని అన్నారు. ఈ files తీసివేయటానికి అందరు ఒప్పుకుంటారు. ఈ files వల్ల చాలామంది తెలియకుండా ప్రమోషన్సు లభించక నష్టపడుతున్నారు. ఈ Files లో ఒక్కొక్క వుద్యోగస్థునిమీద వారిపై అధికారివ్రాస్తూవుంటారు. Head clerk మీద తహశీల్దారు, తహశీల్దారుమీద డిప్యూటికలెక్టరు, లేకపోతే

Sub_Collector మీద కలెక్టరు, వీరందరిమీద పోలీసు C. I. D. రిపోర్టర్లు-యీ విధంగా ఒకరిమీద నొకరు దొంతరదొంతర్లుగా వున్నారు. ఈ విధంగా వుంటుంటే, యేమి జరుగుచున్నదో చూడండి. అంటే గోపాలరెడ్డిగారి దృష్టిలో పై అధికార్లందరు పత్తిత్తులని, క్రింది వారందరు దుర్మార్గులని వున్నది. ఇటువంటి అభిప్రాయము ఎందుకు కలగాలి ? ఏ ఉద్యోగి అయినా ఒక తప్పుచేస్తే, అతనికి "నీవు ఫలానా తప్పుచేశావు, నీవు సరిదిద్దుకో" అని తెలియపరిస్తే, ఆ తప్పును సవరించుకోటానికి ప్రభుత్వము అవకాశము యివ్వాలి. ఆ తప్పు తెలియగానే, అతను rectify చేసుకుంటాడు. ప్రభుత్వము యీ విధంగా ఎందుకు చేయకూడదు ? ఈనాటివరకు యీ confidential files వుండడమువల్ల పై ఉద్యోగస్థులుకంటె క్రింద ఉద్యోగస్థులు నిజంగా న్యాయముగా పనిచేస్తున్నప్పటికిని, అతనిజీవితము పాడుచేయాలంటే ఏదో ఎర్రపెన్సిలుతో ఒక గీటుపెట్టితే చాలు. అంతటితో అతనిజీవితము finish అయిపోయినట్లే కదా ! ఒకవేళ ఏ ఉద్యోగిఅయినా దేశద్రోహకరమైన పనులు చేస్తూంటే, అతనికి ఆ విషయము తెలియజేసి, explanation లో తీసుకొని, విచారించి, అతనిని వెంటనే dismiss చేయండి. నిజానికి అటువంటివాడు సర్వీసులో ఉండకూడదు. సర్వీసునుంచి dismiss చేసివేస్తే పోతుందిగదా ! దేశమును యితర దేశస్థులకు కట్టిపెట్టే చర్యలుచేస్తే, అటువంటివాడు service లో ఎందుకు వుండాలి ? అటువంటివాడిని dismiss చేసినా ఎవరూ కాదనరు. మాకుకూడా యిష్టమే. అభ్యంతరము చెప్పము. నేను చెప్పేది యేమిటంటే, యీ confidential files వల్ల, చాలామంది జీవితాలు నాశనము కావడమే కాకుండా, అతను rectify చేసుకుంటానికిగూడా అవకాశము యివ్వకుండా, వారిజీవితాలను నాశనముచేసిన ఘట్టనలు అనేకము వున్నవి. అందువల్ల యీ confidential files తీసివేయాలని అంటున్నాను. ఇంకను ఏ ఉద్యోగి అయినా corrupt అని తోచినప్పుడు, అది ఋజువు అయితే అతనికి తెలియజేసి, punish చేయండి. ఈనాడు పెద్దపెద్ద ఉద్యోగస్థులే corrupt గా వుంటున్నారే. అటువంటివి అనేక ఘటనలువున్నవే ; అటువంటి వారిమీద యీ చిన్నచిన్న ఉద్యోగస్థులు పైవారికి చెబుతారని వారిమీద confidential reports వ్రాసి జీవితాలను నాశనముచేసిన ఘటనలు అనేకము లున్నవి. జీతాలు తగినంతగా యిస్తే corrupt practices ఎందుకు అవలంబిస్తాడు ? ఈ లోపము ప్రభుత్వానిదే అని అంటున్నాను.

తరువాత ఉద్యోగస్థులలో temporary అని permanent అనిఅంటున్నారు. ఏ ఉద్యోగి అయినా అయిదు సంవత్సరాలు service చేయనిదే పర్మనెంటు చేయకూడదు అని మంత్రివర్గము నిర్ణయించింది అని అంటున్నారు.

THE HON. SRI B. GOPALA REDDI :—మామూలుగా.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మామూలుగా అంటే కొన్ని పరిస్థితులలో పర్మనెంటు చేయకపోవడముకూడా వుండవచ్చు, అని దీని అర్థము. గనుక యీ అయిదు సంవత్సరాలు service చేస్తేనే సాధారణముగా పర్మనెంటు చేస్తారు. Pay Commission Report లో ఏమి వ్రాశారు ? ఆ రిపోర్టు మంత్రిగారికి చూపిస్తే, తనకు మంచిదని తోచినవి మంచివని, మిగిలిన సిఫార్సులు అన్ని చెత్త అని త్రోసివేస్తే త్రోసివేయమనండి. ఒక సంవత్సరము సర్వీసుచేస్తే పర్మనెంటుచేయడము న్యాయము. కనీసము యీ point మీదనైనా మంత్రిగారు ఒప్పుకొని ఆవిధంగా చేస్తారని ఆశిస్తున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI:—Central Pay Commission కు, యీ ప్రభుత్వానికి ఏలాంటి సంబంధము లేదు. అది Government of India వారికి సంబంధించింది. ఆ రిపోర్టుతో మాకేమి సంబంధము ?

SRI PILLALAMARRI VENKATESWARLU:—Central Pay Commission report గోపాలరెడ్డిగారినిగాని, రాష్ట్ర ప్రభుత్వాన్నిగాని bind చేస్తుంది. అది అమలు జరపాలి అని నేను చెప్పినానా ? లేదు. అది వారిమీద binding కానేకాదు. అసలు ఒక రిపోర్టుమాత్రము మంత్రులను బైండుచేసిందా ? మీరువేసిన కమిటీవారి రిపోర్టె, మీమీద binding కాదు అని చెప్పారు. క్రిందటి ప్రభుత్వంచేసిన తీర్మానము యీ ప్రభుత్వాన్ని bind చేయనప్పుడు, గత మంత్రివర్గము చేసిన నిర్ణయము యీ ప్రభుత్వాన్ని bind చేయనప్పుడు, యిదిమాత్రము bind చేస్తుందని చెప్పటానికి నేను అంత తెలివితక్కువ వాడిని కాదుగదా ? అందువల్ల యీరిపోర్టులో 72, 3 పేజీలలో దీన్నిగురించి చాలా వివరంగావున్నది. దాన్ని కూడా కొద్దిగా మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. అందులో చెప్పింది యేమిటంటే, ఏ ఉద్యోగి అయినా కనీసము ఒక సంవత్సరము అయినా పనిచేస్తే, అతనిని తప్పకుండా పర్మనెంటు చేయాలని వున్నది. అలాంటప్పుడు అయిదు సంవత్సరాలు పని చేస్తేగాని పర్మనెంటు చేయమని అంటున్నారు. ఇంత దీర్ఘకాల పరిమితి ఎందుకో తెలియదు. ఈ లోపల ఆ ఉద్యోగస్థుని confidential file లో ఒక ఎర్ర పెన్సిలు గీటు పెట్టితే అంతటితో అతని జీవితము finish అయిపోతుంది. ఆ మీదట యింటికి వెళ్లిపోతాడు. ఈ విధంగా చేయుటయు పై అధికారికి ఆస్కారము యిచ్చినట్లేగదా.

"The evidence placed before us disclosed that in some departments public servants remained temporary for all their life-time. This has nothing to do with emergencies or projects. We were also informed that in some departments there has long persisted a practice of discharging a whole mass of employees on the 31st March and re-employing them on the 1st April every year. Whatever may be the reason or justification for such conditions, we think it high time that this state of things is remedied."

ఇది Highways Department లో యిప్పటికీ వుందని నేను చెప్పాను గదా! గోపాలరెడ్డిగారికి అన్ని డిపార్టుమెంట్లు సంగతి తెలియకపోవచ్చు. నాకు మాత్రము బాగా తెలుసు. మొన్ననే ఒక conference ఏర్పాటుచేసి అందులో యీ విషయమునుగూర్చి చర్చించాము. మరల చర్చించబోతున్నాము. ఇప్పటికి 31 వ తేది యింకా నాలుగు రోజులువున్నది. ఆ పైన యింకొక 4 రోజులు ఆలస్యము కావచ్చు.

AN HON. MEMBER: Is there no time-limit for these speeches, Sir?

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఇక్కడ యింకొక విషయము చెబుతాను.

"It seems to us sufficient to provide that after a certain length of service, say one year, even a temporary employee should be entitled to most of the privileges of a permanent employee in the matter of earned leave, medical aid, provident fund, special allowances like house-rent, compensatory allowance, electricity, water-supply, etc." అని ఉంది

అందువల్ల దీనిలో యింత వివరముగా చెప్పబడివున్నది. ఇవన్నీ మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను. వేమయ్యగారు చేసిన సూచనలు అన్ని అంగీకరించటానికి వీలు వున్నది కాబట్టి, వారియొక్క leave rules గురించి వెంటనే మార్పుచేయాలని మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu] [24th September 1955

ఈ Central Pay Commission report ను అమలు జరపటము కష్టసాధ్యము కాదు. ప్రభుత్వమువారు నిజంగా మనస్సు పెట్టుకొని అమలు జరపటానికి ప్రయత్నిస్తే, తప్పకుండా అమలు పెట్టవచ్చు. అమలు జరపటానికి వీలు కాదు అనుకుంటే, at least let the Government begin to increcae:the salaries of the N, G. Os. ఈ విషయములో మంత్రిగారు శ్రద్ధతీసుకుంటారని ఆశిస్తున్నాను. నేను కోరేదల్లా, వారు సహృదయముతో యివన్నీ పరిశీలించాలనే. వారి హృదయములో యీ N.G.O. లు అందరు యిమిడివున్నారు కాని, వారికి సహాయము చేయటానికి మాత్రము వీలుకాదని చెబుతున్నారు. అలా కాకుండా యెంతవరకు చేయటానికి వీలుంటుందో అంతవరకయినా చేయటానికి ఆలోచించమని కోరుతున్నాను. జీతాలు పెంచడానికి డబ్బులేదంటే, డబ్బు ఏ విధంగా వస్తుందో, దానికి సూత్రాలు కనిపెట్టటానికి మనం మందరము సమావేశమై ఆలోచిద్దాము. అటువంటి ప్రయత్నము చేయటానికి సహృదయముతో ముందుకువచ్చి, యీ N.G.O.లకు ముఖ్యంగా జీతాలు పెంచాలని కోరుతున్నాను. వారు తప్పకుండా విశాలహృదయముతో కృషి చేస్తారని ఆశిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, మన వేమయ్యగారు ప్రవేశపెట్టినటువంటి ఈ తీర్మానము చూస్తే చాలా ఉదారంగా వున్నట్లు కన్పిస్తున్నది. దీనిని ప్రభుత్వపక్ష సభ్యులుకూడా ఎవరూ కాదని అనరు. దానిని అమలుపరచడానికి కావలసిన అవకాశాలు ఏమిటో అనే విషయాలను గురించి వేమయ్యగారు స్పష్టంగా వివరంగా చెబుతారేమోనని నేను వారి ఉపన్యాసమును చాలాజాగ్రత్తగా విన్నాను. దీనిని అమలుపరచడానికి ఎంత వ్యయము అవుతుంది, ఈ వ్యయాన్ని ప్రస్తుతం ప్రభుత్వం ఏ విధంగా భరిస్తుంది అనేదిమాత్రం వారు ఎక్కడా చెప్పలేదు. కాని వారు ఉద్యోగుల సాధక బాధకాలన్నీకూడా చాలా వివరంగా చెప్పారు. దానిని కాదనడానికికూడా అవకాశములేదు. ఉద్యోగులకు అనేక విధములయిన బాధలు ఉన్నాయి. వాటి నన్నింటిని పరిశీలించి పరిష్కరించడానికి ప్రభుత్వం ప్రయత్నించవలసి ఉన్నది. దానిని కాదని ఎవరూ చెప్పరు.

వెంకటేశ్వర్లుగారు చాలా అంకెలతో ఉపన్యాసము చేశారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో దీనిని గురించి ఆలోచించినారు. ఆరుకోట్ల రూపాయలు కావలసివచ్చినాయి. ఇప్పుడు మనము విడిపోయాము. అందులో మూడవవంతు భాగం మనకు వస్తుంది. ఆ విధంగా మనకు 2 కోట్లు వచ్చినది. కాని ఏ సంవత్సరములో వారు ఆలోచించారు. అప్పటి సిబ్బంది పరిస్థితి ఏమిటి? ఆంధ్ర

Sri Pragada Kotaiah] [24th September 1955

రాష్ట్రము వచ్చిన తరువాత సిబ్బంది పరిస్థితి ఏమిటి? ఈ పరిస్థితుల్లో ఈనాడు ఈ రెండుకోట్ల రూపాయలు సరిపోయిందా! ఈ విషయమును గురించి వారు చెప్ప లేదు. కాని ఉన్న వాస్తవపరిస్థితిని జాగ్రత్తగా పరిశీలించినట్లుగా ఉంటే వారు అనుకొన్న రెండుకోట్ల రూపాయలు చాలదని మనము ఒక నిర్ధారణకు రావచ్చును. N. G. O. లు అంటే 250 రూపాయలలోపు జీతగాళ్లు. ఈ రు. 250 లు లోపు జీతగాళ్ళయొక్క జీతాలు పెంచమని మన కమ్యూనిస్టులు పదేపదే కోరుతున్నారు. అంటే ఈ ఉద్యోగస్థులలో 18 రూపాయలు తీసుకొనేవారు ఉన్నారు. రు. 20లు తీసుకునేవారు ఉన్నారు. రు. 30 లు తీసుకునేవారు ఉన్నారు. ఇప్పుడు ఉన్న సిబ్బందిలో కనిష్టజీతాలు అనుభవిస్తున్నటువంటి జవానుల వ్యవహారముగాని, ఇంకా చిన్నచిన్న ఉద్యోగస్థుల వ్యవహారముగాని పరిష్కరించడానికి ఏ విధంగా అవ కాశాలు ఉన్నాయి అనే విషయాన్ని ఆలోచించకుండా వారు అప్పరు డివిజను గుమాస్తాల సంగతి లోయర్ డివిజన్ గుమస్తాలసంగతి చెప్పారు. కర్నూలు సెక్ర టేరియట్‌లోవుండే L. D. C. కు రు. 100 లు ఇస్తున్నారని, ఏలూరులో వుండే L. D. C. లకు రు. 90 లు ఇస్తున్నారని చెప్పారు. వారిలో 10 రూపాయలు తేడా కన్పిస్తున్నవని, ప్రారంభంలో రు. 6 లు తేడా కన్పిస్తున్నదని అన్నారు. తేడాలు కన్పిస్తున్నది అంటే హెచ్చుగావున్న జీతాలను తగ్గించమని చెప్పవచ్చును. కాని పెంచవలసిన అవసరము నాకేమీ కన్పించడములేదు. ఎందుకు అంటే ఇప్పుడు గుమాస్తాలు రు. 80 లు, రు. 90 లు జీత మనుభవిస్తున్న వారి రు. 10 లు పెంచడమనేది అనవసరము. ఈనాడు దేశంలో పేదరికాన్ని అనుభ విస్తూ, అనేక వృత్తులపైన ఆధారపడి ఎంతో నికృష్ట జీవితమును గడుపుతున్న వారి ఆదాయాన్ని పెంచడానికి ఏదైనా ఆలోచించవలసిన అవసరము ఉన్నదా లేదా అనే విషయాన్ని నేను మాత్రము కమ్యూనిస్టుపార్టీని సూటిగా ప్రశ్నిస్తున్నాను. ఎందుకు అంటే ఈ తీర్మానాన్ని తెచ్చినప్పుడు వారు ప్రభుత్వంలో ఉన్నాము అను కొని దీనిని అమలుజరపడానికి గల ఆలోచనలు ఏమిటో సమగ్రంచేసి, అమలు జరప డానికి అవకాశము వున్నప్పుడు మాత్రమే తెస్తారు. ఇప్పుడు ప్రతిపక్షులలో ఉన్నాముగదా, అని చెప్పడమువరకే మనవంతు, తరువాత అది జరిగితే జరుగ వచ్చును, లేకపోతే లేదు అని ఆషామాషాగా ఊరికినే చౌకబారు కబుర్లుచెప్పి సానుభూతి సంపాదించడము కొరకు తీర్మానాలు చేస్తున్నారు తప్ప, దీనిని అమలు జరుపడానికి ఏ విధముగా అవకాశాలు ఉన్నాయో వారుచెప్పరు. మనహరిశ్చంద్ర ప్రసాద్‌గారిమీద అదనంగా పన్ను వేయకూడదా? మన చల్లపల్లి జమీందారుగారి మీద అదనంగా పన్నువేయగూడదా అంటారు. వారువేసే విధానము ఏమిటో

Sri Pragada Kotaiah] [24th September 1955

చెబితే కాంగ్రెసుపార్టీ తప్పనిసరిగా ఆలోచిస్తుంది. ఈనాడు హరిశ్చంద్రప్రసాద్ గారిమీద విధించబడుతున్న పన్నులు గాక ఇంకా అదనంగా విధించడానికి అవకాశాలు ఏమిటో వెంకటేశ్వర్లుగారు స్పష్టమైన పథకాన్ని ఒకదాన్ని ప్రభుత్వము ముందు పెట్టినట్లయితే కాంగ్రెసు లెజిస్లేచరుపార్టీ తప్పనిసరిగా ఆలోచిస్తుంది. ఇంకొక విషయముకూడా వారు చెప్పారు. Central excise వారు మనదగ్గర నుంచి రు. 36 కోట్లు తీసుకుపోతున్నారు, అందులో మనకు పంపకంలో చాలా తక్కువ వస్తున్నది, దానినిగురించి ఆంధ్రప్రభుత్వము వత్తిడిచేయడము లేదంటున్నారు. ఇది ఒక్క ఆంధ్ర ప్రభుత్వమునకు మాత్రమే సంబంధించినది కాదు. ఈ విషయం వెంకటేశ్వర్లుగారికికూడా తెలియదా ? రాజ్యాంగ వ్యవహారము వారికి తెలియదా ? దేశంలోవున్న యావత్తు జనాభాను ఆధారంగా చేసుకొని జనాభా ప్రాతిపదిక ప్రకారము మన excise duty పంపకము చేస్తున్నారు. Income-tax పంపకము చేస్తున్నారు. ఆంధ్రరాష్ట్రంలో మనం కడుతున్నటువంటి Income-tax ఎంత ? మన జనాభా నిష్పత్తి ప్రకారం మనకు ఇంకా అదనంగా Income-tax వస్తుంది. వదలిపెట్టుకుందాము అంటారా వెంకటేశ్వర్లుగారు ? ఈనాడు ఆంధ్రరాష్ట్రం యావత్తు నిష్పత్తి మార్పుచేయడానికి సావకాశము ఉన్నదా ? ఆంధ్రరాష్ట్రము ఒకటి చెప్పినంతమాత్రాన ఈవేళ ఇండియాలో మొత్తముగా మార్పు రావడానికి అవకాశములు ఉన్నాయా ? ఇవాళటిరోజున మనము కేంద్ర ప్రభుత్వమువారిని మేము Income-tax లో అదనంగాభాగము కావాలనియు, excise duty లో ఎక్కువభాగము కావాలని అడిగితే, ఎంతవరకు వారు యివ్వడానికి అవకాశాలు ఉన్నాయి అనేదిచూస్తే, వెంకటేశ్వర్లుగారు చెప్పిన వాదనలో పసఅనేది కనిపించడములేదు. వారు ఇంకా కొన్ని విషయములుకూడా చెప్పారు. సేల్సుటాక్సు వ్యవహారముకూడా చెప్పారు. సేల్సుటాక్సు మనము చాలా వసూలు చేయలేకుండా పోతున్నాము. మనకు రావలసినది సరిగా రావడములేదు. ఈ సేల్సుటాక్సును గురించి సంజీవయ్యగారు బెజవాడలో చెప్పారంటే inter-trade sales tax ను గురించి చెప్పారు. మనం ఎక్కడో ఇతరరాష్ట్రాలలో కొనుగోలు చేస్తున్నాము. యదార్థానికి ఆంధ్రదేశం ఇతర రాష్ట్రాలనుంచి చాలాకొంటున్నది. మిల్లుబట్టలు అని చెప్పండి, కొబ్బరినార, నూలు, అపరాలు ఇటు హైదరాబాదు స్టేటు నుండి, మద్రాసు స్టేటునుండి, బొంబాయి స్టేటునుండి మనరాష్ట్రము కొంటున్నది. యదార్థానికి మనకు రావలసిన అవసరము ఉన్నది. అది వసూలు చేయడంలోకూడా సాధక బాధకాలు వున్నాయి. అసలు ఇప్పుడు inter trade sales tax వద్ద అవుతున్నది అంటున్నారు. అప్పుడు మనము ఏదైనా కొనుగోలు టాక్సు వేయ

Sri Pragada Kotaiah] [24th September 1955

డానికి వీలున్నదా? వేస్తే ఏ విధముగా వేయడానికి వీలున్నది, అమలు జరుపడానికి ఏ విధముగా అవకాశాలు ఉన్నాయి, అనే విషయాలను మనము ఆలోచించినప్పుడు ఏదైనా అదనంగా రావడానికి అవకాశము ఉంటుందేమో! అదికాక ఇప్పుడు ఎగవేతలు జరుగుతున్నమాట యదార్థమే. ఎగవేతలు పెట్టుకొనేదానికి అవకాశము ఏమిటో ఆలోచించాలి.

కాని ఎగవేతలను పట్టుకునే వానికి అవకాశం ఏమిటి? సిబ్బంది చాలా పెరిగింది అంటున్నాము. సిబ్బందిమీద చాలావ్యయం జరుగుతోంది అంటున్నాము. దీనివల్ల ప్రయోజనం ప్రజలకు అందడంలేదు అంటున్నాము. ఈ పరిస్థితిలలో ఎంత సిబ్బందిని అదనంగా పెంచినా సేల్సుటాక్సు వసూలు అవుతుందనే నమ్మకం ఉన్నదా? ఇందులో చాలా అనుభవం ఉన్నవర్తకులు ఇతరుల సలహాలను తీసుకొని దీనిని సమగ్రంగా రూపొందిస్తే వస్తుందేమో! అవసరమయిన ఆదాయాన్ని చేకూర్చుకొని మిగులు రాష్ట్రంగా ఏర్పడిన తరువాత చిన్న గుమస్తాలు, జవానులతో start అవుతాము. ఈ సంవత్సరానికి పోలీసులకు ఇంత ఇద్దాము అనుకుంటాము. ఈవిధంగా క్రమక్రమంగా start అయితే 10 సంవత్సరాల కాలంలో సాధక బాధకాలు సరిచేయడానికి అవకాశం ఉంటుంది. అలాకాకుండా ఒకేసారి pay commission సిఫార్సులను అమలు జరపాలి; జరపకపోతే మేము చెప్పింది చెప్పాము, మెజార్టీ ఉన్నదికదా అని కాంగ్రెసు నట్లేరుపైబండి మాదిరిగా నడుస్తోంది అని బైటకుపోయి ప్రచారం చేయడానికి చూస్తున్నారు. ఉద్యోగాలుచేసి నెలకు రు. 70 లు, రు. 90 లు సంపాదించే వారికోసమే కృషిచేస్తున్నారు కాని గ్రామాలలో ఉండే వ్యవసాయ కూలీలగురించి, కుమ్మరులగురించి, కమ్మరులగురించి వడ్రంగులు గురించి చేపలపట్టేవాళ్ళగురించి, చేనేత పరిశ్రామికులు గురించి, ఆలోచించకుండా ఉన్నారు. అన్ని గ్రామాలలో ఎంతోమంది వృత్తులవారు ఉన్నారు. వారు చదువుకున్నవారుకాదు. కాబట్టి పత్రికలలో ప్రచారంచేసే అవకాశం ఈ చదువుకున్నవారికి ఉన్నది కాబట్టి వారి సానుభూతి సంపాదిస్తే ఏవిధంగానైనా నాలుగు కోట్లు సంపాదించుకొనడానికి వీలుఉంటుంది. కాబట్టి కేకలు వేయడం తప్ప గ్రామాల్లోని జనాన్నిగూర్చి వారి అభివృద్ధినిగూర్చి ఏవిధంగా ఆలోచన చేస్తున్నారు. కాంగ్రెసువారు ఏదో చేతనైనంతవరకు చేస్తున్నారు. మీరు ఒక స్పష్టమైన ప్రణాళిక చెప్పండి. వ్యవసాయ కూలీలకు కనిష్ఠ వేతనాలు నిర్ణయించే పద్ధతి గురించి చెప్పండి, ఆలోచిస్తాము. సరియైన జీవితం సాగించటానికి అవకాశాలు ఏమి ఉన్నాయో చెప్పండి. నాన్ గజెటెడ్ ఉద్యోగుల

పిల్లలకు మూడవఫారంవరకు జీతాలతో నిమిత్తం లేకుండా చదువులు చెప్పించు కుంటున్నారు. Non-Gazetted Officers 6 గంటలు కాకుండా 9 గంటలు పని చేస్తున్నారట; చాలా ఎక్కువ పని చేస్తున్నారట. కాఫీ హోటలుకు వెళ్లి గంటలు తరబడి కాలక్షేపం చేస్తుంటారు. వారిని గూర్చి దయతో సానుభూతితో మాట్లాడుతున్నారు. 10 గంటలకు వెళ్లి ఒంటి గంటకు బైటకు వస్తారు. కాగితాలు జూడరు. Pigeon holes లో కాగితంపడితే రెండుమూడు మాసాలకు కూడా కదలదు. వారిని గూర్చి మొసలి కన్నీరు కారుస్తున్నారు. పేద ప్రజలనుగూర్చి మాత్రం లేదు. ఓట్లకు వెళ్లినప్పుడు మాత్రం బీదవాళ్ళకు తినడానికి తిండి, కట్టడానికి బట్ట కావాలంటాము; చదువుకున్నవాళ్ల కోసము, ధనవంతులకోసము, బస్తీవాళ్ళ కోసం మాత్రమే కాదని చెబుతాము. ఇది మామూలు. Pay Commission సూచనలను అమలు చేయాలని కాకుండా దేశంలో ఉండే పేదవాళ్ళను గూర్చి ఏ వృత్తిలేకుండా కష్టకష్టాలు అనుభవించే వాళ్ళనుగురించి ఆలోచిస్తున్నామా ? ఆరు మాసాలు మాత్రమే వృత్తి ఉంది, మిగతా ఆరు మాసాలు వృత్తిలేకుండా ఉండే వ్యవసాయకూలీలను గురించి ఆలోచిస్తున్నామా ? వ్యవసాయకూలీలు హరిజనులలో నే కాదు; అన్ని వర్గాలలోను ఉన్నారు. పేదల సంగతికాకుండా చదువుకున్న railway employees రు. 70 నుంచి రు. 160 లుకు పెంచాలని, రు. 200 లు వచ్చే N.G.O. కు రు. 250 లు చేయాలని చెప్పడం fashion అయిపోయింది. దరిద్రుల సంగతి ఆలోచించని పార్టీ విధానాలతో ఏకీభవించడం చాలాకష్టం కాబట్టి ఉదారంగా ఉన్న ఈ తీర్మానం ఆచరణసాధ్యంకాదని దీనిని ఉపసంహరించుకోవా లని కోరుతున్నాను.

SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా, చాలాకాలం non Gazetted Officer గా ఉండి అవసర పరిస్థితులకోసము రాజకీయ పార్టీలు చేరి ఒకటి రెండు సార్లు నెగ్గిన నా సోదరసభ్యులు అయిన వేమయ్యగారు వేమన్న శతకాన్ని non-Gazetted Officers గురించి రచించినందుకు నా అభినందనాలు. మతియుండిను యతి, గుణం కుదిరి గణం వేసినా వేయకపోయినా మొత్తానికి వేమన్న శతకం ఎంత popular గా ఉన్నదో, వేమయ్యగారి ప్రశ్నలు, చట్టాలు అంత popular గాను ఉండడంలో ఆశ్చర్యమేమీలేదని నా అభిప్రాయం. అయితే వారియొక్క అధి నేత అయిన లెనిన్ "Theory without practice is sterile ;Practice without theory is blind" అని చెప్పిన వాక్యాన్ని దగ్గర పెట్టుకొని ఈ శతకాన్ని రచించియుంటే మనం శతకంయొక్క అర్థాన్ని

తెలుసుకోడం కోసము చిన్నయసూరి గ్రామము, ఇటీవల వెంకట్రామ అండ్ కో వారు వ్రాసిన శబ్దకోశాన్ని పరిశీలన చేయవలసిన పరిస్థితులు ఉండి వుండవు. అనుకుంటాను. వారు మాట్లాడుతూ అంతస్థులు గురించి మాట్లాడారు. రు. 3,000 లు జీతం గురించి ప్రస్తావనచేశారు కాని రు 30,000 బిల్లు తీసుకుంటున్న సోవియట్ రష్యానాయకుల గురించి మరచిపోయారు. ఇక్కడ రు. 3000 లు ఎక్కువగా చెబుతున్నారు. అంతే కాకుండా ఒకానొక కమ్యూనిస్టు పార్టీలో ఉన్నవారిలో బసవపున్నయ్యలాంటి క్రొమేడ్సు సెకండ్ క్లాసు టిక్కెట్టు కొనుక్కొని తిరుగుతున్న రోజులలో మాలాంటివాళ్లం ఒంటెద్దుబండికికూడా డబ్బులు లేకుండా తిరిగిన రోజులున్నాయి. సెకండుక్లాసు రద్దుచేసి, ఒంటెద్దు బండివాణ్ణి ఆ రెండవక్లాసువాణ్ణిగాచేసి travel చేయించకలిగిన పరిస్థితులలో వేమయ్యగారు ఈ రోజున suggestions ఇచ్చిఉంటే కాంగ్రెసువాళ్లు చేసింది తప్పు, కమ్యూనిస్టులుచేసింది సరిగాఉన్నదని అనుకోడానికి సావకాశంఉండును. కాని చెప్పడానికి చేయడానికి చాలా తేడాఉన్నది. గోపాలరెడ్డిగారు చేసిన రిపోర్టుకే ఆయన బాధ్యుడుకాడు; Central Pay Commission report కు బాధ్యుడు ఎట్లా అవుతాడు అని శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు వాదించారు. రైటే. మీ దృష్టితో armed revolution ఒకటే ప్రపంచంలోఉంటే పీడిత ప్రజానీకానికి శ్రామిక విముక్తి తీసుకువస్తుందనిచెప్పిన 48 వ తీర్మానానికి మీరు Stick up కాలేకపోయినారుకదా. పరిస్థితుల ప్రభావంవల్ల రాజేంద్రప్రసాదు భారతదేశానికి వచ్చినపుడు నల్ల జెండాలు చూపించడం తప్పని పరిస్థితులనుబట్టి మార్చుకోవలసివచ్చిందికదా. అట్లే సుభాష్‌చంద్రబోసు దేశద్రోహి అనిచెప్పి వ్రాసినవ్రాతలు దేశభక్తుడని మార్చుకోవలసివచ్చిందికదా. కమిషనును వేసికొని, Enquiry Committee వేసి కొని కొన్ని రిపోర్టులు తయారుచేసినపుడు వాటిని అమలులో పెట్టినపుడు పరిస్థితులనుబట్టి మార్చుకోవలసివస్తుందని అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ వారు పంపించిన ఆదేశాలనుబట్టి అయినా మీరుపాలసీ మార్చుకుంటూ వచ్చారని, కాబట్టి అదేవిధంగా వాస్తవిక పరిస్థితులనుబట్టి మా పార్టీవారు మార్చుకుంటున్నారేమో అనిపిస్తుంది. నాకుకూడా బాధాకరంగానే ఉన్నది. నాచుట్టాలు బంధువులు N. G. O. లు చాలామంది ఉన్నారు. ఈ శతకం వ్రాయడమే కాకుండా, N. G. Oలలో armed revolution కాకుండా కాగితాల revolution తీసుకురావడానికి ఆంధ్రలో మీరుచేసిన వ్యవహారం మరచిపోలేము. N. G. Oలలో corruption ఉన్నదని చెబుతున్నారు. కాగితాలు జరగడంలేదని చెప్పుతున్నారు. Set up మార్చాలని అంటున్నారు. Set up ను మార్చాలని

Sri N. Srinivasa Rao] [24th September 1955

అంటున్నారు. Set up ను మార్చకుండా get up ను హెచ్చుచేయడానికియత్నిస్తే clash వస్తుందనే ఆందోళనగా ఉన్నది.

నేను మనవిచేసినట్లు కోటయ్యగారు చెప్పినట్లు వారు ఎందుచేత ఈ విధముగా మాట్లాడుతున్నారంటే కమ్యూనిస్టునాయకులు చాలామంది upper strataలో నుంచి వచ్చినవారు. భూస్వాములు కాకపోయినా భూస్వాములవర్గములోనుంచి వచ్చిన వారు అనడముచేత ఎంతసేపాలోచించినా ఆ జిల్లాలో కాంగ్రెసువారు కమ్మవారిని పెడితే వీరు కమ్మవారిని పెట్టడము, వారు చిత్తూరువారిని పెట్టితే వీరు చిత్తూరువారినే పెట్టడము అన్నదేతప్ప శ్రామికనియంతృత్వస్థాపనము ఎవరు శ్రామికుడు, ఎవరిని పెట్టవలెను ఎవరు ఏక్లాసును represent చేస్తారు ఆసేవిషయము ఆలోచించ డానికి వారికి సావకాశములేదు. ఇది సత్యము ఇకపోతే confirmation గురించి 5years service చేస్తే ఎందుకు permanent చేయకూడదు, 10 సం॥ చేస్తే ఎందుకు చేయకూడదు అని అంటున్నారు. 10 సం॥ పార్టీలోఉన్న తరు వాతకూడ పార్టీసభ్యుడుగా తీసుకోకుండా 2 సం॥లలో చేరిన భాగ్యవంతుడికి పార్టీముద్రగుద్ది హటాత్తుగావచ్చిన చిట్టూరి సుబ్బారావుగారికి పార్టీముద్ర ఇస్తే తప్పుకాదు.

పార్టీరూల్సుకూడా మార్చుకోనందే అట్లాచేస్తూ ఉండడము మంచిదికాదని వారు పార్టీరూల్సు మార్చుకోనవలెనని నేను మనవి చేస్తున్నాను.

తరువాత merit అన్నారు. ఆంధ్రరాష్ట్రములో వ్యవసాయకూలీల సంఘాలు కమ్యూనిస్టుపార్టీ ఆనేగాలి సోకకముందు 1932 సం॥లో గూడూరు రామచంద్ర రావుగారు, వేముల కూర్మయ్యగారు ఇద్దరుకలిసి ఆంధ్ర వ్యవసాయకూలి సంఘాన్ని స్థాపించితే దానిలో ప్రవేశించి ఎర్రజెండా దానిముందుపెట్టారు. ఆంధ్రరాష్ట్ర ములో వ్యవసాయకూలీల పరిస్థితులు సమస్యలు తెలుసుకొని ఏఏ ప్రాంతాలలో ఏఏ కొలతలు ఉన్నవి, ఏఏ ప్రాంతాలలో ఎలాంటి భూములున్నవి నిర్ణయించి చెప్పగలి గిన సమర్థులైన హరిజన కార్యేమేడ్సుండగా ఆప్రాంతాలవారుకాని కార్యేమేడ్సును తీసుకువచ్చి ఏ merit మీాత ఆంధ్రరాష్ట్ర సంఘాధ్యక్షులుగా చేశారు? ఆనాడు మన వేమనగారు లేరు. ఉంటే చాలా దుఃఖించివుండేవారు. అప్పుడు వారు N. G. O. గా ఉండేవారు పాపం. 10 సం॥లు practice చేస్తున్నవారిని ignore చేయకూడదని నేను చాలా సూటిగా చెప్తున్నాను. అదితప్పు. ఇట్టిపరి స్థితులలో విమర్శించే commnist party, seniority విషయంలో తప్పులు చేయ కూడదని నేను ప్రార్థనచేస్తున్నాను.

ఇక confidential files ఉంచడము తప్పు అంటున్నాను. రామచంద్ర ప్రభో మాజిల్లాలోవుండే జిల్లాకమ్యూనిస్టుపార్టీ నాయకుడు పెద్ద C. I. D. కమ్యూనిస్టుపార్టీ సభ్యులమీద, ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టుపార్టీవారు ఒకరిమీద ఒకరు C. I. D. పనిచేస్తూంటారు. మనకుకూడా పార్టీలో records వున్నాయి. పాతరికార్డునుబట్టి confidential filesను బట్టి ఎవరిని Soviet Russiaకు ఎవరిని America కు పంపవలెను ఎవరు progressive writer కావలెను ? ఎవరికి జబ్బువస్తే ఎట్టిమందు తీసుకోవాలి ? అనే నిర్ణయాలు అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ వారు టికెట్లు ఇవ్వడానికి confidential records కావలెనుగాని ఇక్కడ ప్రభుత్వము తమక్రింద పనిచేసేవారు సత్ప్రవర్తనకలిగియుండాలని confidential report వ్రాస్తే అదికూడదు అనిచెప్పే కమ్యూనిస్టుపార్టీవారు confidential report ను రద్దుచేసుకొని తరువాత చెప్పమనండి సంతోషిస్తాను.

డఫేదారులకు గౌరవముకోసం 2 రూపాయలు ఇప్పించవలసినదని మన్న వేమన్నగారన్నారు. అది మంగిపూడి వెంకటరత్నశర్మగారు అన్నట్లు " గౌరవముకోరి ఇస్లాము క్రైస్తవాది పరమతములవారు ఏభంగిమీద అరయుచున్నారో మమ్ము అటులే అరయుడీ" అని ఉంది. అని అట్లాగే ఆర్థికపరిస్థితులనుబట్టి standard of living కోసము అనకుండా రెండురూపాయలు లేకపోతే డఫేదారు ఎలాగుంటాడు? ఆయన ఒరిజినల్‌గా N. G. O. Communist mind తో ఆలోచించలేకుండా ఉన్నాడు మన మిత్రుడు వేమన్న. మనిషి బ్రతికొలి తినాలి అందుకోసము ఏమిచేయవలెను అని నేను Gopala Reddi గారు ఆలోచిస్తే అయ్యేదికాదు. మొత్తము భారత దేశములో వుండే సర్వప్రజల standard ఏవిధంగా పెంచాలి అంటే దానికి ఒక 5 years plan గాని 10 years plan గాని వేయవలెను. అనంతరంగా ఉత్పత్తిరంగంలో revolution తీసుకొనిరావలెను. అందుకు ఏఏదేశాలనుంచో యంత్రాలు తీసుకొనిరావలెను. మనవారియొక్క మిత్రులు మీ మంత్రులైన రష్యానుండిగూడ machinery ఈదేశానికి దింపి ఉత్పత్తిరంగం పెంపుచేసినప్పుడు 100% (cent percent) పెరుగుతుంది. Planning లో 25% పెరిగింది కాదా అది M. T. రాజుగారి నడిగితే లాభంలేదు. అది సాధ్యమైన విషయముకాదు.

ఇకమీదట నామిత్రుడు ఇటువంటి బిల్లును ఉపసంహరించుకొనడమే కాకుండా డబ్బునుసంబంధించిన ఏబిల్లు తీసుకవచ్చినను 2 + 2 = 4 అనే పద్ధతిలో ఈ బిల్లుతోపాటుగా ఈ శ్రేష్ఠులకు ఇంత పెంచండి, ఈమంత్రులకు యింత పెంచండి, వారికి ఇంత పెంచినందువల్ల వచ్చినమొత్తము ఇంత, ఈ తగ్గించినమొత్తము ఇంత, ఈకొత్త tax వేయకుండా గాలిలో ఉత్పత్తిఅయిన రూపా

యిలు కొంత మొత్తమంతాకలిస్తే ఇంత, ఇంతకు అంతకు సరిపోతుందని మీరు లెక్కలు వేయవలెనుకదా. అంతర్జాతీయ పరిస్థితులను అనర్గళంగా తెలుసుకొని ఎక్కడో నూన్కొనుండి వచ్చాము అని క్వాలిఫికేషన్ వేస్తే ఇందులో fuderlism, capitalism, anarchlism, సమస్త ism లు ఉన్నాకూడా, సమస్త ism లనుకూలంకుషముగా సర్వభక్షణచేసిన అంకెలనుకూడ భక్షించి దానిలో సరియైన అంకెలుతీసుకొనివస్తే మేము ఒప్పుకొనవలెనైనా ఒప్పుకొనవలెను లేకపోతే ఈ Assembly నివిడిచి పారైనా పారిపోవాలి. మీరు అది చేయకుండా పెంచాలి పెంచాలి పెంచాలి అంటే పన్నులు దించాలి దించాలి అంటే జరగదు. అధ్యక్షుల వారికి నమస్కృతులుచేస్తూ వేమన్నగారు వ్రాసిన నూతన శతకాలను వాస్తవిక దృక్పథంతో అంకెలతో కలిగి వుండాలని చెప్తున్నాను. గణంకోసం యతికోసం భయపడవద్దుభాయి. భావకవిత్వము కదండి. శ్రీరంగం శ్రీనివాసారావుగారి కవిత్వం యతిప్రాసలు లేకున్నా చెల్లుతుంది అట్లానే మీ కవిత్వంలోకూడా మరే మైనా వ్రాయండి. జాలయ్యశ్రేష్టిగారు కావాలంటే డబ్బు 4% కు నేను ఇస్తానన్నాడు. అట్లా డబ్బు సంగతి చెప్పండి. డబ్బుసంగతి లేకుండా మనము ఘోషపెడితే ఇక్కడున్న ప్యూనులు ఈ రాత్రి సుఖంగా నిద్రపోవచ్చు. వేమన్న గారు మంచి ఉపన్యాసము చేశాడు. మనకోసము వీరంతా కిరాతకులుగా నున్నారని వారు నిరాకరణ చెయ్యవచ్చును. Assembly సభ్యులు Secretariat కు వెళ్లితే కాగితము మీకు తొందరగాను మాకు ఆలస్యంగాను చూపవచ్చును. అది వేరే సంగతి. అందుచేత వీరు సుదీర్ఘంగా ఆలోచించి నూతన శతకము నూతనపంథాలో అంకెలతో వ్రాయవలసిందని నా మిత్రుని కోరుతూ ఈశతకము అంకెలతోలేదు కాబట్టి ఇది పునర్ముద్రణకోసము తగ్గించాలని అనవసరముగా papers waste చేయవద్దని నమస్కృతులు చేస్తూ మీదగ్గర శెలవు తీసుకుంటున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, వేమయ్యగారి తీర్మానాన్ని నేల బలపరుస్తున్నాను. Planinng జయప్రదముగా అమలుజరుపవలెనంటే దానికి కావలసిన ఆర్థికవిధానము కొంచము వెతుకుతూ ఉన్నాము. ఈ సమయములో ఈ ఖర్చు ఎట్లా భరిస్తాము, డబ్బు ఎక్కడ తెస్తాము, అని ఆలోచిస్తున్న సమయములో ఈ జీతాల సమస్య జాగ్రత్తగా ఆలోచించవలెనని నేను మనవి చేస్తున్నాను. Planning సక్రమముగా జరుగుతున్నదా లేదా? అని కేంద్రప్రభుత్వము Planning Commission, Gorwala ను Special Officer గా వేసి ఒక రిపోర్టును తయారుచేయమని అన్నారు. ఆ Report లో planning ఏ విధముగ నుండవలెను, Planning administration ఏ విధముగ నడుపవలెను, ఇప్పుడున్న

Government కు Co-ordination ఏ విధముగా చేయవలెను అనే విషయాలు గురించి, వీటిలో మనుష్యులు ఏ విధముగా పనిచేయవలెనో exhaustive గా report ఇచ్చారు. Planning గురించి మనుష్యులగురించి వ్రాస్తూ ఇట్లా చెప్పారు. దీనివల్ల services ఏవిధముగా deteriorate అవుతున్నది తెలుస్తుంది.

" Discipline in government offices, it is sometimes said, has been in the first victim of independence. This, it is stated, is more true about the clerical staff than about the officers, though even amongst officers there is said to be considerable slackening. The reasons put forward for this are many. It is stated that a large portion of the staff has remained on a temporary basis for many years and sees no prospect of being made permanent. Consequently, it watches the clock, does the least it can and has no incentive to do good work. Furtherr that the pay scales and allowances bear no correspondence to the increasing cost of living which affects living conditions so detrementally that the depressed mental condition of the subordinate makes ordinary work impossible. In addition, there is neither reward nor punishment ; reward for good work or punishment for bad. Most of these reasons are valid and a determined effort must be made to deal with these causes of deterioration now."

" The Commission felt that it would be of considerable value at the present time to obtain an independent and objective assessment of the problems of public administration. Accordingly, it requested Mr. A. D. Gorwala, to make such a study and suggest measures for bringing about improvements in public administration, especially in relation to the implementation of development programmes of the Central and State Governments."

4-30 p. m.

అందువల్ల ఇది ఇంకోవిధంగా చేసిందికాదు. Planning క్రొత్తపద్ధతిలో వచ్చినప్పుడు, పాత పద్ధతినుంచి కొత్తపద్ధతికి సమన్వయం కావడానికి చేసినటువంటి పద్ధతి. ఇప్పుడు planning లో మన జీవవ్యయం ఎక్కువవుతోంది. దానితో జీవనంలోవచ్చే ఆదాయంకూడా ఎక్కువ కావాలనిచెప్పి మనం అనుకుంటున్నాం.

Sri Vavilala Gopalakrishniah] [24th September 1955

దానికే అసలు planning అంతా వేస్తున్నది. ఈ ప్లానింగు లో వాళ్ళకు ఇష్టముండే జీతాలే ఉన్నట్లయితే వాళ్లు పనిచేయగలరా ? ఈ planning ఫీలైనంతవరకూ successful అవుతుందని కొంత మార్పు తీసుకురావడానికి అవకాశం ఇస్తుందని 100 కి 100 కాకపోయినా 100 కి కొన్ని percent ఐనా దేశంలో మార్పు తీసుకువస్తుందనే ఆశనాకుకూడా ఉన్నది. ఈ 5 year plan అది వేసినప్పుడు ఈ జీతాలుమార్చకపోతే వాళ్ళ జీవితంలో ఏ విధమైన మార్పువస్తుందో ఆలోచించండి. వారికి మరోవిధంగా రావడానికి ఏమీ వీలులేదు జీవిత standard పెరిగినందువల్ల, అతని జీతం పెరిగితేనే, అతని standard పెరుగుతుంది. లేకపోతే ఉన్న దానితోనే అతడు adjust చేసుకోవలసిన అవసరం వస్తుంది. ధరలు తగ్గుతాయా అంటే ఏవీ తగ్గేటట్లు కనిపించదు. అవతల standard, ధర పెరిగిపోయింది. ఇప్పుడు మనం ఆలోచిస్తోన్నది Gazetted officers జీతాలుకాదు. మనం ఆలోచిస్తున్నదల్లా Non-Gazetted officers జీతాలుమాత్రమే. అందువల్ల కేంద్రప్రభుత్వం ఏమిచేసిందంటే Non-Gazetted officers జీతాలు సమగ్రంగా పరిశీలించి వారొక నిర్ణయానికి వచ్చారు. దీనిలో Central Government recommend చేసింది, Provincial Governments అమలు జరుపుతున్నది కొద్దిగా ఉదహరణలు ఇస్తాను. Lower division clerks 55రూపాయలనుంచి 130రూపాయలు కేంద్రప్రభుత్వంవారు ఇస్తే, రాష్ట్రప్రభుత్వం 45 రూపాయలనుంచి 75 రూపాయలవరకూ, అల్లాగే Upper Division Clerks 80 రూపాయలనుంచి 220 రూపాయిలవరకూ Central Goverment ఇస్తూంటే, రాష్ట్ర ప్రభుత్వం 83 రూపాయలనుంచి 110 రూపాయలవరకూ తరువాత office assistant grade I-160 దగ్గరనుంచి 10 రూపాయిల increment తో 330 వరకూ Central Government లో మనదాంట్లో అదేమీలేదు. Superintendents grade ఒకటేఉంది. దాంట్లో 530 రూపాయలదగ్గరనుంచి కేంద్ర ప్రభుత్వం ప్రారంభించి 710 రూపాయలతో ముగిస్తే రాష్ట్రప్రభుత్వం 200 రూపాయిలనుంచి 20 రూపాయిల Increment తో 400 రూపాయిలవరకూ పెట్టారు. తరువాత చిన్న ఉద్యోగస్థుల విషయంలో Peons కి 40 రూపాయిల నుంచి 60 రూపాయిలవరకూ వాళ్ళిస్తూఉంటే, 18-8-0 నుంచి 20 రూపాయిలు మనమిస్తున్నాం. ఇంక ఎక్కువ అంకెలుచెప్పి మిమ్మల్ని విసిగించదలచుకోలేదు. ఈనాటి ఆర్థికపరిస్థితులలో ధరలు పెరిగినందువల్ల 500 రూపాయిలు జీతమైతే అది చాలదు officers కు అని అనుకుంటున్నాం. అది అమలుజరుపుతున్నాం. నేను మనవి చేసేది ఏమిటంటే క్రిందఉన్నటువంటి ఉద్యోగికి 30 రూపాయిలైనాఉంటే భాగం

టుందని 1931 సంవత్సరంలో కరాచీ కాంగ్రెసులో ఈ విషయం నిర్ధారించబడింది. క్రిందిజీతం 30 రూపాయిలకు ఎవరికీ తక్కువఉండదు అనేటటువంటి హామీ కనుక ఇస్తే Pay Commission యొక్క recommendations సగంవరకూ అమలు జరిపినట్లే అని నా అభిప్రాయం అది ఎవరూ కాదనలేరు. మనం ఆలోచించవలసిన విషయం వాళ్ళజీవితంలో మార్పువచ్చిందా ? వాళ్ళ జీవితావసరాలు తగ్గిపోయాయి అని. కనీసం 30 రూపాలు లివ్వండి. అందువల్ల కేంద్రప్రభుత్వం index ఎల్లాగైతే పెరుగుతున్నదో దాని ప్రకారంగా జీతాలు పెంచారు. అందువల్లనే allowances అవీ ఇస్తున్నారు. కొన్నాళ్ల చూచినతరువాతవాళ్లు ఏమన్నారంటే అది 160, 175 నుంచి తగ్గేదేమీ కనిపించడంలేదు. కనుక basic pay ఆ amount కు సరిపోయే టట్లుగా జీతంలో proportionate గా కలపండి. Dearness allowance లో కొంతభాగంఅని చెప్పారు. ఆ విధంగా వాళ్లుకలిపి 55 రూపాయిలు permanent చేశారు. వాళ్లు Dearness allowance 55 రూపాయిలు లిస్తున్నది. మనం ఇస్తున్నది. 22 రూపాయిలు. కనుక వాళ్లు ఏంచేశారంటే ఈ 55 రూపాయిలలో సగభాగాన్ని అంటే దాదాపుగా 28 రూపాయిలు basic pay లో కలిపేశారు. Standard ధరతగ్గేదేమీలేదని ఆవిధంగా కలిపారు. 1936 లో 100 తో ప్రారంభించి ఈవేళటికోజున 390, 400 లో ఉంటున్నాం అందువల్ల ఈ విషయం ఆలోచించాలని మనవిచేస్తున్నాను. ఇంక తక్కిన details చాలామంది మాట్లాడి ఉంటారు. నేనింకా మనవిచేసేదేమిటంటే గ్రామోద్యోగస్థుల విషయం ఏపనివచ్చినప్పటికీ ఈ గ్రామోద్యోగస్థులమీద పడేభారం మనం ఆలోచించాలి. వాళ్లు తప్పుచేస్తే oppose చెయ్యడానికి నేను మొట్టమొదటివాణ్ణి. దానికేమీ అనుమానంలేదు. కరణాలూ మేమూఅంతా కలిసి వెళుతూ ఉన్నప్పుడు ఒకసారి ఏమిచెప్పారంటే మీ ఉద్యోగాలూ మీకువచ్చేజీతాలూ చూస్తే మాకు చాలా జాలివేస్తుంది, కాని గ్రామస్థులను, రైతులనూ మీరు పీడించడం చూస్తే మీ మీద చాలాకోపం వస్తుంది అని చెబితే వాళ్లు ఏమీచెప్పలేకపోయారు. వాళ్లకు డబ్బు ఎక్కడనుంచి వస్తుంది ? ఈ hereditory system తీసేసి ఒక lower division clerk కు ఇచ్చే maximum జీతంఐనాఇచ్చి ఇదుగో మీరు 30 రూపాయిలో 40 రూపాయిలో ఇస్తున్నాంఅంటే వాళ్లు బ్రతకగలుగుతారు. వాళ్లు ఇంకో ఉద్యోగానికి వెళ్ళటానికి వీలులేదు. ఇప్పుడు తాలూకాఫీసులున్నాయంటే East India Company పరిపాలనలో ఎల్లాఉన్నాయో ఇప్పుడుకూడా అంతే staff తో ఉన్నాయి. దానికిపైన ఒక్కగుమాస్తానుకూడా వెయ్యలేదు. అదే Deputy Collector ఆఫీసు, Sales-tax Office ఇల్లా అనేక ఆఫీసులువచ్చాయి. వాళ్ళ staff పెరిగింది. వాళ్ళకు కావలసిన కరామత్తంతా పెరుగుతోంది. కాని ఏదైనా

Sri Vavilala Gopalakrishnayya] [24th September 1955

Reference వస్తే Revenue inspector ఐనా కరణమైనా ఇవ్వాలి. కనుక కొళ్ళకుతక్క సౌకర్యాలు ఇవ్వాలి. తాశీల్దారుగారికి జీతం, fixed T. A. ఇచ్చారు. Salestax officer ఒక ఆయన ఉన్నాడు. ఆయన చాలా తిరగవలసినపని ఉన్నది. అన్ని అధికారాలూ అందరికీపోతే తహశీల్దారును పలకరించేవాళ్లు తగ్గిపోయారు. Sales-tax office చుట్టూ తిరిగేవాళ్లు ఎక్కువైనారు. ఒక్కొక్కసారి ఈయనే తహశీల్దారుకుకూడా తిండి పెట్టించవలసివస్తోంది. వీళ్లిద్దరూ ఎక్కడకైనా వెడితే Head Accountant జీతం అతనిక్రింద పనిచేస్తున్న Head Clerk జీతంకన్న 15 రూపాయిలు తక్కువ. ఇతను అతనిదగ్గర subordinate. ఇతని service అంతా అతని కింటుంది. కాని Head Accountant, శిరస్తాదారు అనేటప్పటికి (తాలూకాఫీసులో) వాడిజీతం అంతటితో ఆగిపోతుంది. కాని Head Clerk కు మాత్రం పెరుగుదల అవుతోంది. ఇటువంటి anomalies చాలా ఉన్నాయి. మనం ఇవన్నీ సమగ్రంగా ఆలోచించి చేయకపోతేమాత్రం చాలా దారుణమని ప్రతివారూ ఒప్పుకుంటారు. ఉన్నటువంటివారిలో non-gazetted office లు చాలా బాధపడుతున్నారు. అతను తప్పుచేస్తే దయదలచేదిలేదు. పని సరిగాచేయకపోయినా దయతలిచేదిలేదు. అతనిదగ్గర maximum amount of work extnact చేయవలసిందే కాని minimum తిండితో maximum amount of work తీసుకుంటే లాభంలేదు. work Extxact చెయ్యాలంటే కడుపు నిండా తిండిపెట్టండి. తిండిపెట్టకుండా బరువువేస్తే క్రుంగిపోతాడు. అతనితోటే ఈ రోజున Government structure అంతా నడుస్తోంది. తాలూకాఫీసే లేకపోతే Government ఏమీలేదు. ప్లానింగు కానివ్వండి, మరి యేమన్నా కానివ్వడి. Record లు కావాలంటే ఈరోజున గ్రామోద్యోగస్థులూ వాళ్ళూ ఇవ్వాలి. వాళ్లు కాకిలలేఖలక్రింద పంపిస్తే అరగంటలో పంపించగలరు. సరిగా లెక్కలు కావాలంటే వాళ్ళకు 3 రూపాయలు D. A. ఇస్తున్నారు. తాలూకాఫీసుకు వచ్చి ఒక్కొక్కసారి ఆరురోజులు, ఎనిమిదిరోజులుంటే, రైలుఛార్జీలుపోగా డబ్బు ఎల్లా సరిపోతుంది ? అందువల్ల నేను మనవిచేసేది basic pay 30 రూపాయిలకు తగ్గకూడదు అనే నిర్ణయం మీరు తీసుకున్నట్లయితే నేను చాలా సంతోషిస్తాను. ఈ పద్ధతిలో implement చేయడానికి incentive గా ఉంటుందని ఈ తీర్మానం నేను బలపరుస్తున్నాను.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా ! ఈ resolutionను గురించి నేను కొద్దిగా చెప్పవలసియుంది. ఇదివరకే ఆంధ్రరాష్ట్రంలో N.G.O.లకు Central Government scale ఇవ్వమని నేను ఒక question పంపించాను

ఇప్పుడు కమ్యూనిస్టు సభ్యులు వేమయ్యగారి తీర్మానాన్నిగురించి కొంచం మాట్లాడు తాను. ఇద్దరన్నదమ్ము లున్నారనుకోండి. ఒకరికి రెండు కూరలతో భోజనం పెడుతున్నారు. ఇంకొకడికి మజ్జిగ అన్నంపెట్టి పొమ్మంటున్నారు. అదే మోస్తరుగా Central Governments ఉద్యోగస్థులూ మన ఆంధ్ర గవర్నమెంటు N.G.O. లు ఒకటే గ్రామంలో ఒకటేకోట ఇరుగుపొరుగున ఉంటూఉంటే ఒకరికి ఒక scale ఒకరికి ఇంకొక scale ఇవ్వడం చాలా అధర్మం అని చెప్పక తప్పదు. నిజమేఅయితే కావచ్చు. డబ్బులేని సంగతి వాస్తవమేఅయితే, మిగతా వాటికికూడ మనకు డబ్బు ఎక్కడనుంచి వస్తుంది? వీటి అన్నిటికి ఏలా ప్రయత్నం చేస్తున్నామో, వాండ్లను కూడా సమానంగా చూడామని మన మనస్సులో పెట్టుకోవడం, వాండ్లు సాధారణంగా Central Goverament ఉద్యోగస్థులు ఉన్నారంటే సరిగా 11 గంటలకు ఆఫీసుకు వస్తారు. 5 గంటలు అయ్యేసరికి ఆఫీసులు మూసివేసి ఎవరి ఇంటికి వాండ్లు వెళ్లిపోతారు. ఇపుడు మన ఆంధ్ర గవర్మెంటు ఉద్యోగులు ఉన్నారు. Morning వస్తారు. 10 గంటలదాకా పనిచేస్తారు. ఇంటికి వెళ్లుతారు. భోజనంచేస్తారు. తిరిగి వస్తారు. 9 గంటలవరకుకూడ lights పెట్టుకొని పనిచేస్తున్నారు. కాని తోటివాండ్లకు అన్నారు scales ఇవ్వడం, మన గవర్మెంటు ఇవ్వకపోవడం అనేది చాలాశోచనీయం. కారణం డబ్బులేదంటున్నారు. సెంట్రల్ గవర్మెంటు మన డబ్బు తీసుకొని వెళ్లిపోతుంది. ఉప్పుపన్ను మన దగ్గర నుంచి తీసుకొనిపోయి వాండ్లు ఎట్లా ఇస్తున్నారో వుండేవారిని కష్టపెట్టి, 24 గంటలు కూడ కష్టపెట్టి, తోటివారికి పూర్తి భోజనంపెట్టకపోవడం అనేది చాలా శోచనీయం అని మనవిచేస్తున్నాను. రెండవ విషయం. తోటి సభ్యులు వున్నారు. Communists లు ఈ resolution తీసుకొని వచ్చారు. అందువల్ల మనం ఎవరిని support చేసినా బాగావుండదని చాలమంది ఊరకున్నారు. N.G.O.లు అంతా కష్టపడుతూ వున్నారు. కొంతకాకపోయినా కొంతైనా సరే ఈ resolution వచ్చినందుకు ఇపుడు తోసివేసినా ప్రధానమంత్రిగారు వేరుగా, కొద్ది రోజులలో ఆలోచిస్తారని మనవిచేస్తున్నాను. ఈ resolution ను తోసివేసినంతమాత్రాన పరవాలేదు. అంతకు ఇపుడు ఇపుడు పెట్టవలసినవారు ప్రధానమంత్రిగారు ఆర్థిక వ్యవహారమంతా వారి చేతిలో ఉంది. వారు జాగ్రతగా చూస్తారు. మిగతా ఉద్యోగస్థులకు కొంత కాకపోయినా కొంతైన అడగనిది అమ్మైన పెట్టదనేరకంలో కొద్ది అయినఇచ్చి వాండ్లనుసంతోషపెట్టుతారని ప్రధానమంత్రిగారిని కోరుతూ విరమిస్తున్నాను.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా, మిత్రుడు వేమయ్యగారు ప్రవేశపెట్టిన తీర్మానము వినటానికి చాలా సొంపుగా వుంటుంది. కాని ఆచరణ సాధ్యము మాత్రము కాదనేవిషయం వారికితెలుసు. అందులో retrospective effect కూడా పెట్టుకున్నపుడు నేను చాలా సంతోషించాను. ఎందుకంటే మిత్రుడు వెంకటేశ్వర్లుగారు మాట్లాడేటప్పుడు graduate-గా ఉన్నవాడికి తమ్ముడు కానివ్వండి, అన్న కానివ్వండి అతనికి Central Government లో ఒక scale Provincial Government లో ఇంకొక scale, ఇవ్వడము ఏమిటో ఇది చాలా విచిత్రంగా ఉంది. Retrospective effect కూడా పెట్టారు. కాబట్టి అది మనకు కూడా వర్తిస్తుందాఅని దీర్ఘంగా ఆలోచించాను. అయితే ప్రతిపక్షనాయకుడు అయిన సుందరయ్యగారు మాత్రం కొస్తకనబడుతూ ఉన్నారు. వీరు మొన్నటిదాకా Council of State లో ఉన్నారు. నాలుగువందల రూపాయలజీతం, 1st class రైలుచార్జీ రోజుకు 21 రూపాయలు బత్తా T. A తీసుకుంటూవచ్చారు. (శ్రీ సుందరయ్య—కాంగ్రెసువారిదయయే), వారు ఆమోదించినందుకు చాలా కృతజ్ఞుడను. ఆ సుందరయ్యగారు ఈనాడు కర్నూలు శాసనసభలో కూర్చొన్నారు. ఈనాడు రు. 21 లు లేదు. రు. 12½ లకు దిగారు. రు. 150 లు జీతము. పార్లమెంటు సభ్యుల వసతులన్నింటిని మనకుకూడా ప్రవేశపెట్టి retrospective effect తో extend చేస్తారేమో అనుకొన్నాను. కాని వెంకటేశ్వర్లుగారు ఎందుకో చేయలేదు. అందువల్లనే మేము చెప్పేది ఏమంటే కేంద్రప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వానికి ఉండేతేడా అక్కడ స్పష్టంగా కనబడుతుంది. నాలుగునందలు తీసుకొన్నది సుందరయ్యగారే. అది వాస్తవమే అటువంటి సుందరయ్యగారు పార్లమెంటు సభ్యులుగాఉండి కేంద్రప్రభు.త్వాన్నికి ప్రతిపక్ష సభ్యుడుగ ఉండి తీసుకొన్న నాలుగువందల రూపాయలు వదులుకుని ఈనాడు ఇక్కడికివచ్చి రు. 150 లు తీసుకొంటున్నారు. వదులుకునిఅంటే కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్రప్రభుత్వానికి ఉన్నటువంటి తేడా, అక్కడ కేంద్రప్రభుత్వలోఉన్న శాసనసభ్యుడికి 4 వందల రూపాయలు, ప్రదేశశాసనసభ్యుడుగ ఉండే దానికి 150 రూపాయలు అంటే, కేంద్రప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వానికి ఉన్న వ్యత్యాసాన్ని పూర్తిగా గ్రహించాము, అన్నమాట. ఆదేరకంగా ఒకేవ్యక్తి graduate గా వున్న ఆయనకు కేంద్రప్రభుత్వములో ఉద్యోగం వచ్చేటట్లయితే వచ్చేజీతం వేరు. రాష్ట్రప్రభుత్వంలో ఉద్యోగం వచ్చేటట్లయితే జీతం వేరేఅనేది వివాదాంశము. పైగా ఇది Central Pay Commission శిఫారసు అంటున్నారు. గాని ఇది ఏమి అందరికి వర్తించేవిషయంకాదు. N. G. O. ల పరశే

పెట్టామంటున్నారు. లేదు. Duffadar Jaman వరకు పెట్టామంటున్నారు. ప్రదేశ ప్రభుత్వానికి ఎప్పుడుకూడా ఆయువుపట్టు గ్రామఉద్యోగస్థులు, తలార్లు, వెట్టిలు. ఏదీ మీరు చెప్పేటటువంటి ఈ Pay Commission వారి రిపోర్టులో ఎక్కడైనా సరే, గ్రామఉద్యోగస్థులను గురించి కానివ్వండి నవుకర్లను గురించి కానివ్వండి ఏమైనా ఉందేమో మీరుచూడండి. Central Pay Commission నుంచి ఆ రిపోర్టు వచ్చిందని దానిని చదివి మనమంతాకూడా N.G.O.కు అన్నో, లేకపోతే అనేకరకాలుగా, ఉభయపక్షాలుకూడా, పార్టీ ప్రాధాన్యతను గురించి గొప్పతనాన్ని గురించి విమర్శలుకూడా చాలా జరిగినాయి. ఏమి జరిగినప్పటికీ మనము ప్రజల మధ్యకు పోవాలి అనుకొన్నప్పటికి గానివ్వండి. లేకపోతే N.G.O. లకు మనము చేసే సౌకర్యములకోసం కానివ్వండి ఈ Central Pay Commission తీసుకొని వచ్చి ప్రదేశ ప్రభుత్వంవారు ఆ scales ఇవ్వమనడంలో అర్థం ఉందా అని నేను అప్పుడు అనుకున్నాను. ఇవ్వమనేటట్లుగా ఉంటే, ఇక్కడ మనం ఒప్పుకొనేటట్లుగా ఉంటే నిజంగా శాసన సభ్యులందరుకూడా నాలుగు వందల రూపాయలకు జీతానికి పెట్టితే శుభ్రంగా పార్లమెంటు మెంబర్లు మాదిరిగా మనముకూడా నాలుగు వందలు తీసుకొనవచ్చును. అప్పుడు కేంద్ర ప్రభుత్వానికి ప్రదేశ ప్రభుత్వానికి ఏమి తేడా ఉండదని మేము అనుకొన్నాము, గాని అంతదూరం రాలేదు. రాష్ట్ర ప్రభుత్వానికి ఆయువు పట్టు అయినటువంటి గ్రామ ఉద్యోగస్థులు. తలార్లు మీకు కూడ ఏవిధమైన ఆలోచన తలచని ఆ రిపోర్టునుగురించి, గ్రామంలో కావలసిన శిస్తులు గ్రామ పరిపాలనకు అంతటికి ఆయువు పట్టయిన గ్రామ ఉద్యోగులు తలార్లను గురించి విచారించని ఆ కమిటీ రిపోర్టు కేవలం కేంద్ర ప్రభుత్వ దృష్టినే ప్రధానంగా పెట్టుకొని కేంద్రప్రభుత్వంలోనుంచి వచ్చేటటువంటి ఆదాయవ్యయాలనుగురించేఉన్నది. కేంద్ర ప్రభుత్వంలో చేసే వుద్యోగస్థులు దూరదేశాలకుగాని ఊళ్ళకుగాని పోవలసిన పరిస్థితులను అన్నింటిని మనస్సులో పెట్టుకొని ఆ ప్రభుత్వానికి వారికి వున్నటువంటి పరిస్థితులను బట్టి చేసిన పద్ధతిని మళ్లీ మన రాష్ట్రప్రభుత్వం తరపున రుద్దటానికి ప్రయత్నించేసి కేవలం రాజకీయ పార్టీ దృక్పథంతోటి పార్టీల తరఫున మేము పెట్టాము. మాకు వినరాలేదు అని చెప్పటానికి సాహసం కలిగించేటటువంటిది అని మీరు అనుకొన్నప్పటికికూడ, ఈనాడు అనేకమంది N.G.O. లతో మనము మాట్లాడుతునే వున్నాము. Central Pay Commission salaries అంటే దూరంరాకపోయినప్పటికీ, మాకుకూడా కొత్త సౌకర్యాలు కావాలి, కొత్త జీతాలు పెంచవలెననే కోరిక సర్వసాధారణంగా ప్రతివారియందుకూడ వున్నది. అంతే కాకుండా మనము ఈనాడు నిజంగా 150 రూపాయలు సభ్యులుగా తీసుకొంటూ వున్నటువంటి వారిలోకూడా 150 రూపాయలు చాలనటువంటివారు వున్నారు.

150 రూపాయలలో వంద రూపాయలు మిగిలించుకొనే వాండ్లుకూడ చాలమంది వున్నారు.

ఆరకంగా మనలనుగురించి ఇతరుల భవిష్యత్తునుగాని, జీవితాన్నిగాని నిర్ణయించడంగాని అట్టే అంత ప్రయోజనకారి కాదేమో అని నా అనుమానం. మనం నిజంగా ఈనాడు ప్రదేశ ప్రభుత్వంలో చేసేటటువంటి తాసీల్ దార్లకు ఏమైనా చేయవలెననేటట్లుగా వుంటే మనదేశ పరిస్థితులనుగురించి, cost of living ను గురించి, వారియొక్క వసతులనుగురించి, ఎక్కువమంది పిల్లలు వుంటే అటువంటి వాండ్లకు ఏదైనా bonuses ఇప్పించడానికి, ఏదో ఒక పద్ధతిని పెట్టడానికి Provincial Pay Organisation Committee అనో ఏదో ఒక రకమైనకమిటీని మనము పెట్టుకొని ఏదైనా కొంత కృషి చేస్తే బాగా వుంటుందిగాని, మిత్రుడు శ్రీనివాసరావుగారు చెప్పినట్లు వేమన శతకం పోయి, వేమన స్తుతిగా మారవలెనని ప్రయత్నం చేయడం ఏమి అంత సమంజసంగా వుండదు. అదే మాకు కావలసింది కూడ ప్రజలలో మనము చేశామనేటువంటి తృప్తి వుంది. కాబట్టి అది ఇంతవరకే జరిగిపోయింది. ఈరోజు సభ చర్చనీయాంశము అంతా ఆంధ్ర దేశంలో చదువుకుంటారు. Communist Party వారు చేయవలసినంత చేస్తున్నారనేటటువంటిది ఒకటి వుంటుంది. కాబట్టి మిత్రుడు వేమయ్యగారు దీనిని వుపసంహరించుకొంటే మంచిది అని చెపుతూ సెలవు తీసుకుంటు వున్నాను.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా, కమ్యూనిస్టుపార్టీ తరఫున శ్రీ వేమయ్యగారు తెచ్చినటువంటి తీర్మానాన్ని నేను ఆమోదించలేకుండా పోతున్నాను. దానికి కారణము చెప్పుతున్నాను. మన ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత 13 మాసాలు ఉండినటువంటి ప్రకాశం, సంజీవరెడ్డిగారి మంత్రివర్గము పేదప్రజానీకానికిగాని, non-gazetted ఉద్యోగస్థులకుగాని ఆంధ్రదేశం మొత్తంమీద అన్ని విధాలా ఎంతవరకు ప్రజలను బాగుచేయవచ్చునో ఆవిధానాలన్నీ ఆలోచించి, వారికోరకు ఎంతో కృషిచేసింది. ఇప్పుడు 6 మాసాలనుంచి ఉంటూన్న ప్రభుత్వముకూడ, సామాన్యప్రజానీకానికి, non-gazetted ఉద్యోగస్థులకు, నూటికి 70 మందిగా ఉన్నటువంటి బీదప్రజానీకానికి, ఈ అయిదేళ్ల పంచవర్ష ప్రణాళికలో తగినటువంటి సౌకర్యాలను కలుగచేయవలెనని పూనుకొంటున్నది. వేమయ్యగారు చాలా మంచివారు. తెలివిగలవారే. మన ఆంధ్రదేశం మొత్తంమీద ఏ ఆఫీసులో కూడ వేమయ్యగారిపేరు మ్రోగుతూ ఉంటుంది. అటువంటివారు ఈ పరిస్థితిని తెలుసుకోకపోవడం విచారకరము. ప్రస్తుతం బడ్జెటులో 4 కోట్లు లోటువున్నది. ఇప్పుడు non-gazetted ఉద్యోగస్థులకు జీతాలు ఎక్కువచేస్తే, ఇంకొక

4 కోట్లు deficit ఏర్పడుతుంది. వేమయ్యగారు మంచివారే కాని ఈ కొంగజపాలు కూడదంటున్నాను. మా ప్రాంతాలలో యిలాంటివాటికి కొంగజపాలని అంటూ వుంటారు. అటువంటి కొంగజపాలు ప్రతి గ్రామంలోను చేస్తున్నారు. ముష్టివాళ్లను వీధులలో పెట్టి ఇదిగో కాంగ్రెసు ప్రభుత్వం మీకేమిచేస్తున్నది, మీకు తినడానికి తిండి లేదు, కట్టడానికి బట్టలేదు, మా ప్రభుత్వంవస్తే మీ అందరికి, ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్కసత్రంపెట్టి భోజనసదుపాయం చేస్తామని ప్రచారంచేస్తున్నారు. కాని ఈ ముష్టివాళ్లకుగాని, నూటికి 75 మందిగా ఉన్న వ్యవసాయకూలీలకుగాని వీరందరికి సరిపోయేటంత తిండి, బట్ట ఇస్తామని వేమయ్యగారుగాని, ఆపార్టీవారుగాని ముందుకువచ్చి అది చేయగలిగితే సంతోషించవలసి యుంటుంది. కాని ఆపార్టీవారికి ఏమితెలుసును అంటె ఈదేశములో ఉన్నవారందరిని బైరాగులనుచేస్తామనేదే. ఒక చెట్టు ఉన్నదనుకొండి. దానినీడక్రింద మనమంతా చేరుతాము. ఇంకొకచెట్టు వేస్తాము అనేలాగు ప్రతి గ్రామానికి, ప్రతివర్గానికి కావలసినటువంటి పనిచేసి దేశాన్ని బాగుచేద్దామనే ఉద్దేశం ఆపార్టీకిలేదు అని నేను చెప్పుతున్నాను. ఎంతసేపటికి, ఎవరినైనా దోపిడిచేయడం, లేక కాంగ్రెసుకు పోటీపెడతామని అందుకు చందావేయండని ఆవిధంగాకొన్ని లక్షలు సంపాదించి దానిని ప్రచారం మూలంగా ఖర్చుపెట్టడం, అంతేతెలుసును. ఆవిధంగా అందరిని బైరాగులనుచేస్తే మరింకేమి చేసేది ఉండదని వారిఉద్దేశము.

తరువాత మనమిత్రులు గోపాలకృష్ణయ్యగారు ఒకబిల్లు తీసుకువచ్చారు. వీరి పేరు మొత్తము ఈ ప్రపంచంలో అంతా "వావిలాల వావిలాల" అని మ్రోగుతూ వుంటుంది. వారు ఋణగ్రస్థులకు ఋణభారమును తొలగించేటందుకు ఒక బిల్లు తీసుకువచ్చారు. అది సామాన్యమైనటువంటివారికి ఎక్కడైనా పనికివస్తుందా ? రేపు దానిని పేపర్లలోచూచినారంటే వారికి ఎవరికికూడ మీకు అప్పు ఇవ్వమురా అంటారు. నూటికి పదిమంది దివాలా ఎత్తుతూ ఉంటారు. దివాలా అంటె లక్షలు, కోట్లు అప్పుచేసి దివాలాచేస్తారని. వాళ్లడబ్బు ఎక్కడో దాస్తారు. అలాంటి రహస్యాలుకూడ వాళ్లకు తెలుసు, అప్పుడు వాళ్లు మేము బీదవాళ్లు అయిపోయాము, కమ్యూనిస్టుపార్టీ చేరి పనిచేస్తాము అంటె, వారివోట్లుకూడ తీసుకోడానికని వారికి సహాయంచేసేందుకు చేసినటువంటి తీర్మానమిది. సామాన్యమైన ప్రజకు కూడ ఒక నీతి నియమం ఉన్నది. గ్రామాలలో ఏ note లేకుండా, ఏపత్రము లేకుండా, వెయ్యిరూపాయలుకూడ బదులు ఇచ్చేటటువంటివారున్నారు. దానికి వడ్డి ఇచ్చో ఇవ్వకనో తీర్చుకుంటున్నారు. అలాంటప్పుడు ప్రజలను అంతహీనంగాచూడడం చాలా విచారకరము,

Sri P. Gunnayya] [24ht Setember 1955

ఈనాడు non-gazetted ఉద్యోగస్థుల జీతాలు హెచ్చుచేయుటకు ప్రభుత్వము కృషిచేస్తూనే వుంది. మా పార్టీకూడా కృషిచేస్తూన్నారు. కాని ఈ ఉద్యోగస్థులకంటె వ్యవసాయకూలీలు, మొదలగువారు ఎంతో హీనంగా ఉన్నారు. చూడండి, 90 రూపాయలు, 100 రూపాయలు జీతము తీసే ఉద్యోగస్థుడు, అతనికి ఒక Rally cycle కావాలి. ప్రొద్దున ఇడ్లీకాఫీ, మరల మధ్యాహ్నం ఇడ్లీకాఫీ, కావాలి. ఆతరువాత సినిమాకు 1-4-0 ఖర్చుపెడుతూవుంటాడు. కాని ఒక వ్యవసాయకూలి విషయం తీసుకోండి. ఉదయం 8 గంటలనుంచి సాయంకాలం 6 గంటలవరకు గొబ్బుత్రవ్వితే, ఆరు అణాలుఇస్తారు. వీరు రోజు అంతాపనిచేస్తే వచ్చేకూలి ఈ వుద్యోగస్థులు కాఫీ ఇడ్లి తీసుకొన్నంతలేదు. అంతేకాదు, ఆరురూపాయల సిగరెట్లు కొంటారు, 1, 2 రూపాయలదికాదు. అందువల్ల ఈ కమ్యూనిస్టుపార్టీవాళ్లు చేసేదంతా బట్ట ఉన్నవాళ్లకే బట్ట ఇవ్వాలని తిండి వున్నవాళ్లకే తిండి యివ్వాలనేదే. లేకుండా ఉండేవాళ్లు ఆలాగే ఉన్నట్లయితే ఎప్పుడైనా ముందుకు పనికొస్తుంది అని వారి ఉద్దేశము. అటువంటి పేదవాళ్లకు ఏపార్టీ అయినా పనిచేసినప్పుడు మేము సహకరించడానికి అభ్యంతరంలేదు. నూటికి 70 మంది ప్రజానీకం ఈ రిక్షావాళ్లు, జట్కావాళ్లు, గ్రామాలలో ముష్టివాళ్లు ఉన్నారు. కాంగ్రెసుప్రభుత్వము రెండేళ్లలో, వాళ్లకెంతోసహాయం చేశారు. ఇప్పుడు హరిజనులకు 3 వందలు ఆస్పత్రులు పెట్టించారు. పరిశ్రమలకు అనేకలక్షలు ఖర్చు చేస్తున్నారు. కుష్టురోగులకు ఆస్పత్రులు పెట్టారు. ఎన్నో Health Centres పెట్టారు. Non-gazetted ఉద్యోగస్థుల పిల్లలకు స్కూళ్లలో జీతములేకుండా చేశారు, ఆస్పత్రులలో ఈ ఉద్యోగస్థులకు, ఉచితవైద్యసౌకర్యాలు కలుగజేశారు. అందుకనే ఏ ఉద్యోగస్థుడుగాని, ఏటీచరుగాని ఆస్పత్రికి పోయినాడంటే ముందు అతనికి మందు ఇస్తున్నారు. ఇదంతా కమ్యూనిస్టుపార్టీవాళ్లు ఎరుగుదురో లేదో నాకు తెలియదు. కాని వారి ఉద్దేశ్యమంతా, ఇప్పుడు 15 మంది శాసనసభకు వచ్చాము మళ్లీ next elections లో ఇంకో 15 మందిరావాలి అనే. అటువంటి జపాలుమటుకు చేయకూడదని వారిపార్టీకి మనవి చేస్తున్నాను. మేముకూడ ప్రజలకు తగినంత సహాయంచేస్తున్నాము. చూడండి ఒక example చెప్పుతున్నాను. ఒక చోట ఒక contractor 26 వేలకు ఒక contract తీసుకొని, ఒకకుప్ప రాళ్లు కొడితే, ఆ labour కు ఆరురూపాయలు ఇస్తున్నారు. ఆరురూపాయలు చాలదు, ఇంకా నాలుగురూపాయలు ఇవ్వమని చెప్పుతున్నారే వారు. ఆవిధంగా ఏపార్టీ ప్రజలకు సహాయంచేస్తున్నప్పటికీ సంతోషిస్తాము, సహకరిస్తాము. ప్రభుత్వముకూడ ఈ పేదప్రజానీకానికి తగినంతసహాయం చేయడానికి కృషిచేస్తున్నది, త్వరలోనే నూటికి 70 మంది ఉంటున్నా ఈ వ్యవసాయకూలీలకు తగినటువంటిసౌకర్యాలు కలుగ

జేస్తూ గ్రామాలలో వున్నటువంటి ముష్టితనాన్ని కూడ పోగొట్టడానికి గోపాలరెడ్డి ప్రభుత్వము సర్వవిధాల ప్రయత్నంచేసి ఈ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేసరికి ప్రతిగ్రామములోను కావలసినటువంటి పనిఅంతా కూడ ఉండేటట్లు చేస్తుందని ఆశిస్తున్నాను.

తరువాత ఈకమ్యూనిస్టుపార్టీవారు నూరురూపాయలు జీతముతీసుకొనే వారి జీతాలు హెచ్చించాలని, వెయ్యిరూపాయలు తీసుకొనే వారిజీతాలు తగ్గించాలని చెప్పుతున్నారు. ఇప్పుడు చూడండి. హరిజనులనుగురించి ఒక కాగితము ఒక M. L. A. గాని మంత్రిగాని వ్రాసినాడంటె, అది దిగువ ఉన్నటువంటి Harijans Welfare Department గుమాస్తాకు వెళ్లుతుంది. ఆకాగితము వచ్చినతరువాత ఏ ఆరుమాసాలైనాగాని పైకిరాదు. ఈ విధంగా అక్కడ పనిచేస్తారన్నమాట. వీరికిచ్చే డబ్బు ఎవరిది ? ఈ మంత్రులకు ఇచ్చేడబ్బుగాని, ఈ M. L. A. లకు ఇచ్చే డబ్బుగాని ఎవరిదని అడుగుతున్నాను. అది ఎవరిదిగాదు, ప్రజలది—అటువంటప్పుడు, నేను ప్రజలడబ్బు తింటున్నాను, నేను ఈ పని చేయవలసియున్నది, ఇది ఎవరిపని గాదు, ఇది నాపని అని భావించి శ్రద్ధగా అగుమాస్తాలు మొదలగు ఉద్యోగస్థులంతా పనిచేసిననాడు దేశము బాగుపడుతుంది. ఆవిధంగా ఉద్యోగస్థులు చేయవలసి ఉంటుంది. అప్పుడు ప్రభుత్వముకూడ వారికి ఈ వందరూపాయలేకాక ఇంకొక వందరుపాయలు ఎక్కువచేయడానికి కృషిచేస్తుంది. కాబట్టి గోపాలరెడ్డిగారి ప్రభుత్వము ఈవిధంగా చేయుటకు కృషిచేయవలెనని కోరుతూ, విరమిస్తున్నాను.

(At this stage Mr. Speaker resumed the Chair.)

**MR. SPEAKER :** I will just make one suggestion. Let the Hon. Members themselves impose some time limit for themselves. I do not want to fix the time limit. There are still some more Members to speak. We are now nearing 5-30. I would like to close the debate to-day only.

SRI T. VERARAGHAVALU :—అధ్యక్షా, N.G.Os. కు Central Pay Commission వారి సిఫార్సులు, అందులో వారి జీతాలకు సంబంధించినంత వరకూ అమలుజరపవలసిందిగా కోరుతూ శ్రీ వేమయ్యగారు తెచ్చిన తీర్మానముమీద సుదీర్ఘమైన చర్చ జరిగింది. అయితే N. G. O. ల కష్టనిష్ఠూరాలను గురించి ఆ కమిషన్ వారుచేసిన సిఫార్సులలో ప్రతి ఒక్క అయిటము, ప్రతి అక్షరముకూడా మనము ఒప్పుకోవచ్చు. దానిని గురించి యీ సభలో ఎవరికీగూడా అభిప్రాయభేధాలు

లేవు. కాని ఆ కమిటీదారు చేసిన సిఫార్సులు అమలుజరపటానికి, అందులో ముఖ్యంగా ప్రభుత్వానికివున్న ఆర్థిక స్తోమతు ఏమిటి అని ఆలోచించినట్లయితే, అది ఎంతో అవసరమని ఒప్పుకున్నప్పటికినీ, వారియందు ప్రభుత్వము సానుభూతి చూపించవలసింది తప్ప, డబ్బువిషయము వచ్చే టప్పటికి ప్రభుత్వము యే విధంగాను వారికి సహాయపడలేక పోతున్నది. కాని యిది చాలా దురదృష్టకరమైన విషయ మని చెప్పకతప్పదు. కాని దేశములోవుండే శక్తి, ఆదాయము పెరిగే టంతవరకూ, యీ N.G.O.లు చేస్తున్న సేవ ప్రశంసనీయమైనప్పటికీ, వారికి తగినంతమటుకు జీతాలు యివ్వలేకపోయామే న నేటటువంటి వాదన ప్రతివారికి హృదయములోను వున్నది. ఇది ప్రతిపక్షమువారికే కాదు. ప్రభుత్వ పక్షమువారికిగూడ లేకపోలేదు. అయితే ఒక్క విషయముమాత్రము మరచిపోకూడదని మనవిచేస్తున్నాను. ఎందువల్ల నంటే absolute standard of living మనస్సులో పెట్టుకొని N. G. O.లు అప్పుడప్పుడు ఆందోళన చేస్తూవున్నారని నేను భావిస్తున్నాను. ఈ సందర్భములో మనము ఒక్క విషయముగమనించాలి. Private service లో వున్న conditions of service ఏమిటి? గవర్నమెంటు సర్వీసులోవున్న conditions of service ఏమి? వీటి రెండింటిలోవున్న తేడా ఏమిటో గ్రహించవలసి వున్నది. గవర్నమెంటు సర్వీసులో వున్నవారికి tenure of service, stability ని గురించిచూస్తే, వీరికి మనము అనుకున్నంత దురదృష్టకరముగా లేదని చెప్పకతప్పదు. వీరికిsecurity and tenure of service అనేవి వున్నవి. పైగా ప్రతి ఒకటి, రెండు సంవత్సరములకు జీతాలలో increment అనేది వున్నది. ఇవికాక Provident Fund pension, పిల్లలకు చదువు, వైద్యసౌకర్యాలు, యింకా వారికి కావలసినవి యితర సౌకర్యాలు వుంటున్నవి. కాని ప్రైవేటు సర్వీసులోవున్న వారికి అలాంటి facilities ఏ విధంగాను లేవు. పైగా యజమానికి ఏనాడు ఏ క్షణములో యిష్టము లేకపోతే ఆనాడు ఆ క్షణములో అతను ఉద్యోగమునుంచి విరమించి పోవలసి వుంటుంది. అయితే N. G. O. లకు యిప్పుడు వున్న facilities చాలును. ఇక మీదట యేమీ యివ్వ నవసరములేద నే అభిప్రాయము నాకులేదు. కాబట్టి ప్రభుత్వానికివున్న ఆర్థికస్తోమతును బట్టి, వారికివున్న ఆదాయ వ్యయమునుబట్టి facliities యివ్వబడుతున్నవి. ప్రభుత్వానికి ఆదాయము పెరిగితే యింకను facilities కోరవచ్చు. వీరికేగాదు. దేశములోవున్న ప్రజానీకమునకందరికి కావలసినటువంటి క్షేమము చూచినట్లుగానే, వీరి క్షేమంకూడా ఆలోచించవలసే వస్తుంది. కాని ప్రస్తుత పరిస్థితులలోమాత్రము గవర్నమెంటును క్లిష్టపరిస్థితులలో దింపటానికి ఉద్దేశించి, యీ తీర్మానము తెచ్చినట్లుగా కనబడుతున్నది. కేవలము

ఇది ప్రచారాత్మక మయింది. ప్రచారముకోసము చేశారనే స్థితికి నేను దిగజారను కాని, వారు చెప్పేదాన్నిబట్టి చూస్తే, మేము గవర్నమెంటుకు చెప్పాము. వారు N.G.O.లకు ఏ విధముగాను సహాయము చేయలేక పోయినారు సుమా! అని ఒకటి ప్రభుత్వముమీద నిందమోపటానికి యీ తీర్మానము తెచ్చారని నేను భావిస్తున్నాను. ఇందులో కష్టమువున్నమాట నిజమే. కాదు అని చెప్పేవారు ఎవరూ లేరు. ఇది ఆచరణయోగ్యము అయినటువంటిది కాదు.

ఇక ముఖ్యంగా గ్రామ నౌకర్లువిషయము చూడండి. వీరిలో తలారి, వెట్టి అనేవారు వుంటున్నారు. వీరు ఆర్థికంగా సాంఘికంగా ఒకజాతికి చెందినవారు. ఆరంభములో వీరికి నిర్ణయించిన జీతము 7, లేక 8 రూపాయలుమాత్రమే. ఇప్పుడు దాన్ని 18 రూపాయలకు ప్రభుత్వమువారు పెంచారు. ఇది యదార్థ విషయమే. N.G.O.లను గురించి ఆ కమిటీవారు ఎంతెంత voluminous గా వ్రాసినప్పటికిన్నీ, గ్రామ నౌకర్లనుగురించి ఒక్క వాక్యముఅయినసూ వ్రాయలేదు. అంటే ఈ గ్రామ నౌకర్లు ఆ కమిటీవారి దృష్టిలోకి రారు, వచ్చివుండరు. ధనముగలవారి రాజ్యము, ధనముగలవారి కూడు అనే సామెత ప్రజాస్వామికానికి అర్థము అయితే నిజముగా మనము అందరముకూడా చాలా విచారించవలసిన పరిస్థితులు ఏర్పడేవి. ప్రతి వెట్టివాడుకూడా వుదయము లేచినప్పటినుంచి, చేసే పని ఆలోచించినట్లయితే, వాడు part time servant అని మనము అంటున్నాము. కాని తానువున్న గ్రామానికి పదిమైళ్లదూరములోవున్న Taluk Headquarters కు వెళ్లమని అంటే, అతని పరిస్థితి ఎట్లా వుందంటే, గ్రామ పెద్దలు చెప్పినా వినవలసినదే, గ్రామ కరణముగాని, మునసబుగాని చెప్పితే వినవలసినదే. ఇంకను ఏ పనిలేకుండా గ్రామకరణము, మునసబు బయిళ్లముందు నిలుచున్నప్పుడు, వారి యింటిముందరవున్న పందిరిగుంజ పీకి మరల పాతమని ఆదేశిస్తారు. ఆ పనికూడ వాళ్లు చేయవలసినదే. పనివున్న లేకపోయినా, దినముకూడ వుదయమునుంచి సాయంత్రమువరకు ఈ గ్రామఉద్యోగస్థులయిళ్లవద్ద హాజరు కావలసివుంటుంది. ఇట్టి పరిస్థితులు యీ గ్రామనౌకర్లకు ఏర్పడివున్నప్పుడు వీరు part-time servant ఏ విధంగా అవుతారో గుర్తించాలి. పనిమాత్రము ఒక నిమిషమాత్రమైనను తీరిక లేనిదిగా వున్నప్పుడు, వాళ్లకుయిచ్చే జీతముమాత్రము ఎదుగుబొదుకు లేకుండా వుంటున్నది. ఈ గ్రామనౌకర్ల జీతము విషయము మాత్రము ముఖ్యంగా ప్రభుత్వమువారు ఒక administrative order ద్వారానైనా పెంపుదల చేయటానికి వీలున్నదేమోనని అనుకుంటున్నాను. ప్రభుత్వమువారు యీ గ్రామ నౌకర్ల కష్టసుఖాలు పరిశీలిస్తారని అనుకుంటాను. వారికిచ్చే ప్రయాణపు ఖర్చులు అతి స్వల్పము. మైళ్ళకొద్ది నడిచిపోవలసిన పరిస్థితిలో వుంటున్నారు. ప్రభుత్వము

వారు వాళ్లకు యిచ్చే జత్యము పరిశీలించ తగ్గది. వారియొక్క సాధకబాధకములు అందరికినీ తెలుసు. ఇటువంటివారు ఎంత నికృష్టముగా జీవితములు గడుపుకుంటున్నారో ఆలోచించి, వీళ్ళకు ఏదైనా చేస్తే బాగా వుంటుంది. గ్రామాలలో ప్రజల అభిమానానికి పాత్రులైనవాళ్లు. కాబట్టి మా గ్రామ నౌకర్లకు ప్రభుత్వమువారు సహాయ పడతారని ఆశిస్తున్నారు. ఇటువంటి తీర్మానమును నేనుబలపరచలేక పోయినందులకు చాలా విచారపడుతూ విరమిస్తున్నాను.

SRI. C. P. THIMMA REDDI :—అధ్యక్షా, మామూలుగా ప్రతి మానవుడూ దుఃఖము వద్దని సుఖము కావలయునని కోరుతూ వుంటాడు. సుఖము అంటే ఎట్లావుంటుంది, దుఃఖముఅంటే ఎట్లావుంటుంది అనేది ఇప్పుడు తెలుసుకొనవలసిన విషయము. అందువల్ల దుఃఖరాహిత్య ఆనందప్రాప్తి ప్రతిజీవి సహజంగా కోరుతూఉంటుంది. సుఖముఅంటే ఎక్కడఉంటుంది, ఎట్లావుంటుంది అనేదే సమస్య. ఈ సుఖముఅనేది ఏకమా, అనేకమా అనేది మొదటి సమస్య ఈ సుఖము అందరిలో ఒకేరకంగా ఉన్నదా, లేక వేరువేరు విధములుగా ఉన్నదా ఒకవేళ ఒకేరకంగా ఒక స్థలంకుఉంటే సామాన్యముగా ప్రపంచంలోని ప్రజలందరికి సప్లయి చేయవచ్చును. మనస్సు ఒకటి కోరుతుంది. అనుభవించే ఇంద్రియములు ఉన్నాయి. బహిర్ ప్రపంచములో అనే విషయసామగ్రి ఉన్నది. ఈ మూడింటియొక్క కలయిక విషయానందము అని చెప్పబడును. అంటే మనస్సునకు అనుగుణంగా బహిర్ ప్రపంచములో భోగవస్తువులు కావాలి.

స్పీకరుగారు కొంచెము ఎక్కువ కాలవ్యవధి యిస్తే యింకా వివరంగా చెప్పగలను.

MR. SPEAKER :—మీకు కాలనియమములేదు. మీయిష్టము వచ్చినంత కాలము మాట్లాడవచ్చును. కాని మీరు వేదాంతముగురించి మాట్లాడేదానికంటే కమీషనుయొక్క సిఫార్సులను గురించి మాట్లాడితే బాగుంటుంది.

SRI C. P. THIMMA REDDI :—నేను దానినిగురించే మాట్లాడుతాను. కాని మనవాళ్ళంతా ఒకదానిని ముంచిపెట్టి ఇంకోదానిని తీసుకునివస్తున్నారు ఎక్కడ సుఖములేదో అక్కడ సుఖము వున్నదని చెబుతున్నారు. అందువల్ల దానిని గురించి మొదటిదిగా చెప్పాలి. ముఖ్యముగా సుఖము అనేటటువంటిది తన మనస్సులోఉన్న అభిప్రాయానుసారముగా బయట ప్రపంచములో అందుబాటులో వున్నప్పుడు సుఖము అంటున్నారు. ఒకఅబ్బాయి కాలేజీలోచదివే రోజులలో, అతనికి

అతనితండ్రి ఎట్లాగో కష్టపడి రు. 100 లు పంపిస్తున్నాడు. ఆ అబ్బాయి కాలేజీ చదువు ముగించుకొని బయటకువస్తే 50, 60 రూపాయిలకన్నా ఎక్కువ సంపాదించలేడు. అందువల్ల దానితోనే జీవితమును గడపవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. అంతకు పూర్వమే ఏ కట్నముకోసమో వివాహము అయివుంటే అప్పటికి ఒకరిద్దరు సంతానము, తనకోసం సర్వము త్యాగము చేసినటువంటి తలిదండ్రులు భార్య కలిసి ఒక కుటుంబముగా తయారవుతారు. అందువల్ల ఇప్పుడు వచ్చిన చిక్కు ఏమిటంటే తాను కాలేజీలో చదువుకునే రోజుల్లో ఎట్లా సుఖమును అనుభవించాడో ఆ విధముగానే ఇప్పుడుకూడా కావలయు నంటున్నాడు. వందరూపాయిలతో ఒకే వ్యక్తి కొంతకాలము జీవించి, తరువాత అంతకు తక్కువడబ్బుతో యింకా 4గురు, 5గురు గల కుటుంబము పోషించవలసివస్తే చాలా కష్టము అవుతుంది. ఈ రూపంగా భోగ సామగ్రిని ఒక్కొక్క వ్యక్తికి అనుగుణంగా, అనగా తన ఉద్దేశానుసారంగా ప్రపంచంలో అందుబాటు చేయాలంటే సాధ్యమా కాదా అనే విషయం ముందు చూడాలి. ధనం ఎంతో విచ్చలవిడిగా ఉంటే ఆ సదుపాయములు అన్నియూ కలుగచేయవచ్చు. దానికి ఏమీ సందేహములేదు. కాని వద్దని ఎవరూ చెప్పరు. నాలుగులక్షలు వున్నవాడికి సుఖము ఎప్పుడు వస్తుంది అంటే పదిలక్షలు వచ్చినప్పుడు అంటాడు. వందరూపాయలు వస్తున్నప్పుడు అతనికి సుఖము ఎప్పుడు వస్తుంది అంటే రెండువందల రూపాయలు సంపాదించినప్పుడు వస్తుంది. ఏబది రూపాయలు వచ్చేవాడు అరువది రూపాయలు వచ్చినప్పుడే సుఖము ఉంటుంది అంటాడు. అట్లానే పైగ్రేడు కావాలనేవాడు వుంటాడు తప్ప క్రిందగ్రేడు కావాలనేవాడు ఒక్కడూ వుండడు. ఈ విషయం ప్రతిజీవిలోనూ ఉంటుంది. నిజముగా మనయొక్క స్తోమతుఎంత, మనకుఉన్న డబ్బు ఎంత అనే దానినిబట్టి ఏరకంగా మనము విషయ సామగ్రిని అభివృద్ధి చేసుకోవచ్చును అనేది ఆలోచించుకోవాలి. పూర్వము ప్రివెంటివు పద్ధతి అనేది ఒకటి వున్నది. పూర్వమువున్న మనశాస్త్రము ఏమి చెబుతున్న దంటే మనస్సులోవున్న కోరికను సారముగా విషయసామగ్రిని తీసుకువచ్చి పెట్టినా ఒకటే, లేకుంటే విషయసామగ్రి ఎంత అందుబాటులోఉన్నదో దానికి అనుగుణంగా మన మనస్సును మార్చుకున్నా ఒకటే. దీనికే మనశ్శాంతి అంటారు. శాస్త్రము కోరికలు ఎక్కువ కాకుండా, రజోగుణం ప్రజ్వలింపకుండా అరికట్టే విధానం బోధిస్తుంది. అందువల్ల మనశాస్త్రాలు, మానవుని ఒక స్టేజికి తీసుకొని వచ్చి పెట్టగలవు. ప్రాశ్చాత్య నాగరికత మనకు వచ్చింది. పాశ్చాత్యులయొక్క ఫిలాసఫీ ఏమి చెబుతుంది అంటే, నువ్వు ఏమికోరుతావో దానిని బహిర్ ప్రపంచములో సమకూర్చి అనుభవించి ఇది సుఖముఅని అనుకోమంటాడు. కాని హిందూ ఫిలాసఫీలోఉన్న

మహత్తర మైనటువంటి విషయము అదికాదు. నువ్వు ఒక అసెంబ్లీకి మెంబరుగా ఎన్నికైవచ్చావు అనుకోండి. నీకు 150 రూపాయలు జీతము, బత్తా రు. 12-8-0 లు ఇస్తున్నారు అనుకోండి. దానికి అనుగుణంగానే నీవు నడుచుకోవాలిగాని లేకుండా నాకు రు. 50 లు బత్తాయే కావలయునని అనుకొంటే ప్రయోజనములేదు. నీకు ఏదైతే వస్తుందో దానికి అనుగుణంగానే నీయొక్క అవసరములను మార్చుకోవలయును. అట్లాగే మానవునియొక్క కోరికానుగుణ్యంగా విషయసామగ్రిని సంపాదించిపెట్టితే దానికి బదులుగా, నీకు అందుబాటులోవున్న విషయసామగ్రితోనే తృప్తిపడమని శాస్త్రము చెబుతున్నది. దానిని మన కమ్యూనిస్టు సభ్యులు కర్మఫలం అని హేళనచేస్తారు. అసలు వారికి నిష్కర్మఅంటే ఏమిటో తెలియదు. వాళ్లు భగవంతుడు లేనేలేడని అంటారు, ప్రపంచము అంటే ఏమిటి, దీనియొక్క పంథా ఏమిటి అని వాళ్లకు అక్కరలేదు. ప్రజలను ఎప్పుడూ రెచ్చగొట్టడమే వారికి ప్రధానము. పూర్వము ప్రతిపూరిలోను ఒకరిద్దరు యిటువంటివారు ఉండేవారు. వారిద్దరితోనే ఆ రోజుల్లో తంటాలు పడేవారు. వారికి పూర్వము నవరపునారిగాళ్లు అని పేరు. ఇప్పుడు వారినే కమ్యూనిస్టులు అని అంటున్నారు అనుకోండి. అత్తాకోడళ్లకు, అబ్బాకొడుకులకు, అన్నాదమ్ములకు తగాదాలు పెట్టడమే వారిపని. ఒక యింటికిపోయి ఏమయ్యా, మీఅన్న కోర్టులో అట్లా దర్జాగా తిరుగుతూంటే, నీవు యిట్లా కష్టపడి వ్యవసాయము చేస్తావు ఎందుకు అని అడుగుతూంటారు. ఈయనమీద మహా ప్రేమఉన్నట్లు. సహజంగా వారియొక్క ఉద్దేశ్యము వారియొక్క కుటుంబంలో ఒక కలహము రెచ్చగొట్ట వలయునని. మనశత్రువు మనశత్రువునకు మిత్రుడు, మనమిత్రునకు శత్రువు సాధారణముగా శత్రువర్గములోకి వస్తుంటాడు. మనకున్మిత్రుడు మనమిత్రునకు మిత్రుడు, మన శత్రువునకు మిత్రుడు సాధారణముగా మిత్రవర్గములోనికి వస్తుంటాడు. ఎవరెవరు యేయే సమయములో వారికి అవసరము వస్తారో వారిని ఉపయోగ పెట్టుకొనడానికి ఈ విధముగా బేధోపాయం చేస్తారే కాని నిజముగా వారియందు ప్రేమ వాత్సల్యములు ఉన్నాయనికాదు.

MR. SPEAKER :—మనము చర్చిస్తున్న విషయం జీతాలను గురించి.

SRI C. P. THIMMA REDDI:—గవర్నమెంటులో ఉన్న డిపార్టుమెంటులన్నీ కలిసి ఒక కుటుంబము కాబట్టి ఆ కుటుంబములోవున్న వారికి ఇప్పుడు వున్న పరిస్థితుల్లో కొంతమందికి ఎక్కువ జీతము, కొంతమందికి తక్కువ జీతము అనేది వుండవలసినదే. తెలివిగలవారికి ఎప్పుడు ఎక్కువగా ప్రాముఖ్యము ఉంటుంది. విజ్ఞాన సంపన్నులకు విజ్ఞాన వేత్తలకు ఎప్పుడుఅయినా విలువఉంటుంది. అందువల్ల ఏ ప్రభుత్వము ఉన్నాసరే ఉద్యోగస్థులలో ఈవిధముగా తేడాలు వుండక తప్పదు. జీతం పెంచమని

చెప్పడము ఏదో రెచ్చగొట్టడానికి ప్రచండమార్గము ఆలోచిస్తున్నారు గాని, యిది కేవలము మనస్ఫూర్తిగా చేస్తున్నది మాత్రము కాదు. పేపర్లో ఈ చిన్న ఉద్యోగస్థులంతా చూచి మన ప్రతిపక్ష మిత్రులంతా మనకోసం ఎంత కష్టపడుతున్నారో అని అనుకుంటారు. అటువంటి దృష్టితోనే వారు తీర్మానమును తీసుకువచ్చారు. మేము కూడా వారలను గురించి మాట్లాడితే డబ్బు యివ్వవలయునని మాట్లాడాలి. అట్లా మాట్లాడకపోతే ఇంటికి వెళ్లిన తరువాత అంతా అడిగేటట్టు చేస్తారు. ఇదిఅంతా పేరు ప్రతిష్టలుకొరకే కాని ఆ ఉద్యోగస్థుల యెడల వారికి దయఅనేది వున్నదాఅని అడుగుతాను. నిజముగా మీకు దయఅనేదివుంటే ఇప్పుడు రాష్ట్రీము ఏ పరిస్థితిలో వున్నదో గమనించే ఈ తీర్మానమును ప్రవేశపెట్టినారా ? ఇప్పుడు మనరాష్ట్రీము లోటుబడ్జటులో ఉన్నది. ఇప్పుడు మనము కొత్తపన్నులు వేసేదానికి ఒప్పుకోకుండా వున్నాము. కేంద్రప్రభుత్వమువారి దగ్గరకుపోయి అప్పుతెచ్చుకొనేదానికి ప్రయత్నము చేస్తున్నాము. కేంద్రప్రభుత్వమువారు ఈ అప్పు మీరు మరల ఎట్లా తీరుస్తారు అని అడిగితే మనము సమాధానము చెప్పలేక నానాయాతనలు పడుతున్నాము. అధికపన్నులువేస్తే రైతులు మేము తీర్చలేమని చెబుతున్నారు. ఇటువంటి పరిస్థితిలో మనము మోరిటోరియము బిల్లుకూడా ప్రవేశపెడతామన్నారు.అందువల్ల మన రాష్ట్రీబడ్జటు చాలాలోటుబడ్జటుఅయి దానినిపూడ్చడానికి నానాయాతనలు పడుతున్నాము. మనకుఎప్పుడూ ఖర్చేకాని, జమఅనేది కనిపించడములేదు. ఒకకోటి రూ॥లు అప్పుతెచ్చి ఈ ఖర్చు పెడుతుంటే దానిమీద సాలుకు మూడులక్షల రూపాయిలువడ్డీ కట్టవలసి ఉంటున్నది. ఇప్పుడు మనకు ఖర్చు 125 కోట్ల రూపాయిలు అవబోతూ ఉంటే దానిమీద మూడు కోట్లరూపాయిలు వడ్డీ కట్టవలసివస్తుంది. సేల్సుటాక్సు,ధరలు ఎక్కువగా వున్నప్పుడు ఎక్కువగావచ్చినది. ఈ ప్రొద్దుధరలు పడిపోయినవి. ఇదివరకు వేరుశనగ మణుగు ఒకటికిరు. 8లు, రు. 9 లు అమ్మేటటువంటిది ఇప్పుడు 3,4, రూపాయిలు పడిపోయింది. ఈ పరిస్థితిలో సేల్సుటాక్సుకూడ తగ్గినది. మనము లోటునుఎట్లా భర్తీచేయాలి. ఇది ప్రజా గవర్నమెంటు కాబట్టి, ఇందులో కష్టసుఖాలకు అందరు బాధ్యులు కావలసిఉన్నది. మనకు ఈ రోజు అప్పులన్నీ చాలావరకు పెరిగిపోతున్నవి. వాటిని తీర్చుకోవలయును. వాటి తీర్చేవారు యన్. జీ. ఓ. లు కాదు. గెజిటెడ్ ఆఫీసర్లుకాదు. లేదా మనము కాదు, మంత్రులుకాదు, భూస్వాములు తీర్చవలయును. ఎవరికి-భూమిఉన్నా అందరిభూమికలిసి దానికి సెక్యూరిటీ. ఆ భూమివల్ల వచ్చేపంటపైనే తీర్చాలి. రాష్ట్రీము ఎప్పుడుఅయినాసరే దానిపైనే ఆధారపడిఉన్నది. రైతు కూలీకాని, రైతులుకాని దీనికి సంబంధించినవారే. మిగతా వారందరుకూడా వారికి ఇష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టవలయుననువారే. ఇప్పుడువున్న పరిస్థితినిబట్టిచూస్తే జిల్లాబోర్డులు ఏ పరిస్థితిలో వచ్చాయి ? ఉన్నమొత్తముఅంతా

Sri C. P. Thimma Reddi] [24th Sep. 1955

ఇష్టము వచ్చినట్లు ఖర్చుపెట్టివేశారు. ఎవరు ఏది అడిగినా శాంక్షనుచేసివేశారు. ప్రస్తుతంసదరు డిపార్టుమెంటులోని వుద్యోగస్థులు సకాలంలో జీతంముట్టక అవస్థపడుచున్నారు. రాష్ట్రముకూడా ఆ పరిస్థితిలోకే వచ్చేట్లుఉన్నది. అటువంటప్పుడు మనము కేంద్రప్రభుత్వము దగ్గరకుపోయి అప్పుఇవ్వమని అడగవలసివుంటుంది. అప్పుఇచ్చేవాళ్లు, అప్పు తీసుకునేవాళ్లకు మరలతీర్చే కెపాసిటీ ఉన్నదా లేదా అని ఆలోచిస్తాడు. అందువల్లనే మనము దీనిని మనము పరోక్షముగానో, అపరోక్షంగానో అర్థము చేసుకోవాలి. ఒకవేళవాళ్లు మనం పెద్దమనుష్యులము కదా అని బాహాటంగా బయటకు ఏమీ అనలేకపోవచ్చును. కాని లోపల, భావించవచ్చు. అందువల్ల మనము ముందుగా ఏవిధముగా తీర్చుకోవాలో అన్నీ ఆలోచించుకొని వెళ్ళి అప్పుతెచ్చుకొనవలసివుంటుంది. ఏ వ్యక్తిగాని, ఏ రాష్ట్రముగాని ఎప్పుడు అయితే స్వయం పోషకము కాగలిగివుంటే ధైర్యము, వుత్సాహము అనేది వుండును. అప్పుల సంసారము ఒక సంసారము అనిపించుకోదు. అప్పు ఆస్తిగాదు. వాపుబలుపుకాదు, అని ఒక సామెత. అది తాత్కాలికంగా బాగా కనిపించవచ్చును. ఎంతవాపు వున్నప్పటికీ లోపల ఒకరోగం వున్నదని మనము అర్థము చేసుకోవలసిఉంటుంది. నిజముగా మనము ఈ రోజున ఇన్నికోట్ల రూపాయిలు ఖర్చుపెడుతున్నామంటే దానివల్లకలిగే పరిణామము ఏమిటో ఆలోచించుకోవలయును. ప్రాజెక్టులక్రిందనేమి, ఎలక్ట్రిసిటీ ప్రాజెక్టులక్రిందనేమి మనము ఎన్నికోట్లరూపాయిలు ఖర్చుపెడుతున్నాము, వాటిమీద మనకు 5 సంవత్సరముల పోయినతరువాత ఎంతఆదాయమువస్తుందో లెక్కవున్నదా ? 5 సంవత్సరముల తరువాత ప్రాజెక్టు క్రిందస్టాఫ్ ఖర్చులుపోగా మనకువచ్చే ఆదాయము ఎంత ? ఇదే ప్రకారముగాచూస్తే మనము ఎంతవరకు ఖర్చుపెడుతున్నాము ? వడ్డీడబ్బులు అయినా గిట్టుతున్నాయా ? ఒకవేళ అవికూడా రాకపోతే దీనిగతి ఏమిటి ? ఇది ఎట్లా తీర్చుకోవాలి అన్నీ విషయములనుకూడా ఆలోచించుకోవాలి. ఈ విధముగా ఎన్నో సాధకబాధకాలు ఉన్నాయి. అయినా ఖర్చులను పెంచడము అనేది సాధ్యముకాదు. ప్రతిపక్ష సభ్యులకు సాధ్యముఅని చెప్పవచ్చును. ఎందువల్లఅంటే వారు ఈ ప్రభుత్వమునకు ఏమిచేయడము చేతగాదు. మేము ఇట్లా చేయాలనిచెప్పినా కూడా చేయలేకుండా ఉన్నారు అనే ప్రచారముకోసము వారు ఈ తీర్మానమును తీసుకువచ్చినట్లు కనబడుతున్నది. వాళ్ళధర్మము అదే. ఎందుకుఅంటే వారు అపోజిషను పార్టీవారుకదా ? ఇది అంతా బాధ్యతగలిగినవారికి తెలుస్తుంది. కుటుంబములో సంపాదించేవాడికి కష్టసుఖము తెలుస్తుంది కాని, ఖర్చుపెట్టేవాడికి తెలియదు. ఇది తెండి, అది తెండి, 100 రుపాయిలు చీరతెండి, రెండు వందల రూపాయిల చీరతెండి అనిచెప్పడమేగాని, ఎట్లా తెస్తారు అనేది తెమ్మన్నవారికి

అవసరములేదు, చిన్నప్పుడు పిల్లలు ఆటలాడుతూ తిందాము, తిందాము అంటారు. ఎక్కడనుంచి తెచ్చి తిందాములంటే అప్పుతెచ్చి తిందాము అంటారు. కాని అప్పు తీర్చవలయును గదా. ఆ విధముగానే మనము అప్పుతీసి తీసుకువచ్చి పనులు జరుపు కుంటే తరువాత ఎట్లా తీరుస్తారో కూడా ఆలోచించవలయును. రాష్ట్రము అభివృద్ధి చెందినప్పుడు మనము అంతా ఉన్నతస్థితికి వచ్చినప్పుడు మన రాష్ట్ర ఆదాయము పెరిగి నప్పుడు ఇటువంటి విషయములు ఆలోచించుటకు వీలుండును. అందువల్ల ఇటువంటి అగమ్యగోచరమైన పరిస్థితులు ప్రభుత్వమువారికి కలుగజేయకుండా ఈ తీర్మానమును ఉపసంహరించుకోవలయునని నా మిత్రులకు మనవి చేస్తున్నాను.

MR. SPEAKER : We will continue the debate on the 29th which is the next non-official day. The same discussion will continue on that day. I am now adjourning the business of the House Till 11 o'clock on Monday the 26th September, 1955.

The House then adjourned.

Appendix I.

[Vide:—Answer to Legislative Assembly (Starred) Question No. 975, printed at page 296 supra].

*Clause* (a).—The total amount of revenue derived by the Government on Motor Vehicles during the years 1951–52 and 1953–54 in each district are as follows :—

| District | | 1951—52. | | | 1953-54. | | |
|---|---|---|---|---|---|---|---|
| | | RS. | A. | P. | RS. | A. | P. |
| Srikakulam | ... | 6,35,608 | 11 | 0 | 8,44,632 | 2 | 8 |
| Visakhapatnam | ... | 9,23,310 | 8 | 4 | 10,58,200 | 3 | 5 |
| East Godavari | ... | 11,67,229 | 10 | 0 | 16,54,236 | 6 | 0 |
| West Godavari | ... | 10,44,795 | 0 | 0 | 11,83,496 | 0 | 0 |
| Krishna | ... | 18,54,190 | 7 | 9 | 23,65,215 | 5 | 9 |
| Guntur | ... | 19,22,163 | 6 | 10 | 24,54,037 | 15 | 11 |
| Nellore | ... | 9,37,549 | 0 | 9 | 11,80,346 | 11 | 3 |
| Chittoor | ... | 10,05,569 | 8 | 0 | 13,34,289 | 14 | 2 |
| Kurnool | ... | 6,73,748 | 12 | 3 | 9,94,999 | 5 | 4 |
| Cuddapah | ... | 10,15,405 | 10 | 0 | 9,87,135 | 2 | 11 |
| Anantapur | ... | 7,07,348 | 6 | 0 | 9,61,057 | 0 | 10 |
| Total | ... | 1,18,86,919 | 0 | 11 | 1,50,17,646 | 4 | 3 |

*Clause* (b).—The number of stage carriages was 2,126 on 31st December 1952 and 2,190 on 31st March 1954.

K. N. ANANTARAMAN,
*Secretary to Government.*

*VIDE*—ANSWER TO LEGISLATIVE ASSEMBLY QUESTION No. 702 (STARRED) BY SRI P. GOPALA KRISHNA REDDY, M.L.A., printed at page 296 supra.

A copyist in the Judicial Department is paid remuneration at the rate of annas 2, for every 175 words copied, subject to a minimum of Rs. 30, per mensem. The payment of extra remuneration is however subject to the recovery being made up to the amount of any excess paid in either or both the two last working months to make up the minimum salary at the rate of Rs. 30, per mensem. The copyists are also eligible to dearness allowance at the usual rates on their total monthly earnings. In addition they are paid a machine allowance of Rs. 2-8-0 a month since they are required to provide their own typewriters.

2. There are two categories of copyists in the Revenue Department, namely :—

(i) Copyists working on a fixed monthly salary ; and

(ii) Copyists working on a piece-time basis.

In the case of category (i), the earnings of the copyists in excess of their fixed salary are disbursed to them as bonus. They are also paid dearness allowance when their average emoluments including bonus, do not exceed Rs. 30, per mensem.

The copyists of category (ii) are remunerated from the fees realised from copy applications, at the rate of 0-2-6 for every 175 words copied. They are not entitled to any dearness allowance.

M. T. RAJU,
*Secretary to Government.*

## INDEX TO THE ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

### FIRST SESSION OF THE SECOND LEGISLATIVE ASSEMBLY UNDER THE CONSTITUTION OF INDIA

### After the Formation of the Andhra State

Volume VIII—Nos. 1, 2 and 3, 22nd, 23rd and 24th September 1955

TABLE OF CONTENTS

**Thursday, 22nd September, 1955.** PAGES



**Friday, 23rd September, 1955.**



**Saturday, 24th September, 1955.**

# INDEX

## A

Pages



## B

B.—Contd. Pages

G.—*Contd.*



D



E



F



G

G.—*Contd.*

J.—*Contd.* Pages

L.—*Contd.*

M—*Contd.* Pages

O.—*Contd.* Pages

Q.—*Contd.*

Q.—*Contd.* Pages

O—*Contd.*

R.—*Contd.* Pages

S.—*Contd.*

S.—*Contd.* Pages

V.—Contd.

Pages

V.—Contd. Pages

